# తాౘాచరిత్రము.

కోమాండూరి శఠకోపాచార్యులు,
ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.

ఈరచయితదే,

# 'జగత్కథ'

అపూర్వగ్రంథము.

భూమి ఉత్పత్తి- జీవారంభము- పూర్వయుగముల విచిత్రజంతువులు- వానిక్రమపరిణామము- నరజాతి ఆరంభము- ఆయామతముల నాగరికత పుట్టుక- వానిపరస్పరసంబంధము- నేటివరకు ప్రపంచమంతటి ఆర్థిక సాంఘికరాజకీయచరిత్రము- ఇంక ననేకవిషయములు నిందు వివరింపబడినవి.

సుమారు 760 పుటలు. గ్లేజు కాకితములు 22 పటములు. చక్కని కాలికో బైండు.

వెల రు 3-0-0.

A

పెనమలూరు.

# తాతాచరిత్రము.



కోమాండూరి శఠకోపాచార్యులు,
ఎం. ఏ., బి. ఎల్., కాకినాడ.



జంషెడ్జీ నస్సర్వాంజి తాతా.

F

# విషయసూచిక.


| అధ్యాయములు. | | పుటలు. |
|---|---|---|
| చిత్రపటసూచి | ... | ౪ |
| భూమిక | ... | ౫ |
| 1. పార్సీలు | ... | 1 |
| 2. జాంషెడ్జి బాల్యము | ... | 6 |
| 3. వ్యాపారారంభము | ... | 10 |
| 4. వస్త్రపరిశ్రమ-ఎంప్రెసుమిల్లు | ... | 17 |
| 5. ,, స్వదేశీ అడ్వాన్సుమిల్లులు | | 27 |
| 6. కొన్ని వ్యాపారసమస్యలు, ప్రత్తిపంట | ... | 35 |
| 7. నౌకావ్యాపారము | ... | 38 |
| 8. కార్మిక సమస్య | ... | 47 |
| 9. బట్టలపన్ను | ... | 51 |
| 10. పట్టుపరిశ్రమ | ... | 58 |
| 11. పౌరసేవ | ... | 62 |
| 12. విజ్ఞానవర్ధనము | ... | 75 |
| 13. లోహయంత్రశాల | ... | 88 |
| 14. జంషెడ్పురము | ... | 106 |
| 15. జలవిద్యుచ్ఛక్తి | ... | 113 |

ౘ

అధ్యాయములు. పుటలు.


| | | | |
|---|---|---|---|
| 16. | అంత్యదశ | ... | 130 |
| 17. | ఇతర తాతాసంస్థలు | ... | 137 |
| 18. | తాతా స్వభావము | ... | 144 |
| | ముఖ్యవృత్తాంతములు. | ... | 163 |
| | పారిభాషికపదసూచి | ... | 165 |


---

## చిత్రపటములసూచి.


| | |
|---|---|
| జంషెడ్జితాతా | ముఖపత్రము. |
| తాజ్ మహాల్ హోటలు | పు. 71 ఎదుట. |
| విజ్ఞానాలయము | పు. 84 ఎదుట. |
| నలుగురు 'తాతా'లు | పు. 132 ఎదుట. |


---

# భూమిక.

---

ఆయా కాలపు మహనీయులచరిత్రమే ఇతిహాసపు సారమని కొందరిభావన; అది యెట్లున్నను ప్రతిభావంతులగు నాయకపురుషుల జీవితచర్యలు సమకాలికులకే గాక, క్రిందితరములకును, స్మరణీయములు, అనుసరణీయములు; వారిజీవితచర్యల వలన దేశమంతటి పరిస్థితులును మారుచుండును. అట్టివారి సత్కార్యచర్యలను ప్రవృత్తిని గ్రంథస్థముచేయుట యవసరము. సత్పురుషుల ఘనకార్యములను గ్రంథములందు జదువుటచే, మనహృదయములందు నుదారభావములు, సత్కార్యప్రేరణ, కల్గును. చక్కగవ్రాసిన జీవితచరిత్రములు ఆయాకాలపు ఇతిహాసమును దేశస్థితినిగూడ గ్రహించుటకు చాలనుపయోగకరములు; అవి యువకులకు మార్గదర్శకములగును. అందుచే జీవితచరిత్రములు వాఙ్మయమున నొకముఖ్యభాగముగ నెంచబడును.

ఆంధ్రవాఙ్మయమున నిట్టిగ్రంథము లంతగా లేవు; ఉన్నవి ముఖ్యముగ మతరాజకీయములకు సంబంధించినవి. కాని మతముకు రాజకీయములకునిచ్చు ప్రాముఖ్యమును మనవారార్థికపారిశ్రామికములకిచ్చుటలేదు. తెలుగునపారిశ్రామికనాయకుల జీవితచరిత్రము లేకుండుట కిదియొక ముఖ్యకారణము కావచ్చును.

ఆదర్శపురుషులుగ నెంచదగిన రాజకీయనాయకులు ప్రవక్తలు మనదేశమున చాలమందికలరు; పారిశ్రామికనాయ

కులు మాత్ర మరుగు. ఆధ్యాత్మికరాజకీయములందు ప్రజ్ఞ యెంత యున్నను, ఆర్థికపరిస్థితి బాగుగ లేనిచో, నేలవిడచిసాముచేయు నట్లుండును; అట్టిస్థితిలో, ఏవిషయమందును సంఘము సరిగ వృద్ధి జెందదు. అందుకు, చీనాభారతదేశముల ప్రస్తుతస్థితియే ప్రబల నిదర్శనము. ఆర్థికపరాధీనత రాజకీయ వశత కన్నను ఎక్కువ హానికరమని ప్రాజ్ఞులగు మహనీయుల యభిప్రాయము.

ప్రస్తుతకాలమున మనయిండ్లలో సాధారణముగా వాడు వివిధవస్తువు లేదేశపువో పరీక్షతో గమనించుచో, మనమెట్టి ఆర్థికదుర్దశలో నున్నామో స్పష్టమగును. విదేశీయులు విజ్ఞాన సహాయమున తమ దేశములందు మహాయంత్రముల నిర్మించి, అందు బహుళోత్పత్తి మూలమున చౌకగ వస్తువులను తయారు జేసి మనకంపుచున్నారు. వానిదిగుమతిని నిరోధించుట సాధ్యము కాదు. వాని నాడుక హెచ్చుటచే, ఇచటి దేశీయపరిశ్రమలు నశించినవి; కొన్ని మూలకుతొలగినవి. ఇటీవల సుమారేబదియేండ్ల నుండి మనదేశమునను కొలదిమంది పారిశ్రామికులు పాశ్చాత్య పద్ధతినే వైజ్ఞానికముగ యంత్రాలయముల నేర్పరచి, పరిశ్రమల స్థాపించి, కొన్నివస్తువులను తయారుచేయుచున్నారు. వారిలో నగ్రగణ్యుడు 'జంషెడ్జి నస్సర్వంజీ తాతా'. ఈయన దూరదృష్టి, బుద్ధికుశలత, వ్యాపారదక్షత, దాతృత్వము, మన దేశమందసమానములు. ఈయన పారిశ్రామికరంగమున సాటిలేని కర్మ వీరుడు; ఈమహనీయునిచరిత్రము నాంధ్రులందరును తెలుసు

క్కాన దగుననితోచి, తాతా మిత్రులగు కీ. శే. సర్ డిన్షావాచా గారు రచించిన life and Life work of J. N. Tata నుండియు పత్రికావ్యాసములు మున్నగు వానిని బట్టియు, 1917 లో నొకపుస్తకమును వ్రాసియుంటిని. దానిని నామిత్రులగు కావ్యనిధి శ్రీ చెలికాని లచ్చారావుగారు 'తాతా జీవితము' అను పేరుతో 1921 లో శ్రీరామ విలాసగ్రంథమాలలో అచ్చువేయించిరి. అనేకగ్రంథముల బ్రచురించియు, పండితసహాయ మొనర్చియు, ఆంధ్రభాషకు సేవయొనర్చిన శ్రీ లచ్చారావుగారు 1923 లో అకాలమరణము నొందిరి. ఆపుస్తకము మరల నచ్చుపడలేదు.

'తాతా జీవితము' వ్రాయునప్పటికి, మనయార్థికపరిస్థితి బాగుపడుటకై ఆవశ్యకవస్తువులన్నిటికిని ఆధునిక పాశ్చాత్య యంత్రములతో పెద్ద 'ఫ్యాక్టరీ'లనేర్పర్చి, అట్టిపరిశ్రమలను మన దేశమందును స్థాపించుటే మార్గమనుభావము సర్వసామాన్యముగ వ్యాపించియుండినది. కాని, 1921 నుండి దేశమున నూతన జాతీయభావముకలిగి, ఆధునికయాంత్రిక పద్ధతి హానికరమనియు, చేతిపనులనే వృద్ధిచేయించి, వానినే గ్రామములందు ప్రోత్సహించవలెననియు, ఒక సిద్ధాంతము బయలుదేరినది. కేవలయాంత్రిక నాగరికత, మనదేశమున కొంతహానికరముగనే ఉన్నది. † అందు

† ఈసమస్యవిషయమై ప్రపంచ చరిత్రను గూర్చి నేను వ్రాసిన 'జగత్కథ' లో 544- 547, 648-650 వ పుటలందు కొంతవివరింపబడినది.

వలన యాంత్రికపరిశ్రమల స్థాపించిన తాతాగారి చరిత్రమును గ్రంథరూపమున మరల ఆంధ్రపాఠకులయెదుట నుంచుట ఉపయోగకరమా యని సందేహము కల్గుట సహజము. కాని యీవిషయమున కొన్నిసందర్భముల మరువరాదు. మిల్లులు మున్నగు మహాయంత్రములందు బహుళోత్పత్తినొంది మనదేశముకు దిగుమతియగు వస్తువులతో, పూర్వపుపనిముట్లతో చేతితో తయారగువస్తువులు సాధారణముగ పోటీచేయలేవని మనకు ప్రత్యక్షముగ కనబడుచున్నది.

మనప్రస్తుతపు ఆర్థికదుర్దశనుబట్టియు, రుచిభేదముచే సహజప్రవృత్తిని బట్టియు,చాలమందిజనులు చౌకయగుయాంత్రికవస్తువులనే కోరుచున్నారు. ఈవస్తువులకే, (మన్నిక పనితనము గల చేతివస్తువులకన్న,) చలామణి చాల హెచ్చుగ నున్నది. ఈస్థితి విచారకరమైనను యథార్థమని గమనింపక తప్పదు. చేతిపనులకు మనమెట్టి ప్రోత్సాహమిచ్చినను, అవి గ్రామజనులకు సహాయకములైనను, ఇప్పటి నాగరికతను బట్టి దేశీయావసరము లన్నిటిని తీర్పలేవు. ఈయాంత్రిక నాగరికత దుర్నివారముగా వేగముతో వృద్ధియగుచు, సర్వత్ర వ్యాపించుచున్నది. చేతితో తయారగు వస్తువులనే అభిమానించువారుగూడ నిత్యమును వ్రాతకోతలకు, రాకపోకలకు, చాలపనిముట్లకు, నిత్యావసరములగు చాలకార్యములకు యాంత్రికవస్తువులనే వాడుచుండుట ఎంతమాత్రమును తప్పుటలేదు. వానివాడుక క్రమముగా హెచ్చుచున్నది

గాని తప్పుటలేదు. రైళ్ళు, మోటార్లు, బైసికిళ్ళు, గ్రామఫోనులు, సినీమా, రేడియో, టెలిగ్రాఫు, ముద్రాయంత్రములు, సూదులు, తీగలు, కాకితములు, పెన్సిళ్లు, గోనెసంచులు, గాజువస్తువులు, పెద్దదీపములు, రసాయనవస్తువులు మున్నగు మనమువాడుకొనుచున్న వెన్నియో చాలవరకు యాంత్రికములే.

ముఖ్యముగ ఆధునికనాగరికత అయోమయమగుచున్నది. పూర్వము కర్ర నుపయోగించుపట్లగూడ ఇప్పుడు, ఇనుమునే ఎక్కువగా వాడుచున్నారు. ఉక్కువస్తువులవాడుకయు చాల హెచ్చినది; ఇతరపరిశ్రమల మూలాధారములగు ఇంజనులుమున్నగు యంత్రములన్నియు ఇనుముతోను ఉక్కుతోను చేయబడును. వానికన్నిటికి చౌకగ ప్రశస్తమగు ఇనుము తయారగుట అవసరము; దానికిని ఇతరములకును నేలబొగ్గు, విద్యుచ్ఛక్తి అత్యవసరములగుచున్నవి. అందువలన లోహ, ఖనిజ, విద్యుచ్ఛక్తుల బుట్టించు పరిశ్రమలు ఇతరపరిశ్రమ లన్నిటికిని మూలాధారములై, ప్రతిదేశపు ఆర్థికాభివృద్ధికిని ముఖ్యావసరములగుచున్నవి. ఇవి యాంత్రికములైనగాని, చౌకగను దృఢముగను ఉండవు.

ఈ వివిధవస్తువులకు మనదేశమున స్వయంసహాయమున పరిశ్రమ లేర్పడవలెను; ప్రస్తుతస్థితిలో మనవారు యంత్రపరిశ్రమల నేర్పర్చుకున్నను, ఆస్థానమున అన్నిపనులకును చేతిపరిశ్రమలే వృద్ధియై యుండుననుటకు వీలులేదు. అప్పుడు

ద్రవ్యవిజ్ఞానానుభవములు పలుకుబడియు గల విదేశీయులే ఫాక్టరీలగట్టి, గనుల యజమానులై, ఆపరిశ్రమలను మనదేశమున స్థాపించియుందురని తోచును.

వంగదేశమున భారతీయులు ముందుగా శ్రద్ధవహించనందున, కలకత్తాప్రాంతపు జూటు(=జనపనార)సంచులపరిశ్రమను, చాలవరకు బొగ్గుగనులను, కొంతవరకు కాకితపుమిల్లులు మున్నగువానిని,విదేశీయులే నడుపుచున్నారు*ఆవిదేశీయసంఘము లాపరిశ్రమల వృద్ధిచేయుచు, లాభద్రవ్యమును తమదేశముకు గొనిపోవుచున్నారు. ఆపరిశ్రమలందు భారతీయులకు తగు అనుభవము ప్రాబల్యములేదు. జంషెడ్జితాతా మున్నగువారు సన్ననూలుబట్టల మిల్లులను స్థాపింపనిచో, వానినిగూడ విదేశీయులే స్థాపించియుందురేమో! ఈదేశమందు అట్లే తాతాసంఘపు దూరదృష్టి చాకచక్యములు లేకుండినచో, సాక్షిలోహపరిశ్రమ, బొగ్గుగనులపరిశ్రమ, సహ్యాద్రిలోని జలవిద్యుచ్ఛక్తిపరిశ్రమ, విదేశీయులహస్తగతమై యుండును; వాని లాభమందును, శిల్పానుభవమందును, యాజమాన్యమందును, భారతీయులకు తావే లేకపోయెడిది.

(ధాన్యము దంపుట, బెల్లము చేయుట, వస్త్రపుపనులు, వడకుట, నేత, మున్నగు పరిశ్రమలు వ్యవసాయజనులకు చాల

---

* ఇట్లే మనమద్రాసుప్రాంతమున కొన్ని బట్టలమిల్లులు, మైసూరులో స్వర్ణపరిశ్రమ, ఇత్యాదులను విదేశీయులే నడుపుచున్నారు.

సహకారులు, మన గ్రామజీవనమునకు చాల ఉపయోగకారులు. వీనితో యాంత్రికపరిశ్రమలు పోటీచేసి, వీనిని నశింపజేయుట భావ్యముకాదు. కాని, అంతమాత్రమున, యాంత్రికపరిశ్రమ లసలే యవసరముకావని భావించుట ఉచితముగ తోపదు.)

విదేశపుయంత్రములందును విదేశీయయాజమాన్యపుయంత్రములందును తయారగు వస్తువులకన్న, ఈదేశీయుల సరుకులనే వాడుట ఆర్థికముగ శ్రేయస్కరము.

ఈదేశమందు పెద్దపరిశ్రమల స్థాపకులలో ప్రముఖుడు తాతా; ఇంతేగాక, గృహపరిశ్రమాభిలాషులును తాతాజీవితమునుండి చాలసంగతుల నేర్చుకొనవచ్చును. ఆయన గొప్ప దేశాభిమాని, ఆర్థికవేత్త. ప్రపంచపు ఆర్థికహితైషులందరకు ఆయనచర్యలు మార్గదర్శకములు.†

ఈదేశమున కవసరములు, ఇతరపరిశ్రమలకు కీలకములు, అగు వానిపైననే జంషెడ్జి తనదృష్టిని నిగుడ్చెను. తనకు లాభకరములే గాక దేశాభివృద్ధి కవసరములగు క్రొత్తపరిశ్రమలనే

† పరిశ్రమలం దారితేరిన పాశ్చాత్యులకును ఆయనజీవితము హితబోధకమగుటవలననే, జంషెడ్జితాతాచరిత్రమును, ఇదివరలో లండనులోను ఇప్పుడు ఆక్సుఫర్డులోను ఉపన్యాసకుడైన యఫ్. ఆర్. హారిసు అను అర్థశాస్త్రపండితుడు 1925 లో మనోహరముగ రచించెను; దాని నాక్సుఫర్డు యూనివర్సిటీప్రెస్సువారు ఇంగ్లండులో ముద్రించి ప్రచురించిరి. ఇదియు జంషెడ్జి ఘనతకు జగద్విఖ్యాతికి నిదర్శనము.

ఆయన స్థాపించెను. యాంత్రికతవలన లాభముతోబాటు కొంతనష్టమును కలుగునని గ్రహించి, జంషెడ్జి ఆనష్టముల తగ్గించుటకును, కార్మికుల బాగుజేయుటకును, ఉద్యోగులకు పరిశ్రమల లాభములందు సంబంధము కలిగించుటకును, చాల తోడ్పడెను; కార్మికుల విద్యారోగ్యాదుల వసతులను వృద్ధి చేయించెను. ఉన్నతవిద్యను విజ్ఞానమును వృద్ధిచేయుటకై, ఆయన లక్షలకొలది రూపాయలు నిధుల నేర్పర్చెను.

ఇప్పుడు మనదేశమంతటను వ్యాపించి భారతీయవ్యాపారము దగ్రగణ్యమగు 'తాతా'వారిసంస్థలలో నాగపురం, బొంబాయి, అహమ్మదాబాదు మిల్లులను పట్టుపరిశ్రమను జంషెడ్జి తాతా స్వయముగ స్థాపించి, వృద్ధిచేసెను. తాజ్ మహల్ హోటల్ మొదలగు మహాభవనముల నాయనయే నిర్మించెను; విదేశములం దున్నతవిద్యాప్రోత్సాహముకై నిధిని నెలకొల్పెను. విజ్ఞానాలయపు సంస్థనుగూడ జంషెడ్జియే స్థాపించెను; లోహశాలను జలవిద్యుచ్ఛక్తిశాలను పూర్తిగా స్థాపించువరకు జీవింపలేదు; కాని ఆమహాసంస్థల సాధ్యతను కనిపెట్టి, వానిని జయప్రదముగ జరుపుటకు వలయుసాధన పరికరమును సముజాయిషీనంతను ఆయన విశేషకృషితోను వ్యయప్రయాసలతోను సిద్ధముచేసెను; మఱియు తనయనంతరము వానిని అమలుజరుపుటకు తన బంధుమిత్రుల కందలి వివరములను మర్మములను బోధించి, తనతో సహచరులుగజేసి, తన ఆశయము ఉత్సాహ

ము అభినివేశము వారి కబ్బునట్లుచేసెను. ఇట్లామహాసంస్థలను భారతీయులే స్థాపించినప్పటకు జంషెడ్జితాతాయొక్క ప్రతిభ, దేశభక్తి, అభినివేశము, మూలకారణములని చెప్పవచ్చును. అందువలన వానిని వానిశాఖలను గూడ ఈపుస్తకమున వివరించితిని.

తాతాజీవితము వ్రాసినప్పటినుండి దేశపరిస్థితులు చాల మారినవి. ఆపుస్తకపుశైలి నిందు మార్చి సులభమొనర్చితిని. 'తాతాజీవితము'లోని చాలసంగతు లిప్పుడు అప్రధానములైనవి; వానినెల్ల విడిచితిని; అందలి కొన్నింటి నిందు చాల క్లుప్తముచేసితిని; ఆపుస్తకమున లేని చాలసంగతుల నిందు చేర్చితిని.

హారిసుగారు తాతానుగూర్చి రచించిన ఆంగ్లగ్రంథపు ప్రతిని సర్ దొరాబ్జితాతా ట్రస్టువారు నాకు దయతో బంపిరి; అది ఈపుస్తకమును వ్రాయుటకు నాకు చాల నుపయోగించినది. ఇందలి చిత్రపటములును అందుండి గ్రహించినవే. (ఇందుకు నేను వారికెంతయు కృతజ్ఞుడను.) ఈపటముల బ్లాకులను తిరువల్లిక్కేణిలోని విశ్వ అండ్ కంపెనీలో తయారు చేయించితిని.

దాదాపుగా, మనదేశపు పెద్దపరిశ్రమ లన్నిటిని గూర్చినప్రశంస చాలవరకు ఇందు చేరినవని పాఠకులు

గ్రహింతురు. తాతాగారి జీవితము మనదేశపు పారిశ్రామికచరిత్రముతో అభేద్యముగ మిళితమై యున్నది. ఆ యాసమస్యల చర్చ సందర్భమున ఇం దాపరిశ్రమల ప్రశంస అవసరము, ఉపయోగకరము, అగుటచే, సందర్భవశమున వాని నుదహరించితిని. శైలికి పారిభాషికపదములకు నా 'జగత్కథ' లోని పద్ధతినే యవలంబించితిని; ఈపుస్తకమును వ్రాసిప్రచురించుటలోను చి॥ ప్ర॥ పార్థసారథి (బి. ఏ; బి. కామ్; ఎల్. ఎల్. బి.) నాకు సాయము చేసెను.

భారతదేశమం దిప్పుడు వ్యవసాయమే ముఖ్యవృత్తి. ప్రభుత్వపులెక్కలప్రకారమే ముప్పాతికమంది జనముకు వ్యవసాయమే జీవనాధారము. (అనగా, ఇంతమందియు నిజముగ వ్యవసాయాదులు చేసికొనుచు స్వయముగ తమ్ము తాము పోషించుకొనుచున్నారని తలపకూడదు. ఇందులో మిక్కిలి కొద్దిమందికే వ్యవసాయపుపని దొరకుచున్నది. కొలదిమంది యీనాందారులుగ శిస్తుల గ్రహించుచున్నారు; తక్కినవారందరు తాము నిరాధారులగుటవలన, కర్షకులవలననో భూనాయకులవలననో,అనుబంధముచే కరుణయా పోషింపబడుచున్నారు; ఐనను, లెక్కలలో వారికిని వ్యవసాయమే వృత్తి యనుట వాడుక) మరియు సాగుదార్లకు పూర్వము అనుబంధవృత్తు లుండినవి. ఇప్పుడు వ్యవసాయము లేనిరోజులలో రయితులు తరుచు వ్యర్థముగనే యుండుచున్నారు. పరిశ్రమలు హెచ్చినచో

పాడివస్తువులకు ధరలు హెచ్చి, వ్యవసాయమునకును ప్రోత్సాహము కలుగును.

మనదేశమున వస్తువులలోటు లేదు. ఈవిశాలదేశమున అన్నిశీతోష్ణపరిస్థితులు అన్నిరకముల నేలలును గలవు. ఐనను మనదేశము వ్యవసాయముకే తగినదని, కొందరనుట పరిపాటిగ నుండినది. ఆసంగతి నిజము కాదనియు, తగు మనోనిశ్చయముతో కృషిసల్పినచో, ఈదేశమందును ముఖ్యపరిశ్రమలేర్పడి యార్థికస్థితి బాగుపడు ననియు, టాటాచరిత్రము సహేతుకముగ విశదము చేయును. ముఖ్యముగ, మన యాంధ్రప్రాంతమున పెద్దపరిశ్రమ లేవియు లేవు. ఉన్నపరిశ్రమలైనను క్షీణించుటయో, పరహస్తగతములగుటయో, జరుగుచున్నది. జనులలో, ముఖ్యముగ విద్యావంతులగు యువకులలో, నిరుద్యోగత విపరీతముగ హెచ్చుచున్నది. ఇట్టి దయనీయ పరిస్థితి చాలయనర్థములకు కారణమగుచున్నది. ఒకవిధముగ మన దేశమందలి వివిధబాధలన్నిటికిని, పరిశ్రమలు లేకుండుటచే యువకులలోనున్న వృత్తిహీనతయే కారణమని తోచును.

అందువలన ఆధునికభారతదేశపు పారిశ్రామికనాయకులలో నగ్రగణ్యుడగు జంషెడ్జిటాటాచరిత్రము మనయువకులలో కొంతవరకైన స్వతంత్రవృత్తి సంపాదనకు ఆర్థికోన్నతికి ఉత్సాహము కల్గింపవచ్చుననియు, ఆరీతిగ నీచిన్నపుస్తకము కొంచెము జనోపయోగకరము కావచ్చుననియు, తలచి దీనిని

ప్రచురించితిని. వ్యాపారవిషయమున తాతా యవలంబించిన పద్ధతు లందరును నేర్చుకొనదగినవి. ఆయనచర్య లన్నిటిలోను విశేషతకలదు; వాని స్వభావమును, (చర్వితచర్వణమైనను) చివర అధ్యాయములో, ప్రత్యేకముగ చిత్రించితిని. భారత దేశపు ఐహికాభివృద్ధికై, ఆధునిక భారతీయులలో నింకెవరి కన్నను జంషెడ్జితాతాయే యెక్కువకృషిచేసెనని విదేశీయులు కూడ భావించుచున్నారు.* ఆయన ధనమును పరమావధిగ నెంచక, సత్కార్య సాధనముగనే యెంచెను.

---

*" He did more for its material regeneration than any other Indian of modern times" Lovat Fraser's 'India under Curzon and after' P. 324."

# తాతా చరిత్రము

## 1. పార్సీలు.

మనభారతదేశమున జాతులు, మతములు, చాలగలవు. అందు హిందువులు సుమారు 24 కోట్లు, ముసల్మానులు రమారమి 9 కోట్లు, ఉందురు; క్రైస్తవులు, సిక్కులు, జైనులు, బౌద్ధులుగూడ కొలదిగ నున్నారు. పార్సీలసంఖ్య వీరందరి కన్ననుతక్కువ. వీరు సుమారొకలక్షమాత్రమెయున్నను, చాల ప్రముఖులుగ నున్నారు. వీరి పూర్వచరిత్ర, ఆచారములు, విచిత్రములు.

పార్సీ లార్యజాతీయులు. ఆర్యులమహాజాతి చరిత్రకాలమునకు చాలపూర్వమే రెండుగా చీలెను. అందొకశాఖవారు యూరపులోని గ్రీసు, ఇటలీ, జర్మనీ, ఇంగ్లండు, ఫ్రాంసు మున్నగుదేశములం జేరిరి; రెండవశాఖవారు ఆసియాలో పారసీక హిందూస్థానాదులందు స్థిరవాసులైరి. ఈప్రాచ్యులు పూర్వము కొంతకాలము మనదేశమునకు పారసీకమునకు మధ్యప్రాంతమున వసించుచుండ, కాలక్రమమున వారిలో రెండుశాఖలేర్పడి, ఈ యుభయులమధ్యను కలహము గల్గెనని, అందసురశాఖీయులు పారసీకమున వ్యాపించిరని, దేవశాఖీయులు సింధునది దాటి మనదేశపు ఆర్యావర్తవాసులైరని, కొందరు చారిత్రకులందురు.†

† ఈయైతిహ్యముప్రకారమాయుద్ధమే 'దేవాసురయుద్ధ' మనబడెను; ఇట్లు దేవాసురులందరు అసలు ఏకజాతీయులైయుందురు. అసురులకు 'పూర్వదేవు' లనియు పేరుగలదు.

భారతీయార్యుల మూలగ్రంథము 'ఋగ్వేదసంహిత'; పారసీకార్యుల మూలగ్రంథము 'అవెస్తా'; ఈ రెంటిభాష, విషయములును, చాలవరకు పోలియున్నవి.

భారతీయార్యులు తరువాత చాల సుఖదుఃఖములకు లోనై, మనదేశమంతటను వ్యాపించి, చాల రాజ్యముల స్థాపించిరి. క్రమముగా, ఆర్యద్రావిడుల నాగరికతలు మిశ్రితములైనంతట, మన భారతీయనాగరికత యేర్పడినది; తరువాత కొన్ని శతాబ్దములకు మనము పూర్వపుటున్నతిని గోల్పోయి, తుదకు పరాధీనులమైతిమి.

పారసీకార్యులును మొదట బలీయులై, వృద్ధినొందిరి; గొప్పరాజ్యముల స్థాపించిరి; వారిలో 'జొరాస్టరు' అనబడు జరాతుస్త్రుడు గొప్పమతమును స్థాపించెను. వారికిని నిత్యాగ్నిపూజ, ఉపనయనము, మౌంజీధారణము, ఇత్యాదిసంస్కారములు కలవు; వారిలోను గోమూత్రము పవిత్రముగ నెంచబడును.

ఇట్లుండగా పారసీకమునకు పడమటనున్న 'అరేబియా' దేశములో క్రీ. త. 622 ప్రాంతమున 'మహమ్మదు' అను ప్రవక్త క్రొత్తమతము స్థాపించెను. ఆమతము నరబ్బులందరు నవలంబించి, దానిని లోకమంతటను వ్యాపింపజేయుటకై వీరావేశముతో నలుదిశలను బయలుదేరిరి. వారిరణనీతి, మతోత్సాహము, అద్భుతములు. అందొక శాఖవారు పారసీకముపై బడిరి; ఆవాహినిని క్రీ. త. 637 లో 'కడెస్సియా' యుద్ధమున పారసీకు లెదిర్చిరి.

అప్పటి పారసీకసేనాని యగు 'రుస్తుం' గొప్పశూరుడే. కాని మూఁడురోజులు సంకులయుద్ధము జరిగి, తుదకు పారసీకు లోడిరి. అరబుతరంగ మాదేశమంతటను వ్యాపించెను. పారసీకులందర రకు 'కురాను' ఖడ్గము నెదురయ్యెను;† ఆజను లిస్లాము నంగీకరింపనిచో, ఖడ్గమున కెరయగుచుండిరి. దాదాపు పారసీకు లందరును త్వరలోనే ముసల్మానులైరి; కొందరు ధీరులుమాత్రము తమ కానువంశికమగు 'జొరాస్టరు' మతము విడనాడరైరి. వా రారబులప్రచండధాటి కోర్వలేక, జన్మభూమిని సర్వస్వమునుగూడ వదలి, దేవునిపై భారమువైచి, ఆకాలపు చిన్న యోడలలో మహాసముద్రముపై బయలుదేరిరి. అనేకకల్లోలములను ప్రమాదములను దాటి, ఆయోడ లెట్లో క్రీ. త. 720 ప్రాంతమున మనదేశపు పశ్చిమతీరమును జేరెను. ఆయోడలలో వచ్చిన యా పారసీకు లీదేశమందే యుండిపోయిరి; వారివంశీయులే నేటికిని 'పార్సీ' లనబడుచున్నారు. వారు వసించినప్రాంతమగు మన ఘూర్జరదేశ మప్పుడు చాళుక్యరాజుల పాలనలో నుండి సర్వసంపత్సమృద్ధమై యుండెను. (దీని యుత్తరప్రాంత

† 'కురాను' మహమ్మదు బోధనలదెల్ప, ఆమతపు మూలగ్రంథము. ఆమతమును 'ఇస్లాం' అనియు నందురు. ఆమతస్థులను ముస్లిములు, ముసల్మానులు, అనియు చెప్పుదురు. ఇది ఏకేశ్వరమతము; ఇందు అవతారములకు, విగ్రహారాధనలకు, జాతికులభేదములకు, తావులేదు. మహమ్మదును ప్రవక్తయే గాని దేవుని అవతారముకాదని, ఇట్లే ఏసుక్రీస్తు, బుద్ధుడు, మున్నగు పూర్వపు మతకర్తలును ప్రవక్తలేయనియు ఆమతసిద్ధాంతము.

మిప్పుడు బరోడారాజ్యములోను, దక్షిణప్రాంతము బొంబాయి రాష్ట్రపు గుజరాతుగను, ఉన్నవి). ఈప్రాంతము వింధ్యగిరిపాదములతోను, నర్మదా తపతీనదులతోను, అలరారుచున్నది.

ఆ 'పార్సీ' లిచ్చటి మనరాజుల మన్ననలంది స్వేచ్ఛతో తమ 'జొరాస్టరు' మతాచారముల రక్షించుకొనిరి. ఈప్రాంతపు హిందువులతృప్తికై గోమాంసమును, తరువాత ముసల్మానుల తృప్తికై సూకరమాంసముగూడ, వారు త్యజించిరి. వారు చాల అల్పసంఖ్యాకులయ్యు, నేటివరకు తమమతమును వ్యక్తిత్వమును నిల్పుకొనియున్నారు; అప్పటినుండి ఆప్రాంతపు సూరతు, భారుకచ్ఛము (బ్రోచి), మున్నగు రేవుస్థలములనుండి విశేషముగ కోస్తావ్యాపారము జేయుచున్నారు.

పార్సీలలోను మన హిందువులలోవలె కాలక్రమమున కొన్నిమూఢాచారములు వ్యాపించెను. కాని గతశతాబ్దమున నాంగ్లవిద్య యారంభింపగనే, పార్సీలలో చాల మార్పుకలిగినది. దాదాపుగా వారందరును విద్యావంతులు; వా రాప్రాంతపు 'గుజరాతీ'ని స్వభాషగ జేసికొనిరి; దాని వాఙ్మయము వృద్ధినొందించిరి. ఆసంఘమున అతిబాల్యవివాహములులేవు; స్త్రీలకు కొంతస్వతంత్రత కలదు. పార్సీలు వ్యాపారాదులకై తరుచు ఆంగ్లమును హిందూస్థానీని కూడ అభ్యసింతురు. తాము కడు నిడుమలబడియున్నపు డాతిథ్యమొసగి మతస్వాతంత్ర్యమిచ్చిన భారతదేశమే పార్సీలకు స్వదేశమయ్యెను. వారిలో చాలమంది

యిప్పుడు మనదేశమున వివిధశాఖలందున్నతస్థానములవహించి, సంఘమున కనేకవిధముల నుపకరించుచున్నారు; వారిలో కొందరుద్యోగులు రాజ్యాంగదక్షులునుకలరు; (బ్రిటిషుపార్లమెంటులో సభ్యులైన భారతీయులు ముగ్గురును పార్సీలే). పార్సీలకార్యశూరత, దాతృత్వము, వ్యవహారదక్షత ప్రపంచమందసమానములు. పెద్దపెద్దవ్యాపారములందు వీరికి పెట్టినదిపేరు. 'త్యాగాయసంభృతార్థానాం' అను కాళిదాసునిసూక్తి ఈజాతికి వర్తించును. ఇట్టివిచిత్రజాతియందే మేధావి, కర్మవీరుడు, ఉదారుడు, మహాదాత, వ్యాపారనాయకుడు అగు మనజంషెడ్జి నస్సర్వంజి తాతా జనించెను.

---

## 2. తాతా బాల్యదశ.

పార్సీల ప్రాచీనగ్రామము లన్నిటిలో ముఖ్యమైనది ‘నవసారి’; ఇదిబరోడారాజ్యమున ‘తపతీ’ తీరమందు (సూరతుకు 18 మైళ్ళదూరమున) ఉన్నది. అందలి పార్సీ గురువులగు ‘దస్తుర్లు’ 19 వ శతాబ్దాంతమువరకు మన స్వాములవార్లవలె పూర్వాచారపరులై, సంస్కరణముల బ్రతిఘటించుచుండిరి. కాని ‘కూపకూర్మ’ తత్వము పార్సీయువకులకు రుచింపలేదు. వారు బాల్యమున దస్తుర్లయొద్ద మతవిద్యబడసి, సూరతు బొంబాయి, అహమ్మదాబాదు పురములజేరి, అందు వ్యాపారముజేసి ధనికులై, ఉదారభావముతో దాన మొసర్చుచుండిరి.

నవసారియే తాతావంశీయులకును స్వగ్రామము; జంషెడ్జీ పూర్వీకుడగు ‘బెహరము’ను ‘దస్తురే’; అతడు ధీమంతుడయ్యు, కొంత శీఘ్రకోపి; అందుచే, తరుచు, ఇతరులపై చీకాకు పడుచుండెను. ఆయన దారిని బోవునపుడు కొందరల్లరిపిల్ల లాయన తీవ్రస్వభావు డని సూచించుటకు ‘తాతా’ అనుచుండిరి. † ఈ ‘తాతా’ అను మాట తన చెవినిబడగనే బెహరం మరింత కోపించుచుండెనట. ఆయన యుడికినకొలదిని బాలు రాపేరునే మరింత వాడజొచ్చిరి. ఇట్లాయనకు కొంతకాలమును ‘తాతా’యే వాడుకపేరై, తుదకా వంశమంతకు నది వంశనామము లేక ‘ఇంటిపేరు’ అయిపోయెను.

---

† సంస్కృతమున ‘తప్త’ అనగా ‘వేడియైన, తీవ్రమైన, తపించిన’ అని అర్థము. ప్రాకృతమున ‘తప్త’యే ‘తాతా’ అయినది. ప్రాకృతపు ఘూర్జర శాఖనుండి వచ్చిన గుజరాతిలోను నిదేరూపము.

బెహారమునుండి 12 వ తరపువాడు 'నస్సర్వంజి'; ఆయన 1822 లో జనించి, బాల్యమున నవసారిలో మతవిద్య నేర్చుకొని, అంతట బొంబాయిపురము జేరి, అందు వర్తకము నేర్చుకొనెను. అతడు విద్వాంసుడు కాకున్నను, ప్రాజ్ఞుడు, సమయస్ఫూర్తిగలవాడు; మితవ్యయపరుడై కొంతసొమ్ము మిగుల్చుకొని, అందుతో నస్సర్వంజి వ్యాపారము చేసి, ద్రవ్యమార్జించెను. పూర్వాచారప్రకారము బాల్యమందే యతనికి వివాహమై, 1839లో, నవసారిగ్రామమున, అతని యేకపుత్రుడగు మన 'జంషెడ్జి' జనించెను.

శైశవమునుండియు 'జంషెడ్జి'కి మంచి విద్యాసక్తి యుండెను. * అప్పటికి నవసారిలోనున్న వీధిబడిలోనే జంషెడ్జి గుజరాతి, చరిత్ర, గణితము, మతవిద్య, నేర్చుకొనెను; మనోగణితమం దాతని కభిలాష మెండు. నస్సర్వంజి తన కొడుకును నవసారిలో శుష్కవాదపరుడగు పురోహితునిగ నుంచక, 1852లో, ఉన్నతవిద్యకై బొంబాయి కంపెను.

---

* ఈక్రిందివృత్తాంత మాతనివిద్యాసక్తిని సూచించును. నవసారిలో తాతాయింటికొకమిద్దెయుండెను. ఆమిద్దెకు పైకప్పు తలకు తగులునట్లుండెను. జంషెడ్జి యందుకూర్చొని చదువుచుండగా, ఒకరోజున పెద్ద గాలివాన వచ్చి హోరున వర్షించెను; గాలి విసురుకు భయపడి, అందరు నాయిల్లు విడచిరి. కాని బాలుడగు జంషెడ్జి మాత్రము దానిని సరకుచేయక తదేకదీక్షతో నా మిద్దెపైననే చదువుకొనుచుండెను. ఈసంగతి తెలిసి, తండ్రి లోనికి పరువెత్తిపోయి, జంషెడ్జిని కష్టముతో నీవలకు తెచ్చెను. వా రీవలకు వచ్చిన కొద్ది క్షణములకే, ఆమిద్దెయిల్లు ఒక్కసారిగ నేలగూలెను.

బొంబాయి యప్పటికే వ్యాపారరంగమై, జనసంకులమై యుండెను. ఈనగరము జంషెడ్జికి నూతనలోకముగ దోచెను; అందు జనులందరేదోయొక పని జేయుచుండిరి. జ్ఞానార్జనకందు చాల సౌకర్యము లుండెను. ప్రభుత్వకళాశాలయందు శాస్త్రవేత్తలు విద్యను విజ్ఞానమును బోధించుచుండిరి. జంషెడ్జి అందారేండ్లు చదివి, పరీక్షలో కృతార్థుడై, 1858 లో విద్యను ముగించెను.

అతడు 17 వ యేటనే 'హీరాబాయి' అను పార్సీ బాలికను వివాహమాడెను; 1860 లో వారి జ్యేష్ఠపుత్రుడగు దోరాబ్జితాతా కలిగెను.

అప్పటికి వకీళ్లు అరుదు; న్యాయవాదివృత్తి చాల ఆకర్షకముగ నుండెను. తండ్రి జంషెడ్జిని న్యాయవాదిగనే చేయ దలచి, ఆతని నొక సొలిసిటరు కార్యాలయమున జేర్చెను.* అతడందే యుండినచో సామాన్యజీవితమే గడపియుండును. అట్లు జరుగక, 1859 లోనే దానిని వదలి, జంషెడ్జి తనతండ్రి కొట్టులో జేరి, అందు వ్యాపారసూత్రముల నేర్చుకొనెను. అదృష్టవశమున నట్లు వృత్తి మారి, జంషెడ్జి వ్యాపారనాయకుడగుట సంభవించెను.

---

*కోర్టులో వాదముచేయక, నోటీసుల బంపుట, దస్తావేజులను ప్లయింటులు నోటీసులు మున్నగువాని వ్రాయుట, సలహాల నిచ్చుట మున్నగు తక్కిన న్యాయవాది కార్యము లన్నిటిని జేయువారు 'సొలిసిటరు' లనబడుదురు.

అప్పటికి మనదేశమున క్రొత్తపరిస్థితు లారంభించెను. సుప్రసిద్ధమగు సిపాయియుద్ధపు కల్లోల మప్పుడే యణగెను. 'కంపెనీ' అధికారముపోయి బ్రిటిషుప్రభుత్వమువారు స్వయముగా మన దేశపాలన నారంభించిరి. రాష్ట్రములందు హైకోర్టులు, 'యూనివర్సిటీ'లు క్రొత్తచట్టములు, ఏర్పడెను. నవనాగరికత ప్రభావము ప్రసరింపదొడగెను.

---

10

## 3. వ్యాపారారంభము.

ఆకాలమున మనదేశమున ప్రభుత్వమువారి ప్రోత్సాహముతో చాలనల్లమందుజేసి, చీనా కంపి, వర్తకులు అందు హెచ్చుధర కమ్ముచుండిరి. ఈలాభకరవ్యాపారమును కొందరు సాహసులగు పార్సీలు, చీనాసమీపపు 'హాంకాంగు' ద్వీపము ద్వారా, జరుపుచుండిరి. 'హాంకాంగు' ఆంగ్లేయుల వశమగుటకు పూర్వమే, మనసూరతుప్రాంతమునుండి పోయి కొందరు పార్సీలందు వసించుచు, వర్తకమును జరుపుచుండిరి. అప్పటికి మహానౌకలు, తంతిసౌకర్యము, లేవు. ఇటనుండి చీనా చేరుట కారు నెలలు పట్టుచుండెను; అపాయము లధికము. అందుచే, చీనావ్యాపారమున పార్సీలకు పోటీలేకుండెను. అప్పటి చీనులు నల్లమందుభాయీలగుటచే, ఆపార్సీల కీవర్తకమునచాలలాభము కల్గెను. తండ్రితరపున జంషెడ్జియు హాంకాంగుచేరి, చీనాతో నాలుగేండ్లా వ్యాపారముజేసి, ధనము అనుభవము సంపాదించి, ఆ వ్యాపారముపై విరక్తిగల్గి, 1863 లో మరల బొంబాయి చేరెను. వెంటనే జాంషెడ్జి కాంగ్లదేశప్రయాణము తగిలెను.

మిల్లుయంత్రములందు సన్నబట్టల వడికినేయుటలో గతశతాబ్దిని బ్రిటిషువా రగ్రేసరులైరి. కాని వారిదేశము శీతలము; భూమి చాలవరకు కొండనేల; అందు ప్రత్తిపండదు; అందుచే నాంగ్లేయులు తమ మిల్లులకు దూది నిప్పటికిని విదేశములనుండి తెచ్చుకొనుచున్నారు.

ప్రపంచమున సమృద్ధియగు ప్రత్తిపంటకు తగుభూసారము వేడిమి గలదేశములు మూడే:—అమెరికాలోని సంయుక్తరాజ్యము, ఆఫ్రికాలోని యీజిప్టు, మనభారతదేశము. వీనిలో అమెరికా ప్రత్తి సన్ననూలుకు ప్రశస్తము; దాని నింగ్లండుకు తెచ్చుటయు సుకరము. ఈజిప్టులో నైలునదీప్రాంతమున ప్రత్తి వ్యవసాయము నిటీవలనే యారంభించిరి. అంతకుపూర్వ మచ్చట మంచి ప్రత్తిపంట లేదు.

ఇట్లుండగా, అమెరికాలో సంయుక్తరాజ్యపు ఉత్తరదక్షిణభాగములమధ్య కలహము గలెను. దక్షిణభాగమే చాల సారవంతము; అందు ప్రత్తి బాగుగ పండును. అచ్చటి తెల్లవారు కొలదిమంది యైనను, నీగ్రోబానిసల కూలిమూలమున వారు చాల పంటలబండించి భాగ్యవంతులైరి. వారు నీగ్రోలను మన మాలలకన్నను హీనులుగ జూచుచుండిరి. ఉత్తరప్రాంతపు వారా రాజ్యమంతటను నీగ్రోల యమానుషదాస్యము నెట్లైన పరిహరింప జూచిరి. ఇది దక్షిణప్రాంతపుధనాఢ్యులగు దొరలకు నష్టకరమైనందున, వా రంగీకరింపక, ఉత్తరప్రాంతీయులపై తిరుగబడి, తాము ప్రత్యేకరాజ్యముగ విడిపోవయత్నించిరి. 1861 లో, అమెరికాలో నిట్లంతర్యుద్ధ మారంభించెను.* ఉత్తరజిల్లాలవారు నౌకాబలముకలవారై, దక్షిణజిల్లాల రేవులన్నిటిని ముట్టడించి, అచ్చటి కోస్తావ్యాపారము నరికట్టిరి. సంయుక్త

* ఇది American Civil War అను పేర చరిత్రలో ప్రసిద్ధము (1861-1865.)

రాజ్యముకు ఆంగ్లదేశముకు మధ్య (అట్లాంటికు అనబడు) విశాలమహోదధికలదు. ఇట్లు దక్షిణజిల్లాలతీరమునుండి యాంగ్లదేశముకు వచ్చు దూదియెగుమతి నిల్చిపోయి, బ్రిటనులో దూదికరవుగల్గెను; లంకషైరుమిల్లు లొక్కసారిగ నిల్చిపోయెను.* అందుపై నాధారపడు నితరపరిశ్రమలును స్థంభించెను. లక్షలకొలది జనులకు వృత్తులుపోయి, దేశమున నలజడిగల్గెను.

అప్పుడాప్రత్తికరువు తీరుటకై, బ్రిటిషువారు మనదేశపు దూదిని ఖరీదుచేసి కొనిపోసాగిరి. ఈయెగుమతివలన మనదేశమున ప్రత్తిధర చాలహెచ్చి, ప్రత్తి యెగుమతికిస్థానమగు బొంబాయిలోని యావ్యాపారస్థులకు చాలలాభము రాదొడగెను. ఆవిధముగ తక్కిన బొంబాయివ్యాపారస్థులతోబాటు తాతా కంపెనీకిని చాల ద్రవ్యము చేకూరెను. ఆవ్యాపారపువృద్ధికై, జంషెడ్జి తాతా 1864 లో లండనుకు వెళ్ళెను.

హఠాత్తుగగల్గిన యీలాభద్రవ్యముతో కొందరు బొంబాయి వర్తకులు ప్రావిడెంటుకంపెనీలరీతి క్రొత్తకంపెనీలను, విచిత్రవ్యాపారములను, ఆరంభించిరి. ఈధనప్రవాహము చాలయేండ్లు వచ్చుననియే తలచి, వారనాలోచితముగ వర్తించిరి. అమెరికాలోని యాయుద్ధము, అందుచే బొంబాయికి లభించిన

* ఆంగ్లదేశమే 'ఇంగ్లండు' అనబడును. ఇది దీని కుత్తరమందున్న స్కాట్లండుతో కలసి యేకద్వీపమై 'బ్రిటను' అనబడును. ఆ దేశీయులను 'బ్రిటిషు' వారని యందుము. లంకషైరు ఇంగ్లండులో నొకజిల్లా.

దూదివ్యాపారపు ధనప్రవాహమును, కేవలము తాత్కాలికమే యనుసంగతిని వారుమరచిరి. వారిట్లుకష్టార్జితద్రవ్యమునువిచ్చల విడిగ ధారబోయుచుండగనే, హఠాత్తుగ, 1865 లో అమెరికా సంయుక్తరాజ్యపు యుద్ధము నిల్చిపోయెను. అచ్చటి యుత్తర జిల్లాల సేనలు దక్షిణప్రాంతముపై విజృంభించి, జయించెను; నీగ్రోదాస్యముపోవుపరతున రెండుప్రాంతములకు సంధియేర్పడె ను. అంతట, అమెరికానుండి మరల నింగ్లండుకు దూదియెగుమతి యథాప్రకారము కొనసాగదొడగెను. తమ యవసరమిట్లు తీరి నందున, ఆంగ్లేయులు మనదేశపు దూదినికొనుట మానుకొనిరి. ఇట్లు సీమయెగుమతి నిల్చిపోగనే, బొంబాయిలోను బ్రిటిషు రేవులందును నిలువయున్న మనదేశపు దూదిబేలులకు గిరాకి పోయి, ఒక్కసారిగ ధరతగ్గిపోయెను; అమ్మువారేగాని కొను వారు లేరైరి. హఠాత్తుగ స్థితిగతులు తలక్రిందులైనందున, ఈ వ్యాపారముచేయు బొంబాయివర్తకులకు కోట్లకొలది రూపా యల నష్టము కలిగెను. ఆప్రావిడెంటు కంపెనీలు, చాలమంది పెద్దవర్తకులును, కొన్ని బాంకులునుగూడ, దివాలాతీసెను.

ఈ కల్లోలసమయమునకు జంషెడ్జి వేలకొలది దూది బేళ్ళను లండనులోజేర్చి, అందొకప్రత్యేకపు బాంకును స్థాపించు చుండెను; తాతాకంపెనీకిని అప్పుడపారనష్టము కలిగెను; తమ వ్యాపారమంతకును మూలచ్ఛేదము కలుగునట్లుండెను; వ్యవ హార మహసవ్యముగుటకనిపెట్టి, తాతా నిదానించెను; లండనులో

తలపెట్టిన బాంకుయత్నమును మాని, తన అసలుకంపెనీ యా దివాలా యుప్పెనలో బడకుండ జాగ్రత్తతో నతఁడు కాపాడెను. బ్రిటిషువర్తకులకు నచ్చఁజెప్పి, వారికి దామియాయవలసినసొమ్ముల వాయిదాలపైన నిచ్చుటకేర్పర్చి, తమపరపతికి భంగములేకుండ జేసికొనెను. తాతా ఋజుత్వము న్యాయవర్తనము జూచి, సంత సించి, బ్రిటిషువర్తకు లాయేర్పాటులనంగీకరించిరి. బ్రిటనులో నిలువయున్న తమకంపెనీవారి దూదిబేలులనెల్లో సొమ్ముచేసి కొని, జంషెడ్జి బొంబాయిచేరి, తమమూలసంఘము నెల్టెటులో రక్షించెను; ఆయన న్యాయశీలతను బట్టి బాకీదార్లు సమాధా నమొందిరి. బొంబాయిలో నిలవయున్న సరుకులగూడ నెల్టెటు లో యమ్మి, అందుచేవచ్చిన స్వల్పద్రవ్యముతో తాతాకంపెనీ నిదానముగ మరలవ్యాపారమారంభించెను.

అప్పుడు తాతాకు కాకతాళీయముగ నొకపెద్దబేరము లభించెను. ఆఫ్రికాలో తూర్పుభాగమున 'అబిసీనియా' దేశము కలదు. అందుకొంతభాగమడవులు, కొండలు; మిగిలినదియెడారి. 1867 లో, అచటిరాజు కొందరాంగ్లేయులపై కోపించి, వారిని ఖైదులో నుంచెను. వారలవిడిపించుటకు రాయబారములు జరి గియు వ్యర్థమయ్యెను. అంతట బ్రిటిషుప్రభుత్వమువా రబిసీని యాపై యుద్ధమారంభించిరి. మనదేశము అబిసీనియాకు దగ్గర; రెంటిమధ్య, అరేబియా సముద్రమేయడ్డము; బ్రిటిషునాయకత్వ మున మనదేశీయుల సేనతో అబిసీనియాను జయించుట సుల

భము † అందుచే 'నేపియరు' దొరగారి సేనానిత్వమున నొక భారతీయసేనమనదేశము నుండి యాదండయాత్రకు పంపబడెను. ఆసేనకు వలయు వస్త్రాహారాది సామగ్రి నంతను సకాలమున సమకూర్చుటకు, మనప్రభుత్వమువారు కొందరు బొంబాయివర్త కులతో ఖరారునేర్పర్చుకొనిరి. అదిగుత్తబేరము: ప్రభుత్వమువా రేకముగ కొంతసొమ్మునిత్తురు; ఆయుద్ధకాలమున నాఫ్రికాలో నా సేనకవసరమగు సామాగ్రి నంతను ఆవర్తకులు పంపవలెను. సామగ్రుల హెచ్చుతగ్గులబట్టి కలుగు లాభనష్టములావర్తకులవే. ఇందు తాతావారును ముఖ్యభాగస్థులు. కొంతసామగ్రితో మన సేన యబిసీనియాకు దాడివెడలెను. తీవ్రయుద్ధము జరుగునని, మహాగహనమగు ఆదేశపుకొండలను లోయలనదులను దాటి రాజధానిజేరుటకు చాలయేండ్లు పట్టునని, అందుకు హెచ్చుసామానులనింకను చాలసారులు పంపవలసియుండునని, అందరును తలచిరి; ఆభావమున నావర్తకులకు గుత్తసొమ్ము కొంతహెచ్చుగా నిర్ణయమయ్యెను. కాని ఫిరంగులుమున్నగు అమోమయము లగునాగ్నేయాస్త్రములతో నాంగ్లభారతవాహిని దండెత్తివచ్చి పైబడుచున్నదనివార్తవినినంతట, అబిసీనియారాజు తానోడుదు ననిభీతుడై, పరాజితుడై కష్టములబడుటకన్న చావుమేలని, ఆత్మహత్యచేసికొనెను. రాజు పోగనే, అబిసీనియాసైనికులు చెదరి

† ఆంగ్లదేశమునుండి అబిసీనియాకు సేనలబంపుచో బ్రిటిషువారికి చాల హెచ్చువ్యయప్రయాసములు గల్గును.

పోయిరి.* అందువలన, ఎదురుసేనతో యుద్ధములేకుండ మన సేననిర్నిరోధముగబోయి, అప్పటి ముఖ్యనగరముగు 'మగ్డలా'ను పట్టుకొని, బ్రిటిషుఖైదీల విడిపించెను. ఇట్లు 1868 వేసవికిముందే, ఆజైత్రయాత్ర విచిత్రముగ నంతమయ్యెను.

మొదటపంపిన కొంచముసామగ్రియే యాయాత్రకంతకు చాలెను. ఈగుత్తబేరమున పెద్దవాటాదారగు తాతాగారికందు చే మంచిలాభముకల్గెను. ఆద్రవ్యమును దేశమునకు తనకుగూడ లాభకరమైన వ్యాపారముకై వినియోగింపదలచి, తాతాగారంతట బట్టలమిల్లుల వ్యాపారముపై దృష్టినిమరల్చిరి.

---

* జాతీయమగు ప్రజాప్రతినిధుల రాజ్యాంగపద్ధతిలేకుండ పాలన కేవల మొకవ్యక్తిగతమగుచోట్ల నట్లేయగుటసహజము.

## 4. వస్త్రపరిశ్రమ: ఎంప్రెసుమిల్లు.

ఆహారమువలె వస్త్రమును ప్రతివానికిని అవసరము.* పూర్వము నార ఆకులు ధరించిన యాటవికులును ఇప్పుడు బట్టలనే ధరించుచున్నారు. ఉన్ని, పట్టు, జంతు సంబంధములు, ప్రియములు; మరియు అవి హెచ్చువేడి నిచ్చును; అందుచే నుష్ణమగు మనదేశమున, జనసామాన్యము దూదిబట్టలనే వాడును. సాధ్యమైనంతవరకు ప్రతిదేశమువారును తమ కవసరమగు దూదిబట్టలను నేసుకొనవలెను; లేనిచో విదేశములనుండి తెచ్చుకొని, అందుల కిమ్మతుసొమ్ము ఆవిదేశముల కిచ్చుకొనవలెను.

నూలు వడకి బట్టల నేయుట మనదేశమున వేలకొలది యేండ్లనుండి పరిపాటియే. రాట్నపునూలుతో చేతిమగ్గములపైన మనదేశీయులు నేసిన సన్నని నాజూకువస్త్రములు పూర్వము ప్రాచీనగ్రంథములందును† ఖండాంతరచరిత్రలందును ప్రసిద్ధములై యుండెను. వంగదేశపు ఢక్కా మస్లినులు, నైఋతి ప్రాంతపు కాలికోలు, బందరు కలంకారీలు, విదేశములందును

*నగ్నసిద్ధాంతము కొంత వినోదహేతువైనను జనులలో వ్యాపించుట లేదు. మానరక్షణముకేగాక, శీతోష్ణములతీవ్రతనుండి శరీరమును కాపాడుటకును వస్త్రధారణమవసరమే.

† క్రీ. పూ. 4 వ శతాబ్దిలో అలెగ్జాండరుతో మనదేశమునకు వచ్చిన గ్రీకుచారిత్రకులు ఇతరలేఖకులు మనదేశమువలన మిక్కిలి సన్నవస్త్రములు నేయబడి వాడుకలోనున్నటులవర్ణించిరి. సంస్కృతకావ్యగ్రంథములందు గూడ నిట్టివర్ణనగలదు.

వ్యాపించియుండెను. కాని 18 వ శతాబ్దినుండి, ఆపరిస్థితి మారెను. యూరపులో నాంగ్లేయులుమున్నగువారు స్వయంకృషిచే తమతమదేశములందే వస్త్రపరిశ్రమ వృద్ధిచేసుకొనదొడగిరి; మనదేశమునుండి వస్త్రములను కొనుట మానిరి; అప్పటికి యూరపులో నూలు మనదేశపునూలుకన్న చాల ముతకగ నుండెను. మనదేశమునుండి దిగుమతియగు నూలుపైన, బట్టల పైన,క్రమముగా పాశ్చాత్యులు హెచ్చుపన్ను విధించిరి. ఐనను కొందరు నాజూకుగానున్న మన సన్నబట్టలనే కొనుచుండిరి. అందుపైన మనదేశపు సన్నరకపుబట్టలు తమదేశముకు రానీయకుండ నచ్చటిపాలకులు నిషేధించిరి; తమదేశపు పరిశ్రమల ననేకవిధముల ప్రోత్సహించిరి. ఇట్లు మన బట్టలకు యూరపు ఎగుమతి లేకుండబోయెను. మరియు మనదేశము 'ఈస్టిండియాకంపెనీ' అను బ్రిటిషువారివ్యాపారసంఘముయొక్క పాలనమున బడెను; ఆకంపెనీ యింగ్లండునుండి నూలు బట్టలు తెచ్చి, మనదేశమం దమ్మి, లాభమొందదొడగిరి. వారు తెచ్చు బట్టలతో పోటీలేకుండుటకై, ఆకంపెనీ పాలనమున మనదేశపు సాలెవాండ్ర కనేకనిర్బంధములేర్పడెను. మన స్వతంత్రదేశీయ రాజ్యములు నశించెను; మన ప్రభుత్వసహాయము క్షీణించెను. ఈస్థితిలో ఆంగ్లదేశమున 19 వ శతాబ్దిపూర్వార్థమున ఆవిరితో నడుపు 'ఇంజను'లను మరమగ్గములను కనిపెట్టిరి. వానిసహాయమున మిల్లులందు సన్ననిబట్టలను సమృద్ధిగ తయారుచేసి, మన

దేశమునకు తెచ్చి, ఆంగ్లేయులు వానిని మనకు చౌకగ అమ్మదొడగిరి.

మిల్లుయంత్రములందు తయారగు నూలు, బట్టలు, వడుకు నూలంత మన్నికగలవి కావు; కాని యవి సన్నగ నాజూకుగ గన్పడును; మరియు యంత్రములందు సమృద్ధిగ బహుళోత్పత్తి జరుగును; కనుక మిల్లుబట్టలు చౌకగ నుండును. వానినే మనదేశీయులు కొని వాడజొచ్చిరి. ఇట్లు పరిస్థితులు తారుమారై, బ్రిటిషు మిల్లుబట్టల చలామణి మనదేశమున 19 వ శతాబ్దిలో చాల హెచ్చినది. క్రమముగ వడుకుట మున్నగు మనచేతి పనులు క్షీణించెను. ఆపనివాండ్లా వృత్తుల గోల్పోయి, కూటికై యల్లాడజొచ్చిరి. అట్టి వృత్తిహీను లదృష్టవశమున కూలిదొరికిన భుజింతురు; లేనిచో, ఏకాదశీ వ్రతఫల మనుభవింతురు.*

తుదకు మన సాలీలు వడుకువాండ్రుగూడ విదేశపు మిల్లుల సన్నబట్టల ధరించుటచే, అందుకు సొమ్మిచ్చుకొనుచుం

*రొక్కపు రూపమున పోల్చినచో, చేతివడుకు నేతలచే ఒకనికివచ్చు ఆదాయము చాలతక్కువ(అది మిల్లుకూలికి తీసిపోవును.)కాని ఆచేతిపనులను బీదలు తమయింటనే కొద్దిపాటిమూలధనముతో స్వేచ్ఛతో చేసుకొనవచ్చును; మరియు తమయితరకార్యములకు భంగములేకుండ, ఇంటస్త్రీలు బాలురు కూడ తీరికయైనప్పుడు చేసుకొనవచ్చును. ఇట్టి స్వతంత్రవృత్తి ప్రతివానికిని అందుబాటులోనుండును. కూలీలకు యజమానులకృపయే అధారము. యంత్రాలయముల పరిస్థితులు ననారోగ్యకరములు; కాని, జనులు చౌకయగు మిల్లుబట్టలనే అభిమానించిరి. అందుచే మనదేశములో వడుకుట నేత క్షీణించి మిల్లుబట్టలే వ్యాపించినవి.

డిరి. గ్రామములందు వీరును ఇతరజనులు చాలమందియు నిరుద్యోగులు, నిరాహారులు, అయిరి. విదేశపుబట్టల దూదియు తరుచు విదేశపుదే; కనుక మనప్రత్తికిని ఖర్చుతగ్గి, ధరలేక, మన ప్రత్తిసాగుకును చాల నష్టము కలిగినది. 19 వ శతాబ్దిమధ్యకు, ఇట్లు మన యార్థికస్థితి విషమించెను. విదేశములకు ధనప్రవాహము పోకుండ అరికట్టినగాని అనీరసస్థితి పోదని, అందుచే జనులకు రుచించు మంచి మిల్లుబట్టలనే మనదేశమున తయారుచేయవలెనని, మనదేశపుపరిశ్రమలరక్షణ కదియే మార్గమని, ఆపరిస్థితిలో చేతినూలు మిల్లునూలుతో పోటీచేయలేదని, జంషెడ్జి తాతాకు తోచెను.

మనదేశపు మొదటి బట్టలమిల్లు 1855 ప్రాంతమున బొంబాయియం దేర్పడెను. అది కేవలము ముదుకనూలు మిల్లు; దానిని జూచి కొందరింగ్లండునుండి యట్టి యంత్రములనే తెప్పించి, బొంబాయిప్రాంతమందే మిల్లుల నెలకొల్పిరి. అందా ప్రాంతపు దూదితో ముదుకబట్టలు దయారగుచుండెను. (అమెరికా యుద్ధపు నాలుగేండ్లలో మాత్రము ప్రత్తిధర చాల హెచ్చి, మిల్లులకు గిట్టుబాటు లేకుండెను). బొంబాయి శీతోష్ణస్థితి, అచ్చటి చల్లనినీటిగాలి, వడకుటకు నేతకు అనుకూలములు; ప్రత్తి పండు జిల్లాలు దాని దగ్గరనున్నవి; అచ్చట ధనాఢ్యులు నుండిరి. ఇట్లుచాలమిల్లులు బొంబాయిలోనే యేర్పడెను.

జంషెడ్జీతాతాయు కొందరు వాటాదార్ల గూర్చుకొని, 1869 లో చౌకగ అమ్ముచున్న యొకతైలయంత్రమును కొని, దానికి కండెలను మగ్గములను చేర్చి, బట్టలమిల్లుగా జేసి, 'అలెగ్జాండ్రామిల్లు' అనుపేర, దానిని నడపెను. కాని ఈమిల్లును ముదుకనూలునే చేయును. అంతకన్న సన్ననినూలుబట్టలజేయు మిల్లును తాతా స్థాపింపదలచెను; అవకాశము దొరకగనే 1873 లో అలెగ్జాండ్రామిల్లు ఒక శ్రీమంతున కమ్మివేయబడెను; అందుచే తాతాకు కొంతలాభము కలిగెను.

లోగడ దూదియెగుమతి వ్యాపారముకై యింగ్లండులో నుండినప్పుడు జంషెడ్జీ అచటిమిల్లుల కార్యమును గమనించెను. అంతట మన దేశమందు తాను మిల్లుపరిశ్రమ సాగింపవలెనని తాతా కుత్సాహముకలిగెను. కాని యీలోగా ఇంగ్లీషుమిల్లులందు సన్నసూలుకై యంత్రములను పద్ధతులను బాగుచేసి క్రమముగ కొత్తరకముల బెట్టుచుండిరి; ఆపరిశ్రమ రహస్యములను నవీనపద్ధతులను బూర్తిగ తెలుసుకొనుటకు మరల నింగ్లండు జని, జంషెడ్జీ అచటి లాంకషైరులో కొత్తయంత్రముల స్వయముగ బరీక్షించి, సన్ననూలు తయారుచేయు పద్ధతులను వ్యాపారమర్మములను గ్రహించి, తన కవసరమగు ప్రశస్త యంత్రముల నెన్నుకొని, తిరిగివచ్చెను. అప్పుడే యీజిప్టుప్రక్కను సూయెజుకాలువ త్రవ్వబడి, మధ్యధరాసముద్రముద్వారా, మనకు యూరపుతో దగ్గరదారి యేర్పడెను; ఇట్లు రాకపోకల సౌకర్యము హెచ్చెను.

తాతా అంతట నాయంత్రస్థాపనకై స్థలపరిశోధన గావించెను. ఇంతవర కందరును గతానుగతికముగ బొంబాయిలోనే మిల్లుల బెట్టుచుండిరి. అందుచే వారిలో పోటీ, పనివాండ్రగిరాకి, ప్రత్తిధర హెచ్చుటయు, కల్గెను. మరియు యింజనులకు నలయుబొగ్గు, కలప, బొంబాయివద్ద లేవు; దూరము నుండి తెప్పించుటకు రైలుఛార్జి చాల తగులును. ఆమిల్లులందు తయారగుబట్టలను దూరప్రాంతములకు చేర్చవలసియుండి, అందుకు హెచ్చు వ్యయప్రయాసములు కల్గును. ఈసంగతుల గమనించి, బొంబాయివాసియైనను తాతా తన సౌకర్యమునే చూచుకొనక, దూరదృష్టితో తన మిల్లును మనదేశపు మధ్యనున్న మధ్యరాష్ట్రపు రాజధానియగు నాగపురమునొద్ద స్థాపించెను. అది ప్రత్తి పండు జిల్లాలమధ్య నున్నది; కలపగల యడవులు నేలబొగ్గును దానికి చేరువ; చుట్టుపట్ల జనపదములం దామిల్లుసరుకుల పోటీలేకుండ, అమ్మవచ్చును. ఆప్రాంతమం దెచ్చటను అప్పటికి బట్టలమిల్లేలేదు. దానిని 1877 ఆరంభమున స్థాపించి, 'ఎంప్రెస్‌మిల్లు' అని పేరిడిరి.* బొంబాయిమిల్లుబట్టలకన్న, ఈయెంప్రెసుమిల్లుబట్టలు చాల సన్ననివి, మెత్తవి,మన్నికగలవియై, చాల చౌకగగూడ నుండెను; అవి దేశమంతటను

*మన 8 వ ఎడ్వర్డు రాజుకు ప్రపితామహి అప్పటిరాణిఅగు విక్టోరియా 1-1-1877 తేదీని మనదేశపు 'ఎంప్రెస్'(=చక్రవర్తిని)బిరుదువహించెను. ఆతేదీనే ఈమిల్లు నేర్పర్చిరి.

వ్యాపించి, ప్రసిద్ధమయ్యెను. ఈకంపెనీకి 'సెంట్రల్ ఇండియా స్పిన్నింగ్ అండ్ వీవింగ్ మిల్స్' అని పేరిడిరి.

జంషెడ్జి మేధావియగు 'దాదాభాయి' అను పార్సీ యువకుని తరిఫీయతుచేసి, అతని నీమిల్లుకు మేనేజరుగ నియమించెను. ఆయన తాతా యుద్దేశించిన క్రొత్తపద్ధతుల నమలులోనికి తెచ్చి, నిరంతరము కృషిచేయుచు, కార్మికుల ప్రోత్సహించుచు, ఆమిల్లును వృద్ధిచేసెను. క్రొత్తపద్ధతులను ముందుగా సరిగా పరీక్షించి, అవి తృప్తికరమైనచో, (ఇతరయజమానులవలె జంకక) జంషెడ్జి ఎంత వ్యయప్రయాసములకైన సహించి, వెంటనే వానిని తనమిల్లులం దవలంబించెను. జనోపయోగము వ్యాపార వృద్ధియునే తనకు ముఖ్యముగ నెంచెను, కాని యాయన తన లాభమే ప్రధానముగ నెంచలేదు. అట్టి యాదర్శముతో, తన మిల్లులందు పాతబడిన యంత్రముల తీసివేసి, చాల హెచ్చు కిమ్మతువైనను, నవీనపరిశోధనల ననుసరించి తయారైన గుండ్ర కండెలను ఇంకను క్రొత్తపనిముట్లను తెప్పించి, తనమిల్లులం దమర్చెను. అందువలన ఆయనమిల్లుల బట్టలు క్రొత్తరకపు మాంచెస్టరు సన్నబట్టలకును నాణెమున తీసిపోకుండెను; అవి యంతటను ఖర్చగుచుండెను. బిరారు నాగపురప్రాంతమున చక్కని ప్రత్తి పండును; ప్రత్తి పండు గ్రామముల మధ్యనే తాతా కొన్ని జిన్నింగు (=గింజలుతీయు) మిల్లుల నేర్పర్చెను; అచట కూలి చౌక; అందువల్ల దూది చాల చౌకగ తనమిల్లులకు చేరును; ఆగ్రామీణులకు నందుచే జీవనము నేర్పడెను.

తాతాతనపనివాండ్ర కష్టములగమనించి, వారికి మంచి వసతిగృహముల నిర్మించెను; ఎక్కువసమర్థులకు సాలీనాబహుమతులను, లాభములలో వాటాను గూడ, ఇచ్చుచుండెను. వారికి ప్రావిడెంటుఫండుపద్ధతినేర్పర్చి, సహాయముచేసెను; అందుచే వృద్ధులైనప్పుడాపనివాండ్రకు జీవనోపాధిలభించును. ఆపనివాండ్రా యంత్రాలయము తమదనుభావముతో, ఉత్సాహముతో పనిచేయుచుండిరి; వారికై తాతా యుచితగ్రంథాలయమును, పఠనాలయమును నడిపెను; చిరకాలముపనిచేసి యశక్తతచే మానువారికి కొంతపారితోషికము గూడ నిచ్చుచుండెను. మనలో విద్యార్థికులగు యువకు లుద్యోగములకే యత్నించుట యాచారమైనది;అట్లుగాక, ఉన్నతవిద్య నేర్చినవారికి పరిశ్రమలవైపు దృష్టి మరల్పదలచి,ఆయన కొందరుయువకులకు వ్యాపారోత్సాహముకల్గించి, వారిని సాలీనా ఎంప్రసుమిల్లులో చేర్చుకొని, వారికి పరిశ్రమల వివిధచర్యల నడుపువిధము నేర్పుచు, ఆతరిఖీయతుకాలమున వారికి కొంతజీతము గూడ నిచ్చుచుండెను. ఆయువకులు అందుమూడేండ్లు తమకిష్టమగుపరిశ్రమశాఖల నేర్చుకొని, అంతట తాతాసంఘమువారి కార్యాలయములో.నే నిర్వాహకులగుదురు; అందు ఖాళీలేనిచో, వా రితరత్ర పనిచేసుకొనవచ్చును. ఇట్లిందు నవీనవ్యాపార మర్మములందు తేలిన విద్యావంతులగు యువకులను బొంబాయి అహమ్మదాబాముల మిల్లుదార్లు తమ మిల్లుల మేనేజర్లు (=నిర్వాహకులు)గ సంతోషముతో గ్రహించుచుండిరి.

ఈరీతి నాయువకుల ద్వారా తాతాగారి పద్ధతులు కొంతవరకు నితరులమిల్లులకును వ్యాపించెను; వానిలో క్రమాభివృద్ధికల్గెను. తాతా దేశక్షేమమే ముఖ్యముగనెంచెను, కాని స్వలాభము ప్రధానమని యెంచనందున, వ్యాపారమర్మములను రహస్యముగనుంచక, తోటిమిల్లుదారులకును ధారాళముగ తెల్పుచుండెను. ఇట్లన్ని విధములను ఎంప్రెసుమిల్లులు వృద్ధిజెంది, జనాకర్షకమై మార్గదర్శకమయ్యెను. లాభకరమగు క్రొత్తపద్ధతులు మొదట ఎంప్రెసుమిల్లులో ప్రవేశమై, తరువాత కొంతవరకితరమిల్లులకుప్రాకి, వానికిని ఉపయోగించెను.

తాతా సాహసముతో చేయుప్రయత్నములలో కొన్ని మొదట విఫలమైనను, అంతటితో నిరాశుడుగాక, అనుభవమునుబట్టి లోపముల సవరించి,అవసరమగుమార్పులజేసి, ఆయన తుదకు జయమొందుచుండెను. ఇట్లు 12 ఏండ్ల నిరంతరపరిశ్రమతో తాతా యామిల్లుల నాదర్శప్రాయముగజేసెను; అంతటినుండి దాదాభాయియు నితరోద్యోగులునే ఆమిల్లుల నట్లు చక్కగ నడుపజొచ్చిరి; తాతా అందులకికశ్రమపడలేదు. ఆయనతల పెట్టిన తక్కిన ఉద్యమములకుగూడ దాదాభాయి కుడిభుజముగ నుండి, సాయముచేయుచుండెను.

చక్కనిపద్ధతులపై నడపుటచే, ఈకంపెనీకార్యికముగను జయముకల్గెను; 30 ఏండ్లలో మూలధనముకు 13 రెట్లసొమ్ము లాభించెను. అందుకొంత క్రొత్తరకపు యంత్రములకై ఖర్చులయి,

మిగిలినది భాగస్థులకు పంచియీయబడెను. ఆ మిల్లుకుక్రొత్త యంత్రము లేర్పడి, వ్యాపారమువృద్ధియై, తుదకది 5 పెద్దమిల్లుల సమూహముగానేర్పడినది; వానికితోడు, అద్దకపుపనులు మున్నగు అనుబంధపరిశ్రమలకును విశాలభవనములు, వసతిగృహము లు, వ్యాయామస్థానములు మున్నగునవి చేర్చి కట్టబడినవి. ఆ మిల్లుల నిర్వాహకులగు తాతాకంపెనీవారు తరువాత నాగపుర మందున్నతవిద్యాభివృద్ధికి చాలసాహాయ్యముచేసిరి. 1921 లో తాతాపేర స్త్రీలకు హైస్కూలు స్థాపితమై, దానికి తాతాకంపెనీ వారు లక్షరూపాయలనిచ్చిరి. 1925 లో నాగపురవిశ్వవిద్యా లయ మేర్పడెను; అప్పుడు జంషెడ్జి తాతాకు స్మారకముగ 'యూనివర్సిటీ' భవనము నిర్మించుటకు తాతాసన్సువారింకొక లక్షరూపాయలనిచ్చిరి. ఇట్లు తాతాకుటుంబమువలన, ఎంప్రెసు మిల్లుద్వారా నాగపురప్రాంతమున వేలకొలదిజనులకు జీవనో పాధి యేర్పడుటయే గాక, అనేక విద్యాసంస్థలకును చాల ప్రోత్సాహము కల్గెను.

---

2

## 5. వస్త్రపరిశ్రమ: స్వదేశీ అడ్వాన్సుమిల్లులు.

పదేండ్ల నిరంతర కృషిపైన, ఎంప్రెసు మిల్లువలన తాతా కు చాల ద్రవ్యము చేరెను; అంతట దానితో జంపెడ్జిమరొక కీతి మిల్లును పెట్టదలచెను; అప్పటి కింకను బొంబాయి మిల్లు లన్నియు ముతకునూలువే; సన్ననూలుకు, ఆయంత్రములు, ప్రత్తిగూడ, మారవలెను. ఆంగ్లదేశపు మాంచెస్టరులో వాడు కం డలు మగ్గములు సున్నితములు; అవి హెచ్చు కిమ్మతువి; మరి యు తను వాడుకలో లేని కొత్తయంత్రముల దెచ్చుటకు బొం బాయి మిల్లుదార్లు వెనుదీయుచుండిరి. కాళిదాసు కాలమునుండి హెచ్చరిక కల్గుచున్నను అన్ని విషయములందును పూర్వపద్ధ తులన్న మనకు విశేషాదరము.* విదేశమున సన్ననూలు వచ్చు కొత్తయంత్రముల దెప్పించి వాడుమ మని తాతా ప్రోత్సహించెను; కాని తక్కిన మిల్లుదార్లందుకు సిద్ధపడరైరి.

మన దేశమున సామాన్యముగ పండించు ప్రత్తిపొట్టిది; దానినుండి సన్ననూలు వచ్చుట కష్టము. తెగకుండ సాపుగ సన్ననూలు నిచ్చు ప్రత్తిరకముల పండించుట యవసర ము. ఆరకములు అమెరికా ఈజిప్టులలో వాడుకలో నున్నవి. తాతా మొదట నీజిప్టువెళ్ళి, అందుండి మంచిదూదిని తెప్పించి

---

* 'పురాణ మిత్యేవ నసాధు సర్వం, నచాపి సర్వం నవమిత్యవద్యం। సంతఃపరీక్ష్యాన్యతరద్భజంతే, మూఢః పరప్రత్యయనేయ బుద్ధిః' కాళిదాసుని మాళవికాగ్ని మిత్రము; కాళిదాసు జీవించి యిప్పటికి అథమము 1500 వత్సర ములై యుండును.

పరీక్షించి, అంతట నచ్చటి మంచివిత్తుల దెచ్చి, అనుకూలమగు పొలములందు స్వయముగ మంచి ప్రత్తిని పండించెను; ఆదూది తో మంచి సన్ననూలు వచ్చెను ; అంతట మాంచస్టరుమిల్లును తీసిపోని మిల్లును బొంబాయి ప్రాంతమున స్థాపించి సన్ననూలు తయారు చేయుటకు జంషెడ్జి నిశ్చయించెను.

బొంబాయినగరమునకు 9 మైళ్ళ దూరమునున్న 'కుర్లా'లో ఒక పాతమిల్లు యేలమునకు వచ్చెను ; దాని యజమానులప్పటికినాలుగుసార్లు దివాలా దీసిరి. అది అచ్చిరాదని, ఇతరులు పాట వేయలేదు. తాతా దానిని 1886 లో చౌకగ కొనెను; కాని దానిముఖ్యయంత్రములు సన్ననూలు పనికి సరి పోనివి. ఆచుట్టుపట్ల తగు కార్మికులును లేరు; కాని ధీరుడగుటచే, తాతా వెనుదీయక, ఆపాతమరలను పనిముట్లను తీసివేసి, ప్రశస్తమగు క్రొత్తరకపు యంత్రముల నింగ్లండునుండి తెప్పించి, అందమర్చెను. ఈక్రొత్తయంత్రాలయమునకు 'స్వదేశీ మిల్స్' అని పేరిడెను. *ఈమిల్లులో 1892 సం॥ నుండియు 80 వ నెంబరునకు సరిపోవు సన్ననూలు తయారగుచున్నది; మొదట కొంతసొమ్ము నష్టమువచ్చినను, క్రమముగా నది యార్థికముగాను జయప్రదమై యెంప్రెసు మిల్లువలె నయ్యెను. అంతట మరికొన్ని కంపెనీల

* అప్పటికి 'స్వదేశి' ఉద్యమ మారంభించలేదు; అందువలన 'స్వదేశీ' పదము కంతగా ప్రచారములేదు. కాని విదేశవస్త్రముల దిగుమతిని తగ్గించి, అట్టి సన్నని వస్త్రములనే స్వదేశీయములను జనుల కందించుట కామిల్లు నుద్దేశించినందున, తాతా దీనికట్లు పేరిడెను.

వారును దాని ననుకరించిరి. అందు కింకొక కారణమును తోడ్పడెను.

ఇంతవరలో బొంబాయిలో 20, 30 వ నెంబరుకు లోపగు నూనుకనూలే తయారగుచుండెను. (ఎంప్రెసుమిల్లుది మాత్రము నె 45 రు వరకుండెను.) ఆబట్టలను మనదేశమున బీదలే కట్టుచుండిరి. నవనాగరికత హెచ్చినకొలదిని, మనవారిలో చాలమంది సన్నబట్టలనే ధరించుచున్నారు; అవి విదేశపువై యుండెను. అందువలన మన మిల్లుదార్లు తమ సరుకులలో చాలభాగము (ఇచట విడుదల కానందున) ఓడలపైన చీనా జపాను దేశముల కెగుమతిజేసి, ఆదేశీయులకు విక్రయించుచుండిరి. ఇట్లుకొన్ని యేండ్లు జరిగెను; కాని యింతలో జపానులో పెద్ద పరివర్తనము జరిగెను.

చీనాజపానులు చాలకాలము పశ్చిమదేశములతో సంబంధము నొల్లకుండెను. 1867 లో జపానులో నీస్థితిమారి, నూతనశక మారంభించెను. జపానీయులు యూరపు అమెరికాలు ఆర్థికాభివృద్ధి జెందుచుండుట కనిపెట్టి, ఆనవనాగరికతను తాము నవలంబించిరి; తమచక్రవర్తిప్రోత్సాహముతో, జపానీయయువకులా విదేశములకేగి, అందుకర్మవిద్యలను యంత్రపరిశ్రమపద్ధతులను నేర్చుకొని, జపానులో మంచిమిల్లులనేర్పర్చిరి. అంతటజపానులోనే మంచివస్త్రములు చౌకగ తయారుకాజొచ్చెను. మనదేశమునుండి వస్త్రముల గొనుటమాని, ఆద్రవ్యమును జపానీయులు

తమదేశమందే నిల్పుకొనగల్గిరి. ఆపరిశ్రమలేర్పడుటవలన జపానీయుల యార్థికస్థితి చాల బాగుపడి, ఆజనుల సంపద వృద్ధియాయెను. జపాను వ్యాపారులిట్లు క్రమముగా తమమిల్లులను వృద్ధిజేసి, ఇకముందు చీనాకును బట్టలనెగుమతిచేయదొడగిరి.

అప్పటి జపానుచక్రవర్తి యగు 'ముత్సోహితో' ప్రజాక్షేమముకొరకాదేశపు పరిశ్రమల యభివృద్ధికై చాలకృషిచేసెను. శీతలము గిరిమయము నగు జపానులో ప్రత్తి పండదు. ఆ ప్రభుత్వమాధునికపద్ధతివగు మంచి నౌకల గొనియు,నిర్మించియు, తమనౌకాబలము వృద్ధిజేసెను; జపానీయ వ్యాపారనౌకలకు సాయముచేసెను. ఈనౌక లమెరికానుండియు మనదేశమునుండియు దూదిని చౌకగ తేగా, మిల్లుదారాదూదితో జపానులో బట్టల దయారుచేసుకొందురు; అట్టినౌకలను వారు చీనాకును పంపదొడగిరి. మనదేశపుమిల్లుల కట్టి ప్రభుత్వసహాయములేదు.† జపానునౌకలవలెగాక, మనకు స్వంతమగు నౌకలు లేవు; పోటీ లేక మనసరుకులగొనిపోవు బ్రిటిషునౌకలవారు బొంబాయివర్తకులనుండి యెగుమతికి చాలహెచ్చురేటు కేవును వసూలుచేయుచుండిరి. జపానులో, ఆవిరియంత్రములకు వలయు నేలబొగ్గు చౌకగ నామిల్లులదగ్గరనే దొరకును; బొంబాయిప్రాంతమందట్టిగనులు లేవు. దూరపుగనులనుండి రైలుపై తెచ్చుబొగ్గుకు రైలుకంపెనీలు చాల హెచ్చురేటు బాడుగ వసూలుచేయును

† మనదేశపు సన్ననూలుపై నిచ్చటనే పన్నుగూడ విధింపబడెను.

యి*మరియు చీనాకు జపాను చాలదగ్గర; ఆరెండు దేశములవా రు నేకజాతీయులు. జపానీయులుసులభముగచీనాలో వసించుచు, అచటిజనులకు రుచించు రకముల వస్త్రములదెచ్చి, అందు వ్యాపింపజేయుదురు. ఇట్లు మనదేశమునుండి జపానుకుండిన యెగుమతి నిల్చిపోవుటయే గాక, జపానుతో పోటీచే, చీనాకును మన బొంబాయిబట్టల యెగుమతి క్రమముగా తగ్గుచుండెను. కొంతవరకు తూర్పుఆఫ్రికా పారసీకములందు బొంబాయిబట్టలకు చలామణి యుండెను. కాని అచటను క్రమముగ పోటీ కలుగవచ్చును. విదేశముల కొనుబడిపైననే ఆధారపడు వ్యాపారము ఎన్నడును సందిగ్ధమే. అందుల ఆధారమునేనమ్మి పరిశ్రమల వృద్ధిజేయుట భావ్యముకాదు. మనదేశీయుల కిష్టమగు సన్నబట్టలనే మన మిల్లులందు తయారుచేయుట క్షేమకరము. అందుచేత మనవ్యాపారముకు నిలుకడగల్గును; నిత్యావసరములగు బట్టలకై పరదేశాధీనత తొలగును; మన దేశీయులును బాగుపడుదురు. ఈవిషయమున జంషెడ్జి దూరదృష్టితో చరించెనని తక్కిన మిల్లుదార్లును గ్రహించిరి; తరువాతవారిలో కొందరు సన్ననూలుతీయు మిల్లులనే ఏర్పర్చిరి. ఈ'స్వదేశిమిల్సు'లో జంషెడ్జి తాతాయు ఆయన కుమాళ్ళునే ముఖ్యభాగస్వాములై, వారే ఏజెంట్లుగ దానినడుపుచుండిరి.†

---

* తరువాత తాతా మొదలిడిన జలవిద్యుచ్ఛక్తి యుత్పత్తిచే బొంబాయికి చౌకయగు చోదకశక్తి యేర్పడి, బొగ్గుబాధతప్పినది.

† వారియనంతరము దాని నిప్పుడు నడుపుచున్న తాతాకంపెనీలో తాతాగారి బంధుమిత్రులు సభ్యులుగ నున్నారు.

బొంబాయి తరువాత మనదేశమున హెచ్చుమిల్లులు గుజరాతులోని అహమ్మదాబాదుపురమం దేర్పడినవి. అచటి మిల్లులకు మార్గదర్శకమగుటకు జంషెడ్జితాతా అహమ్మదాబాదులోను ప్రశస్తమగు మిల్లును పెట్టదలచెను. అందుకై, ఆపురమందలి 'అడ్వాన్సుమిల్లు' అను ప్రాచీనపద్ధతి మిల్లు నొకదానిని కొని, దానియంత్రములగూడ పూర్తిగమార్చి, మాంచెస్టరుమిల్లులరీతిగ జేసెను. 12 ఏండ్లు అపారకృషిచేసి తాతా యామిల్లులను, ఆపరిశ్రమను, ఉచ్చస్థితికి తెచ్చి, లాభకరముగ జేసెను.

మనదేశమందలి మిల్లుల యేజెంట్లు ఆమిల్లులందు ఎంత సరుకు తయారగునో దాని అంతటి కిమ్మతుమీదను నూటికింత యని 'కమిషను' సొమ్ము తీసుకొనుట రివాజు అయినది. ఆ సరుకులు సరిగా అమ్మకము కాకున్నను, కంపెనీ వాటాదార్లకు లాభము రాకున్నను, సరుకులు తయారైనంతనే ఆసరుకుల కిమ్మత్తుకు తగిన కమిషను ఏజెంట్లకు ముట్టును. అందుచే నా మిల్లుల నడుపు ఏజెంట్లు సరుకుల హెచ్చుగ తయారుచేయుట యే ముఖ్యముగ గమనింతురు; కాని ఆసరుకులు దేశమున విడుదలయగుటకు, అవి లాభకరముగ నుండుటకు తగుశ్రద్ధ వహింపరు. ఈపద్ధతి మిల్లుల వాటాదార్లకు జనులకు గూడ తుదకు అనర్థకమగునని తాతా కనిపెట్టి, తాను ఏజెంటుగా నడుపు మిల్లులలో అట్టిపద్ధతిని తొలగించెను. కంపెనీకివచ్చు

నీకరపులాభముపైననే ఆయనకమిషనును, మితముగ, తీసుకొనుచుండెను. అందువలన తాతాగారి యాజమాన్యమన్న జనులకు వాటాదార్లకుగూడ హెచ్చు నమ్మిక, గౌరవము, ఏర్పడెను. ఇట్లాయన స్వార్థపరతలేకుండ, వ్యాపారవృద్ధినే ప్రధానముగ చేసికొనెను; ఈపద్ధతిచే మొదట కొన్నియేండ్లాయనకు నష్టము కల్గెను; కాని క్రమముగా, ఆయనమిల్లులు ప్రసిద్ధమై చాల వృద్ధియై, ఆయనకు తుద కందుండి చాల లాభమే కల్గెను.

తనమిల్లులందు తాతా యవలంబించిన యింకొక క్రొత్త పద్ధతి రాత్రులందును మిల్లు పని జరుపుట; తక్కిన ఫాక్టరీలవలె గాక, దూదిమిల్లుల కగ్నిస్పర్శమైనచో, అపారనష్టము కల్గును. రాత్రులందు మామూలుదీపముల నుంచుటచే, నిప్పు దూదికిని ఆ సరుకులకును తగులవచ్చును. ఈభయమున హెచ్చుపనిగల సమయములందును బొంబాయిమిల్లుదార్లు రాత్రులందు తమ యంత్రముల తెరువరైరి. ఆంగ్లదేశమందు 'ఎలెక్ట్రికు' (విద్యుత్) దీపములతో రాత్రులందును మిల్లుల బనిచేయ దొడగిరి.

ఆపద్ధతిని స్వయముగ జూచి, ఈరీతిగ రాత్రులందును మిల్లులను భద్రముగ నడుపవచ్చునని మనదేశమున తాతాయే మొదట కనిపెట్టెను. అప్పటి కింకను మనదేశమున విద్యుద్దీపముల వ్యాప్తి లేకుండెను. కాని ఆసౌకర్యలాభమును ఇంగ్లండులో గమనించిన తాతా తన ఎంప్రెస్సుమిల్లులందు ముందుగా

ఎలెక్ట్రిక్కు దీపములఁబెట్టి, ఆమిల్లులను అవసరమైనప్పుడు రాత్రు లందును నడిపి, చాల హెచ్చుసరుకుల దయారుచేసెను. తరు వాత దానినిజూచి, ఇటీవల తక్కిన మిల్లుదార్లును కొంద రా పద్ధతి నవలంబించిరి.*

---

* విద్యుచ్ఛక్తి కాంతినిచ్చుటకే గాక, పంకాతో గాలి విసురుటకు, ఆవిరికిబదులుగ ఇంజను నడుపుటకును గూడ, ఉపయోగించును. నాగపుర ప్రాంతమున జలపాతములేదు. అచట ఆవిరిమూలముననే టాటావారు విద్యు చ్ఛక్తిని పుట్టించి, దానితోనే కొంతవరకు మిల్లులగూడ నడుపుదురు. కనుమల నుండి జలపాతముతో టాటావారే తరువాత విద్యుచ్ఛక్తిని జనింపజేసిరి. దానితో నిప్పుడు బొంబాయిలో మిల్లుల నడుపుచున్నారు.

## 6. కొన్ని వ్యాపారసమస్యలు, ప్రత్తిపంట.

ఇట్లామిల్లులు వృద్ధియైనంతట, వానిని తాతాయుద్యోగస్తులే ఆయనపద్ధతులతో స్వయముగ నడుపదొడగిరి. ఇట్లు కలిగిన తీరికతో, ఈవ్యాపారసంబంధమగు కొన్నిముఖ్య సమస్యలను జంషెడ్జి పరిష్కరింప యత్నించెను. అందు ప్రత్తి వ్యవసాయము, నౌకావ్యాపారము, కార్మికసమస్య, దూదిసరుకులపై పన్ను, ముఖ్యములు.

మనదేశపు రయితులు సాధారణముగా చాలబీదలు, చదువులేనివారు; నవీనపరిశోధనలు, వానిని వ్యవసాయముకు వినియోగించు విధములు, వారికి తెలియవు. చిరకాలమునుండి కురచపోచగల మామూలు ప్రత్తినే చాలవరకిప్పటికిని మనరయితులు పండించుచున్నారు. ఆప్రత్తినుండి సన్ననూలు వచ్చుట దుర్లభము. పొడుగుపోచగల్గి సన్ననూలు తీయగల జడప్రత్తి, కంబోడియాప్రత్తి, మున్నగు రకములను ధారాళముగా పండించుటకవలంబించు పద్ధతులను కొందరు విద్యావంతులు విదేశములందు నేర్చుకొని, అట్టిప్రత్తిని ఆయాప్రాంతములందు పండించి, రయితులకు చూపినచో, వారు నేర్చుకొందురు; అట్టి మంచి ప్రత్తిసాగు మనదేశమునయిట్లు క్రమముగ వ్యాపించును. వానితో మనమిల్లులందు సన్ననూలునే తీయవచ్చును. అట్టిదూది మన దేశమున సమృద్ధిగా లేక, దానిని సన్ననూలుకై యితరదేశముల నుండి చాల సొమ్మిచ్చి తెప్పించుకొనవలసి వచ్చుచున్నది; మన

దేశమున సాగగు ప్రత్తికి తగు గిరాకి లేకున్నది. ఇట్లు మన వ్యవసాయదారులకును కూలీలకును వృత్తి తగ్గుచున్నది. మరియు మంచిదూదికై విదేశములపైననే యాధారపడుట మన మిల్లు పరిశ్రమ కెప్పటికైనను అనర్థకమే.

తాతా ఈసిథికి ప్రతిక్రియ నాలోచించెను. ఈజిప్టు మనదేశముకు సమీపము. అందు, ఇటీవల నైలునదిదగ్గర ప్రశస్తమగు ప్రత్తిసాగు ఆరంభించి, తృప్తికరముగ జరుగుచున్నది. తాతా ఈజిప్టువెళ్ళి, అచటి ప్రత్తిసాగు పద్ధతుల స్వయముగ జూచి, అందుండి క్రొత్తరకపు మేలైన ప్రత్తివిత్తులను నాగళ్ళను తెచ్చి, ఆవ్యవసాయ పద్ధతులను కొన్ని వీలైన భూములందు స్వయముగా అమలుజరిపించి చూపెను. ఆప్రత్తి సాగుకు కొంత జ్ఞానము, సాహసము, పెట్టుబడి, అవసరములు; అవి యిచ్చటి మామూలు వ్యవసాయస్థులకు లేవు. ఆరంభ కాలమున ప్రభుత్వము మిల్లు యజమానులుకూడ నిందుకు రైతులకు తగుప్రోత్సాహ మీయవలెను. ఆసాయమప్పుడు కలుగలేదు; తక్కినమిల్లుయజమాను లిందుకు తోడ్పడరైరి; అందుచే, తాతా తీవ్రముగ యత్నించినను, ఆవ్యవసాయము దేశమం దంతగా నప్పుడు వ్యాపించలేదు. తాతా తెల్పినను, ప్రభుత్వమును అప్పుడు తగుశ్రద్ధ వహింపలేదు, ఆప్రత్తి యీదేశమున పండదని వారెంచిరి. కాని తరువాత ప్రభుత్వశాఖవారు కొందరు మిల్లుయజమానులునుగూడ, తాతా కనపర్చిన పద్ధ

తిని, సింధు కతియవారు ప్రాంతములందు, అట్టి ప్రత్తిని పండించిరి. అందుచే తాతాగారి ఆయత్నము సత్యమే అని స్పష్టమయ్యెను* ఆప్రకార మిటీవల నవీనపద్ధతులతో చాలచోట్ల, ఈ కొత్తరకముల ప్రత్తిని రయితులును పండించగల్గుచున్నారు.

---

* బ్రిటిషుదేశమున సన్నబట్టల మిల్లులు హెచ్చుగ కలవు. అందుకు వలయుమాదికై యెల్లకాలమును అమెరికాపై నాధారపడక, సామ్రాజ్యమందే అట్టిప్రత్తిని పండించవలెనని, బ్రిటిషు పారిశ్రామికులు నిశ్చయించిరి. అంతట ప్రభుత్వసహాయముతో నీజిప్టులో కొంతమంచిప్రత్తి సాగుచేయబడెను. ఇట్లే భారతదేశమున ఇట్టిప్రత్తి పండుచో, ఆమూదిని ఆంగ్లేయులు చౌకగ తెప్పించుకొనవచ్చును. అందుకు ప్రత్యామ్నాయముగ తిరుగ స్టీమరులందు కిఫాయతీ రేటుపన్నుతో తమసీమబట్టలను మనదేశమునదింపి యిచట విక్రయించుట లాభకరమగును. బ్రిటిషువర్తకుల ప్రోత్సాహముతో ప్రభుత్వమువారు శ్రద్ధవహించి ఇటీవల మంచి ప్రత్తిపండించుట కేర్పాటుల జేసిరి.

38.

## 7. నౌకావ్యాపారము.

మనదేశపు మిల్లులం దిదివరలో ముతకబట్టలే తయారగుచుండెను. వానిలో కొన్నిమాత్ర మిచట ఖర్చుఅయినను, చాలభాగము చీనా జపాను పారసీకము తూర్పుఆఫ్రికామున్నగు విదేశములందే అమ్ముచుండెను. (అప్పటికింకను జపానులో మిల్లు లేర్పడలేదు; ఆపోటీబాధ తగులలేదు.) బొంబాయి ప్రాంతములనుండి ఆదేశములన్నిటికిని స్టీమరులపైననే సరుకుల బంపవలెను. మనదేశమునుండి అప్పు డాదేశములకు బ్రిటిషు వారి పి. అండ్ ఓ. కంపెనీయు, ఇటలీ ఆస్ట్రియాల మరిరెండు కంపెనీలునే, ఓడలనడుపుచుండెను. ఈకంపెనీలమధ్య పోటీ యున్నంతకాలము కేవుల రేట్లు న్యాయముగనే యుండెను. కాని యీసరుకుల యెగుమతికి తామే యాధారమగుట గాంచి, ఈ మూడు యూరపియనుసంఘములు నేకీభవించి, కేవులను చాల హెచ్చించిరి. అందువలన మన మిల్లుదార్ల లాభపుద్రవ్యమంతయు కేవులరూపమున హరించి, నౌకాసంఘములకు పోవుచుండెను. కష్టపడి వ్యాపారముచేయు బొంబాయిమిల్లు వర్తకులకు గిట్టుబాటే లేకుండెను; కాని వారు చేయునదిలేక యట్లే సరుకుల బంపవలసివచ్చెను. ఈవర్తకులలో నొకరగు జంషెడ్జీ తాతా ఆయూరపియను కంపెనీల యన్యాయచర్యలకు ప్రతిక్రియ చేయదలంచెను; న్యాయమైనరేటుకే బొంబాయినుండి చీనాజపానులకు సరుకులగొనిపోగల మరియొకసంఘ మేర్ప

టుట యవసరమని కనిపెట్టి, అందుకై తీవ్రయత్నము చేసెను. అందు దేశీయనౌకల జేర్చుటకును ఆయన తలపెట్టెను.

పూర్వము మనదేశపు వివిధవస్తువులు అప్పటి నాగరిక దేశములన్నిటికిని హిమాలయపు కనుమలగుండ మెట్టదారిని, సముద్రముపై నోడలమీదనుగూడ, ఎగుమతి యగుచుండెను. కొందరు భారతీయు లప్పుడావిదేశములకు జని, అందు విజ్ఞానమును వ్యాపారమును వ్యాపింపజేసిరి. ఈరాకపోకలు,ఎగుమతి, చాలవరకు మనదేశపు నౌకలపైననే జరుగుచుండెను. మనతీరములందు తామ్రలిప్తి, కురంగపురము (కోరంగి) భారుకచ్ఛము (బ్రోచి) మున్నగు పురములరేవులయొద్ద గొప్పనౌకలు నిర్మితము లగుచుండెను. ఇప్పటికి సుమారు నూరేండ్లక్రిందటి వరకును మన దేశపుఓడలు దేశాంతరములకు కోస్తావ్యాపారము జరిగించుచునే ఉండెను. నూరేండ్లక్రింద బొంబాయిరేవు లోకట్టిన కొన్నియోడలు యూరపుకు గొంపోబడి, అచటి సముద్రములందు బ్రిటిషు యుద్ధనౌకలకన్నను వన్నెగా పని చేసెను. కాని తరువాత పరిస్థితులు మారెను. మననౌకలకు ప్రభుత్వాదరణ పోయెను. పాశ్చాత్యదేశముల ప్రభుత్వములు అచట మంచినౌకల నిర్మించుటకు విశేషప్రోత్సాహ మొసగిరి. ఆదేశముల వ్యాపారము వృద్ధియయ్యెను. అచటి విజ్ఞానమును వృద్ధియై, అందుమూలమున పాశ్చాత్యులు క్రమముగ ఇనుముతోను ఆవిరియంత్రములతోను మహానౌకల నిర్మింపగలిగిరి.

మనదేశమున విజ్ఞానవ్యాప్తి లేక, ఆసౌకర్యము లేకుండెను. ఆధునికనౌకల నిర్మాణమునకు కోట్లకొలది రూపాయలపెట్టుబడి కావలెను; మన వ్యాపారుల కట్టి పెట్టుబడియు లేదు. క్రమముగ విదేశనౌకల పోటీ ధాటికి నిలువలేక, మనకోస్తా నౌకలు రంగ స్థలమునుండితొలగి మూలబడెను; ఇట్లీదేశపు నౌకానిర్మాణము క్షీణించిపోయెను.

మిల్లుసరుకులు మున్నగువానిని ఆయాదేశములం దమ్ము బోవుటలో విదేశీయులకును భారతీయులకును పోటీ హెచ్చు చున్నది. పాశ్చాత్యులును మనవారును తమతమ సరుకులను చీనాజపానులం దమ్ముట కెగుమతిచేయుచుండిరి; అచట తమ తమ సరుకులను చౌకగ విక్రయింప యత్నించిరి; ఇట్లాదేశ ములందు కొంత పోటీ కలిగినది. ఇట్లుండ, మనతో పోటీపడు పాశ్చాత్యుల వశమందలి విదేశీయనౌకలే మనదేశపు సరు కుల నెగుమతి కాధారమగుటవలన బాధలు కలుగ నారంభిం చెను; స్వదేశవ్యాపారము సముద్రముపైన మనచుట్టుపట్ల దేశ ములతో ప్రాచ్యనౌకలపైననే జరుపవలెనని తాతా గ్రహిం చెను. ఆరంభమున నౌకావ్యాపారములో కొంతనష్టము కలు గునని జంషెడ్జి యెరుగును, కాని ఆత్యాగమున కాయనసిద్ధ పడెను. ఆయన అద్దెషరతుపైన యూరపునుండి రెండు పెద్దనౌ కల సంపాదించెను. అప్పుడు జపానీయులు తమప్రభుత్వపు సాహాయ్యమున మంచి నౌకల నిర్మించి నడుపుచుండిరి. ఈవ్యా

పారము విశేషద్రవ్యసాధ్యము. మనకు ప్రభుత్వసహాయమును లేదయ్యెను. అందుచే వ్యాపారజయముకై తాతా అప్పటి జపాను నౌకాసంఘముతో కలసి నౌకల నడుపదలచెను. అట్లుగానిచో ప్రబలప్రత్యర్థులగు యూరపియను నౌకాసంఘముతో పోటీచేయుట అసంభవము. ఈవ్యాపారము జయప్రదమగుటకు, బొంబాయి వ్యాపారులు తమ మిల్లు సరుకులను ఆనౌకలపైననే న్యాయమైన కేవుకు పంపుటయు, యూరపియనులు పోటీ పడగొట్టుటకై కేవుల తగ్గించి ఆకర్షించినను, వీరు చలించకుండుటయు, ముఖ్యావసరము. అట్టియొడలపైననే రెండేండ్ల వరకు తమ సరుకుల బంపుటకు బొంబాయివ్యాపారులు తాతా కొడంబడిక నిచ్చిరి. ఆప్రకారము తాతాయు జపాను నౌకాసంఘముకు ఖరారుచేసెను. బొంబాయినుండి నూలును బట్టలు మున్నగు సరుకులను ఈనౌకలు చీనాజపానులకు గొనిపోయి, అచటనుండి మరలి వచ్చునప్పుడు అగ్గిపెట్టెలను, అద్దములు, నేలబొగ్గు మున్నగువానిని, తెచ్చును; అందుచే, ఉభయులవ్యాపారమును వృద్ధియగును. యూరపియనులు ముందుగానే విఘ్నము కల్గింపకుండుటకై, ఈయేర్పాటులన్నియు జాగ్రత్తతో గూఢముగ జేయబడెను.

ఇట్లంతయు పూర్తియై, 1893 లో, ఆనౌకలు బొంబాయి రేవునుండి నూలును, బట్టలనుగొనిపోదొడగెను. కేవు నెంతహెచ్చించినను బొంబాయినుండి సరుకుల గొనిపోవుటకు తామే

దిక్కని తలచుచుండిన యూరపియనుకంపెనీలవారీదృశ్యమును చూచి, మొదట దిగ్భ్రమజెందిరి. తాతాపన్నిన ప్రతియుక్తి వారి కప్పుడు తెలియవచ్చెను. ఆకంపెనీలవా రంతట నసూయావిష్టులై, ఈ 'తాతాజపాను' నౌకల నెట్లైనపడగొట్టుటకు నిశ్చయించుకొనిరి. ఈ 'తాతాజపాను' నౌకాసంఘమువారు, చాలసరసమై న్యాయమగు రేటునకే సరుకుల గొంపోవుచుండిరి. అప్పటికి యూరపియనునౌకల కేవు రేటు చాలహెచ్చు. కాని 'తాతాజపాను' కంపెనీకెట్లైన నష్టముకల్గించి యామోడలసాగకుండ చేయుటకై, యూరపియనులు వెంటనే తమహెచ్చు రేటులవదలుకొనుటయేగాక, 'తాతాజపాను' వారిరేటుకన్న నింకను తమరేటులదగ్గించిరి. ఐనను, ఆరంభమున బొంబాయివ్యాపారులు తమసరుకులను చాలవరకు 'తాతాజపాను' నౌకలపైనే పంపుచుండిరి. అంతట యూరపియనునౌకలవా రొకతంత్రము పన్నిరి. తమరేవులనింకను బొత్తిగతగ్గించి నామమాత్రముగజేసియు, దానినిగూడ వదలుకొనియు, ఉచితముగనే బొంబాయి నుండి చీనాజపానులకు తమనౌకలపైన సరుకులగొనిపోదొడగిరి. కాని అట్లు సరుకులబంపువారు, (తమకుపోటియగు) 'తాతాజపాను' నౌకలపైనమాత్రము మరిమెట్టిసరకులను గూడ పంపకూడదని యాయూరపియనులు విషమనియమమేర్పర్చిరి. ఈపరతులఉద్దేశము పోటీదారుల బడగొట్టుటయే యనిస్పష్టముగ కనబడుచున్నను, బొంబాయివ్యాపారులుక్రమముగా నా

మాయలోబడిరి. ఆయూరపియను నౌకాసంఘములవారేటేట నుకోట్లకొలది రూప్యముల నార్జించి యార్జించి, చాలయైశ్వర్యముతో దులతూగుచుండిరి; వ్యాపారమున అనేక సౌకర్యములు గలిగియుండిరి. యూరపునుండి అన్నిప్రాంతములకు గొప్పవ్యాపారముచేయు నీమహాసంఘములకు, ఈబొంబాయి చీనాప్రాంతములందుమాత్రము రెండుమూడేండ్లు నష్టమువచ్చినను, అదివారికొకలెక్కకాదు. వారికిపోటీగనున్న 'తాతాజపాను' సంఘము బాల్యస్థితిలో నున్నది; దానికంతగా మూలధనమును, తమకున్నవిశేషసదుపాయములును, లేవు. ఆ'తాతాజపాను' సంఘముకు సరుకులయెగుమతియే లేకుండజేసిన, అది దివాలాతీయక తప్పదు; అంతట యూరపియనునౌకలు మరలకేవులనిచ్చవచ్చినట్లు హెచ్చింపవచ్చును. ఈమర్మమును తొలుతాముందుగనే తోటి బొంబాయివర్తకులతో తెల్పెను, కాని కొన్నినెలలు బొంబాయివర్తకులు తమవాగ్దానము నిలుపుకొన్నను, ఉచితముగసరుకులబంపుకొని లాభమొందుదుమను పేరాసచే,వారిలోకొందరు తాము తాతాకిచ్చిన మాటకు భిన్నముగ పాశ్చాత్యనౌకలందే సరుకులనెగుమతి చేయదొడగిరి; వారినిజూచి, మరికొందరును అట్లే చేసిరి. ఇట్లు యూరపియనుకంపెనీల తంత్రము సాగినది; సరుకులన్నియు వారియోడలందే చేరెను; 'తాతాజపాను' ఓడలకు సరుకులు లేవయ్యెను. ఇట్లు తోటివర్తకుల వ్రతభంగముచే, తాతాకుద్రోహముజరిగెను; వ్యాపారముస్తంభించెను; నెలనెలకు

వేలకొలది రూపాయలువెచ్చించి శ్రమకోర్చి నాకలనడుపుచున్నను, ఎగుమతి లేనందున, తాతాయు జపానునాకలును చేయునదిలేక, తుదకాసాకావ్యాపారము నిల్చిపోయెను. జపాను నాకలు తమదేశమునకు తిరిగిపోయెను. ఇట్లాయొడంబడిక చెడినంతున, తాతాయు తాదెచ్చిననాకలనుయూరపునకంపివేసెను. జపానీయుల కంఠుచే చిరాకును నష్టమునుకల్గెను. కాని ఈరీతిని భారతదేశముతో వర్తకానుభవముగల్గించి, యథాశక్తిగ వ్యాపారనీతి నమలుజరిపినందుకు, తాతాగారిని జపానీయులు మెచ్చుకొనిరి. తాతాయు తనస్వాముునష్టముకు అంతగా విచారించలేదు; కాని తోటివ్యాపారు లిట్లు దూరదృష్టిలేక, తత్కాలలాభమునే చూచుకొని, ఏకీభావమువదలి, మాటతప్పి, దేశహితముకు వ్యతిరేకముగ నడచిరనిమాత్ర మాయన చింతిల్లెను. తాతా యూహించినట్లే, 'తాతా జపాను' నాకలుపోయిన కొద్దినెలలకే, యూరపియనుకంపెనీలవారు తమ మోడలపైన కేవులను పూర్తిగా విధించిరి; మరియు బొంబాయివర్తకుల అసహాయతను గమనించి,వారిసరుకులపై కేవురేటునింకను హెచ్చించి, యూరపియనుకంపెనీలు తమ వెనుకటి స్వల్పనష్టమును గూడ వారివల్లనే రాబట్టిరి. తాతాసలహాను పెడచెవిని బెట్టినందుకు తగుఫలితముకల్గెనని బొంబాయివర్తకులకప్పుడు పశ్చాత్తాపము కల్గెను. వారిచ్చిన లిఖితనియమముకు భిన్నముగనడచినందులకా తోటివర్తకులపైన నష్టపరిహారము పొందదగియున్నను, ఉదారు

డగు టాటా యట్టి ప్రయత్నము చేయలేను. సంఘీభావము బలము. మనవర్తకులేకీభవించినచో, దేశీయవర్తకము సురక్షితమై జయప్రదమగునని, లేనిచో చెడునని, టాటాగారి యీ యుద్యమముచే స్పష్టమయ్యెను.

తరువాత 1908 ప్రాంతమున దక్షిణమున 'తూత్తుకుడి'కి సింహళముకు మధ్య చిదంబరంపిళ్ళైగారి యొక్క దేశీయ నౌకాసంఘమును బెట్టి, ఓడలనడిపిరి. అచ్చటను, అట్లే బ్రిటిషు నౌకాసంఘమువారు పోటీ పడగొట్టుటకై తమ కేవ్రులను విపరీతము తగ్గించగా, ఆకంపెనీయు తాళలేక నశించెను.

ఇప్పుడు మన భారతీయవర్తకులలో కొంత జ్ఞానమును, దేశమున జాతీయభావమును, వ్యాపించియున్నవి. అందుచే టాటాకుటుంబీయులును, వారి మిత్రులగు కొందరు పెద్దవర్తకులును కలసి బొంబాయిలో 'సిందియా స్టీంనావిగేషన్ కంపెనీ' అనుపేర నొక పెద్ద నౌకాసంఘము నిటీవల స్థాపించి, కొన్ని యోడ్లనుండి నడుపుచున్నారు. కొందరు సంస్థానాధీశులును, ఇతర శ్రీమంతులును, దీనిలో వాటాలదీసికొని సహాయము చేసిరి. తగినంత ప్రభుత్వప్రోత్సాహము లేకున్నను, ఇప్పుడీ నౌకాసంఘము వృద్ధిలోనే యున్నది. ఈసంఘమువారు గొప్ప పొగయోడల గొనిరి, కొన్నింటిని కట్టించిరి. జలదుర్గ, జలదూత, జలవిహార, మున్నగు పేర్లుగల యీనౌక లిప్పుడు మనదేశపుతీరములందంతటను చీనా జపానుప్రాంతములకును

తిరుగుచు, విదేశికంపెనీలతో పోటీకి నిలిచి, వ్యాపారము సల్పు చున్నవి. ఇటీవల వంగదేశమున, ఇంకొక జాతీయనౌకాసంఘ మేర్పడి, ఆప్రాంతమున నౌకావ్యాపారము చేయుచున్నది.

ఇట్లు తాతాయత్నముకు సద్యఃఫలము లేకపోయి నను, ఆయనుభవము లీకంపెనీల కుపకరించి, కొలదికాలముకే దేశీయనౌకాసంఘము లేర్పడి పనిచేయుచున్నవి.

---

## 8. కార్మికసమస్య.

"స్వదేశీమిల్లు" స్థాపితమైనకాలమున, ఆప్రాంతమున ఒక కార్మికసమస్య కల్గెను; 1887 నాటికి బొంబాయి పరిసరమున సుమా రేబదిమిల్లు లేర్పడెను. ఇందొక్కొక్కమిల్లులో సుమారు వేయిమంది కూలీలు పనిచేయుచుందురు. ఆ ప్రదేశము పడమటికనుమలప్రాంతము; కొండనేల; అచటి జనసంఖ్య తక్కువ. కొన్నియేండ్లవరకు బొంబాయి ప్రాంతీయులే కూలికి చాలిరి; కాని మిల్లులు వృద్ధియైనకొలదిని జనులు చాలలేదు; కూలీల గిరాకి హెచ్చెను. హెచ్చుకూలి నిచ్చినను పనివాండ్రు లేకుండిరి. గుజరాతులోని యహమ్మదాబాదులోను కొన్నిమిల్లు లేర్పడెను. అచటిజను లాప్రాంతమందే సరుకుకొనిరి; కాని కూలికి బొంబాయివరకు రాకుండిరి. స్వస్థలమందే యుండుట మన దేశపు జనసామాన్యమున కలవాటైపోయినది. హెచ్చుజీతము కైనను, ఎరుగని దూరస్థలములకు వెళ్లుటకు మనవా రంతగా సిద్ధపడరు. కాని మిల్లువ్యాపారమునకు కూలిజనులు సమృద్ధిగ కావలెను; కార్మికులు చాలనిచో పని సరిగా జరుగదు; అట్టిచో కూలీలు సరిగా పనిచేయకున్నను, వారు సమ్మె కట్టుదుమని బెదిరించినను, వేళకురాకున్నను, యజమానులే వారికి లొంగియుండవలెను; పనిసరిగ జరుగదు. కనుక, ఇతరప్రాంతములనుండి బొంబాయికి పనివారల రప్పించుట యవసరమని జంషెడ్జి తాతా గ్రహించెను.

గంగా యమునా పునీతమగు యుక్తప్రాంతమున జనసమ్మర్ద మధికము. అచటికూలి రోజుకొకయణా యుండెను; చాలమందికి వృత్తియు లేదు. తరుచు అచట కఱవుండెను. టాటా తన దృష్టినటు మరల్చెను. వృత్తిలేక యల్లాడు యుక్తప్రాంతీయులలో గొందరినిబొంబాయిప్రాంతమునకు జేర్చినచో, వారికీమిల్లులందు రోజు కారణాలు కూలి లభించును; మిల్లుపనికి వలయునంత మంది కూలీలు నేర్పడుదురు. కాని వారు నిరాధారులైనను స్వగ్రామముల వదలి భిన్నభాషికము దూరస్థము నగు బొంబాయికి తమంతట రా నిచ్చయింపరైరి. కొత్తస్థలమున పరిస్థితు లెట్లుండునో, వృత్తి సరిగా జరుగునో లేదో యని యాయజ్ఞానులు భీతులైరి. వారి పిరికితనము పోగొట్టి ధైర్యోత్సాహములు కల్గింపవలసి యుండెను. ఇటిస్థితిలో ప్రభుత్వమువారును పరిశ్రమల యజమానులును ముందుగా కొందరిని రప్పించి, వారికి తగు వసతిని మంచి జీతమును ఇప్పించెదమని ప్రోత్సహించినచో, ఆవిశ్వాసమున వారు వలసకు వత్తురు. అట్టి ప్రోత్సాహముచే, చాలప్రాంతముల జనులు విదేశములకును పోవుచున్నారు. ముందుగా వెళ్ళిన కొందరు ద్రవ్యము సంపాదించి, అచ్చటస్థితి సుఖకరముగను లాభదాయిగను ఉన్నదని తిరిగివచ్చినప్పుడు తమ గ్రామములవారికి తెల్పినమీదట, ఆగ్రామములజను లీసారి తమంతటనే బయలుదేరి వెళ్ళుదురు. ఇట్లు కలకత్తా జనపనారమిల్లులకు, అస్సాంటీతోటలకు, బర్మా, ఫిజి, నేటాలు మున్నగు విదేశప్రాంతములకు గూడ, మనజనులు

వలసకేగియున్నారు. ఆరంభదశలోమాత్రము ప్రోత్సాహముకై ప్రభుత్వ సహాయమును, కలసి తగువసతుల నేర్పచ్చుటకై మిల్లు యజమాని సంఘపు సహాయమును, అవసరమని మిల్లు దార్ల సంఘమునకును ప్రభుత్వమునకును తాతాగారు తెల్పి, వారి సహాయము కోరెరి. తాతా సలహాప్రకారము వారు జరిగించి యుండినచో, అప్పుడు వేలకొలది 'యుక్తప్రాంతీయులు బొంబాయి ప్రాంతమున పనివాండ్రుగా వలసవచ్చియుందురు. అందుచే యుక్తప్రాంతమున కొంచము జనసమ్మర్దము తగ్గి, ఆప్రాంతములకును బొంబాయి మిల్లులకును గూడ లాభముకల్గి యుండును. తాతా తనదీర్ఘ లేఖలో నాసమస్య నంతను విపులముగ చర్చించి, అట్లువలసవచ్చుటచే గల్గుఫలితములను విశదపర్చెను; కాని తాతాగారి దూరదృష్టి తక్కిన మిల్లుదార్లకు కలుగలేదు. ప్రభుత్వసహాయము కోరుడని, వసతికై తగుకట్టుబాట్లుచేయుడని, తాతాసూచించినను,మిల్లుయజమాని సంఘము వ్వారు శ్రద్ధవహింపలేదు. కార్మికసమస్య కాలక్రమమున తనంతటనే పరిష్కారమగుచుండునని, అందుకు ప్రత్యేకప్రయత్నమక్కరలేదనియు, వారు తాతాగారి లేఖకు జవాబునిచ్చిరి. ఇట్లాసంఘము అశ్రద్ధతోనుండుటచే, ప్రభుత్వముచుపేక్షించెను; ఒక్క తాతాగారి కోరికపైననే అట్టి యుద్యమమును పూనుట ప్రభుత్వము కిష్టముకాలేదు.

తరువాత కొలదికాలముకే తాతా చెప్పినదంతయు మిల్లుదార్లందరకనుభవమునకు వచ్చెను; మిల్లులు వృద్ధియై, బొంబాయి ప్రాంతమున కార్మికుల గిరాకి చాలహెచ్చెను. కూలీలు చాలక, మిల్లుపనిలో చాల చిక్కులు కల్గెను. ఆ మిల్లుదార్లప్పుడు తాతా దూరదృష్టికి విస్మితులైరి; ఆయవకాశమును గోల్పోయినందుకు, తాతా సలహా విననందుకును, వారు తరువాత విచారించిరి.

# 9. బట్టలపన్ను.

దూది నూలుబట్టల వ్యాపారసందర్భమున, అప్పుడింకొక సమస్యకూడ గల్గెను; అందును దేశీయపరిశ్రమల క్షేమముకై తాతా తీవ్రకృషి సలిపెను.

1892 ప్రాంతముకు మనప్రభుత్వపు సేనాదులు వృద్ధి చేయబడెను; అందుకు సాలీనావ్యయము అధికమగుచుండెను. అంతవరకున్న పన్నులయాదాయము ప్రభుత్వముకు చాలలేదు. అప్పుడు, హార్షల్ప్రభువు అధ్యక్షతను, మనప్రభుత్వమొక కమిటీనేర్పర్చిరి. వారు పరిస్థితుల విమర్శించి, ప్రభుత్వాదాయపు వృద్ధికై, మనదేశముకు దిగుమతియగు సరుకులన్నిటిపైన సుంకముల విధింపవలెనని తమరిపోర్టులో దెల్పిరి. ఆప్రకారము దిగుమతుల కిమ్మతుపై నూటికైదుచొప్పున (1894 లో) భారత ప్రభుత్వమువారు సుంకము విధించిరి.

అప్పటికి మనకు దిగుమతియగు సరుకులన్నిటిలో ముఖ్యమైనవి బ్రిటిషువారి మిల్లుల నూలు, బట్టలు; వానికిని ఈదిగుమతిపన్ను తగిలినది. ఈసరుకులను మనదేశముకంపి బ్రిటిషువారందుపైన సాలీనా కోట్లకొలది రూపాయల లాభమొందుచున్నారు. ఈదిగుమతిపన్నువలన యాసీమసరుకుల ధర యిచ్చటకొంచముగ హెచ్చునని, అందుచే నీదేశపు మిల్లుబట్టలకు ధరలో సదుపాయము కలుగునని, అందువలన తమసరుకుల యమ్మకము తగ్గవచ్చునని, అట్లగుచో తమ కంతవరకు వచ్చు

చున్న విశేషలాభము తగ్గునేమో యని, బ్రిటిషు వ్యాపారులు భీతిల్లిరి. మన ప్రభుత్వము బ్రిటిషునూలుపైన బట్టలపైన పన్ను విధింపకూడదని, వారు ఇంగ్లండులో పెద్ద ఆందోళన నారంభించిరి. లంకషైరులోని బ్రిటిషు మిల్లువ్యాపారము అచట లక్షల కొలది జనులకు లాభకరముగ ఉన్నది; మరియు, అది యచటి యితరపరిశ్రమలకును చాలసహకారి. ఆపారిశ్రామికులును వారి చెప్పుచేతలలో నుండు పార్లమెంటు సభ్యులును ఇంగ్లండులో ప్రభుత్వమును ఒత్తిడిచేసిరి. వారంతటమనదేశపు ప్రభుత్వమును ఈదిగుమతి సుంకమును తొలగింప నిర్బంధించిరి. (ఇప్పటి రాజ్యాంగవిధానమునుబట్టి మన భారతప్రభుత్వము లండనులో నున్న భారతమంత్రి కెప్పుడును లోబడియుండును.ఆమంత్రి బ్రిటిషుమంత్రివర్గములోనివాడు; ఆయన బ్రిటిషుపార్లమెంటు వారి యిష్టప్రకారమే నడుచుకొనవలెను. లేనిచో వారతనిని, మనదేశములో గవర్నరుజనరలు మున్నగు పెద్దఉద్యోగులను గూడ, మార్పించగల్గుదురు; వారిజీతములగూడ తగ్గింపగల్గుదురు. మనప్రభుత్వము మనప్రజల కెంతమాత్రము బాధ్యులు కారు; వారింగ్లండులోని బ్రిటిషుపార్లమెంటుకే జబాబుదారులు.) బ్రిటిషుప్రభుత్వమువారు చేసిన యీయొత్తిడివలన మన ప్రభుత్వమువారు తామిదివరలో హర్షల్‌కమిటీ సలహాప్రకారము విధించిన దిగుమతిపన్నులను బ్రిటనునుండి వచ్చు నూలుపైనను బట్టలపైనను రద్దుచేయవలసి వచ్చెను. కాని ఆసరుకులే

మనదేశపు దిగుమతులన్నిటిలో సగముకన్న హెచ్చుకిమ్మతు వగుటచే, వాని మీదహాయిపుదల తిరుగ మన ప్రభుత్వపు ఆదాయము చాల తగ్గి, ఆర్థికబాధ కలెను. ఈసంగతినంతను మనవిచేసి నూటికి $3\frac{1}{2}$ వంతున తగ్గింపురేటుగనైనను వానిపై గూడ పన్ను విధింపనిండని, మన ప్రభుత్వమువారు తమ కధికారులైన బ్రిటిషు ప్రభుత్వమును కోరిరి. అంత రేటు పన్నును భారతదేశపుమిల్లులలో తయారగు నూలుపైన బట్టలపైనగూడ విధింపవలెనని, అట్లైననే దిగుమతియగు సీమనూలు బట్టలపైనను పన్నువిధింపవచ్చునని, బ్రిటిషుప్రభుత్వమువారు తెల్పిరి. అంతట బ్రిటిషునూలుపై విధించు రేటున 3½% చొప్పున, మన మిల్లులలో తయారగు నె 20 రుకు పైబడినసూలు అంతటిపైన (బట్టలపైనను) వెంటనే మన ప్రభుత్వమువారు పన్ను విధించి, వసూలుచేసిరి. బ్రిటిషు మిల్లునూలు 60 వ నెంబరుకు పైబడి చాల సన్నగనుండును. దానికి మన ముదుకు నూలుతో పోటీ యుండదు. అందుచే కేవలము ముదుకయగు నె 20 రు లోపునూలుకు మాత్ర మాపన్ను అక్కరలేకుండ బ్రిటిషుప్రభుత్వము సమ్మతించెను.

ఈదేశపు సరుకులపై నీపన్నువేయుటచే నప్పుడాందోళనకలిగెను. అమ్మకమై సీమనుండి దిగుమతియగు సరుకుపై పన్ను విధించినందుకుగాను, మనమిల్లుసరుకుల కమ్మకము లేకున్నను మిల్లులో నుత్పత్తికాగనే మన సరుకులకును పన్ను తగు

లును; బ్రిటనులోవలె గాక, ఈదేశపు మిల్లువ్యాపార మింకను బాల్యదశలో నుండెను. దానికి చాల కష్టములుగలవు. ఈపన్ను అన్యాయమని విశదముచేయుటకు మిల్లుయజమానిసంఘము తరపున జంషెడ్జితాతా ఎన్ వాడియాగార్లు ప్రతినిధులుగ వెళ్ళిరి. వారాసందర్భములను భారతప్రభుత్వపు ఉద్యోగులకు చక్కగ నివేదించిరి. కాని ఆ ప్రభుత్వమువారందలినిజమును గ్రహించినను, తాము బ్రిటిషు ప్రభుత్వము కధీనులగుటచే నేమియు చేయలేమని తెల్పిరి. భారతప్రభుత్వముచా రీదేశపు ప్రతినిధుల యొక్కయు, ఇచటి శాసనసభలయొక్కయు, తీర్మానము నంగీకరించు బాధ్యతలేదు. కాని బ్రిటిషుప్రభుత్వపు ఆజ్ఞల నిరాకరించుటకు వారికధికారము లేదు.

ఈపరాధీనస్థితి తెలిసి, తాతా ఆంగ్లదేశము పోయి, అచట భారతమంత్రితో నీవిషయమును తీవ్రముగ చర్చించెను. అచట మిల్లునూలుపైన బట్టలపైన పన్నులేదు; పైగా, ఇదివరలో ఆమిల్లులకు బ్రిటిషుప్రభుత్వము చాలరీతుల సాయము చేసియుండెను. అచటి కార్మికులు, నాయకులు గూడ, అప్పటికా వ్యాపారమం దారితేరి గొప్ప నిపుణులైరి. వారు శ్రీమంతులు, అందరును విద్యావంతులు; అవసరమగు విజ్ఞానమును నేర్పు పాఠశాలలు, యంత్రశాలలు, అచ్చట చాలగలవు. ఆదేశము ఉష్ణముకాదు; అచటిజనులు చాల దృఢగాత్రులు, ఓర్పుతో నెక్కువపని చేయగలరు. ఆంగ్లదేశము క్రమముగ అన్నియంత్ర

పరిశ్రమలకు ద్రవ్యముకు వ్యాపారసౌఖ్యములకును ఆలవాలమైనది. అచటిమిల్లులకుదగ్గరనే చౌకయగునేల బొగ్గును కలదు. భారతదేశపు మిల్లుపరిశ్రమకో ప్రభుత్వసహాయ మెన్నడును లేదు. కార్మికులకు తగు జ్ఞానము, ప్రజ్ఞ, శక్తి, ఓర్పు, లేవు; యంత్రములను విదేశములనుండి హెచ్చుధరకు రప్పింపవలెను; వ్యాపారులకు పెద్దపరిశ్రమలకై తగినంత మూలధనము లేదు.* బొంబాయిమున్నగు మిల్లుస్థలముల సమీపమున నేల బొగ్గుగనులు లేవు. మరియు సాధారణముగ, ఇచటిమిల్లు యంత్రములు ముదుకనూలునే తీయగలవు. ఈస్థితిలో, ఈమిల్లులకు బ్రిటిషు మిల్లులకు నిజమగు పోటీయుండదు. ముదుకబట్టలజేయు చీనా జపానుల మిల్లులతో మాత్రము భారతదేశపు మిల్లులకు పోటీయుండును. జపాను ప్రభుత్వము తమదేశపుమిల్లులకు చాల సాయముచేయును ; ఆమిల్లుల కనేక సదుపాయములునుకలవు. కనుక భారతదేశపు నూలుపై వేసిన పన్ను ఈదేశీయులకు నష్టకరము ; జపానీయులకు లాభకరము నగును.† బ్రిటిషుపరి

* పాశ్చాత్యదేశములందు గొప్ప భూస్వాములు ఉద్యోగులు తమ నిలవసొమ్మును యంత్రపరిశ్రమల పెట్టుబడికి వినియోగింతురు. మనజమీందారులు సంస్థానాధిపులు, గొప్ప ఉద్యోగులు, సాధారణముగా అట్లు చేయక, తరుచు వ్యర్థముగనే ఖర్చుచేయుదురు.

† ఈపన్ను భరించి మన మిల్లుబట్టలు చీనా కెగుమతియై, అచట హెచ్చుధర కమ్మవలసివచ్చెను. జపానుసరుకులు ప్రత్యేకనౌకలపైన ప్రభుత్వ సహాయమున పోటీగ తక్కువ కిమ్మతు కమ్ముచుండెను. అందువలనను, మన దేశజనులకును గూడ, ఈపన్నుచే నష్టమే కలిగెను. క్రమముగ జపానుబట్టలు వ్యాపించెను.

శ్రమల రక్షణ కాపన్ను అవసరముకాదు. ఇట్టీసంగతులన్నిటిని లండనులో భారతమంత్రియగు హామిల్టను ప్రభువుకు తాతా సవిమర్శముగ వివరించెను.

అంతయువిని హామిల్టనుప్రభువు భారతదేశపు మిల్లులకు హెచ్చులాభము వచ్చుచున్నదని, అందుచే నీపన్నువలన బొంబాయిమిల్లులకు బాధయుండదని, జబాబుచెప్పిరి. సగుటున నూటికారుకన్న హెచ్చులాభము లేదని, చాలమిల్లుల కంతవరకు గూడ లాభములేక నష్టముకూడ పొందుచున్నవని, తాతా జబాబునిచ్చెను; ఆసంగతికి నిదర్శనము కావలెనని భారతమంత్రి కోరగా, తాతాగా రట్లేయని మనదేశమునకు వెంటనే తిరిగివచ్చి, 1897 లో మనదేశపు మిల్లులన్నిటి జమాఖర్చులను సరిగా తేల్పించి, వానినుండి నిరాక్షేపణగ లెక్కల తయారుచేసెను; వానిని తానే యచ్చువేయించి, ఆంగ్లమంత్రులకును ఇతరప్రముఖులకును పంపెను. మన మిల్లులలో చాలవానికి లాభమతి స్వల్పమని, కొన్ని కేవల దుర్దశలోనున్నవని, ఆలెక్కలచే స్పష్టమయ్యెను; కాని యెట్లైన నాపన్ను రద్దుచేయుట కాంగ్లపారిశ్రామికులు, అచటి ప్రభుత్వమును, ఒప్పుకొనలేదు. అప్పుడు పోటీ లేకున్నను, ముందైనను భారతదేశపు మిల్లులు బాగుగ వృద్ధియైనంతట, తమమిల్లు సరుకుల దిగుమతి తగ్గునేమో యని వారిభయము. ఇట్లు మనప్రతినిధిగ తాతా చేసిన వాద మరణ్య

రోదనమయ్యెను; కాని యీ యార్థికసమస్యచర్చ జనులలో చాల ఆందోళనను విమర్శను కల్గించినది *

---

* ఈపన్ను వేయుట చీనాలో జపాను మిల్లుబట్టల వృద్ధికి సహకారియాయెను. జపాను బట్టలు చీనాలో మనమిల్లుబట్టలతో పోటీ సల్పుటయే గాక, క్రమముగా మనదేశమునకు ఆఫ్రికాయున్నగు ప్రాంతములకు కూడ వ్యాపించి, బ్రిటిషు మిల్లు సరుకులతో తీవ్రముగ పోటీచేయుచున్నవి. ఇట్లు బ్రిటిషుప్రభుత్వము నిర్బంధముగ ఈదేశపు మిల్లులపై విధింపజేసిన పన్ను, ఇచటి మిల్లులకే గాక, తుదకు బ్రిటిషువారి వ్యాపారమునకును ఒకవిధముగ హానికల్గించెను. ఇంతలో యూరపుమహాయుద్ధముచే, మన ప్రభుత్వపు ఆర్థికస్థితి మరలచెడెను. మరియు, ఆయుద్ధసమయమున మనప్రభుత్వము వారు బ్రిటిషు ప్రభుత్వమునకు 150 కోట్ల రూప్యముల నుచితముగ నిచ్చుట కొప్పుకొనిరి; అప్పటి యుద్ధమున మనసేనలఖర్చును మనఖజానానుండియే భరించిరి. ఇట్లు ఖర్చు హెచ్చి ఆదాయము తగ్గగానే, కొత్తపన్నుల వేయవలసివచ్చెను. అంతట బ్రిటిషుప్రభుత్వపు అంగీకారముతో, ఈదిగుమతి పన్నును 1917 లో కొంచెముగ హెచ్చించిరి. తరువాత నీపన్ను బ్రిటిషుసరుకులపై కొంత హెచ్చు రేటుగను, జపాను మున్నగు ఇతరవిదేశములపైన ఇంకను హెచ్చుగను, ఉండుటకు నిర్ణయమయ్యెను.

# 10. పట్టుపరిశ్రమ.

చాల శతాబ్దులనుండి మనదేశమున పట్టుబట్టల వాడుక కలదు. అవి ప్రియమై మన్నికగల్గి, అందముగనుండును. వీనిని శ్రీమంతులు ధరింతురు; సామాన్యజనులు పరిశుద్ధమని మడికి ఉపయోగింతురు. పట్టునేత మనదేశమున చిరకాలమునుండి చాలమందికి వృత్తిగనున్నది. ఈపరిశ్రమకును గతశతాబ్దిలో విదేశపుసరుకుల దాడిచే హానికల్గినది.

పట్టుపురుగులనబడు ఒకజాతి పురుగులు గూడు నేర్పర్చుకొని, అందు వసించుచు, ఆగూడులోనే తమదేహమునుండి పట్టును నిర్మించుకొనును. అది దూదికన్నను మృదువై, మనోహరముగనుండును. ఈపురుగులుమల్బరీచెట్ల యాకులదినిజీవించును. ఆచెట్లువృద్ధియగు తావులందే యీపట్టుపరిశ్రమ కవకాశముండును. కొన్నిపట్టుపురుగులు ఆముదపు ఆకులగూడ దిని, వసింపగలవు. పట్టుబట్టలకు దుకూలము చీనాంబరము అనియు వాడుక కలదు. చీనాలో, ఈపరిశ్రమ చిరకాలముగ వ్యాపించియున్నది. అందుండి కొన్నిశతాబ్దముల క్రింద కొన్నిపట్టుపురుగులను మల్బరీని కొందరు రహస్యముగ ఇటలీ ఫ్రాన్సులకు గొనిపోయి పెంచిరి. క్రమముగా నచట పట్టుపురుగులు వృద్ధియై, కొంతకాలముకు ఆధునికయంత్రసహాయమున చాల నాజూకగు పట్టు తయారుకాజొచ్చెను. అదిచౌక; మన కోరా

పట్టుకు బదులు ఆవిదేశపు పట్టునే మనదేశము వారు కొనుటచే, మనపరిశ్రమ క్షీణింపదొడగెను.

జంషెడ్జి ఇంగ్లండునకు వెళ్ళినప్పుడు, ఫ్రాంసు ఇటలీలందాగి, అచ్చటి పట్టుపరిశ్రమ పద్ధతులను జాగ్రత్తతో గమనించెను. అవి మనదేశమున గృహపరిశ్రమగ నుండుటకు వీలుకలదని కనిపెట్టి, ఆయన మచ్చునకు కొన్ని ప్రశస్తమగు కొత్తరకపు పట్టుపురుగులను మల్బర్రీ విత్తనములను ఆపరిశ్రమకుపయోగించు కొన్ని పనిముట్లను మనదేశమునకు తెచ్చెను. ఇచట మైసూరులో బెంగుళూరు ప్రాంతపు పీఠభూమి సమశీతోష్ణమై, ఈపురుగులును మల్బర్రీ చెట్లును, వృద్ధియగుటకు ఎంతయు తగియున్నది. టిప్పుసుల్తానుకాలమున గూడ, ఆప్రాంతమున మల్బర్రీ తోటలు పెంచబడెను. అందుచే టాటా యాప్రాంతమున కొంతవిశాల స్థలమును కొని, అందు మల్బర్రీ తోటల బెంచి, ఆపట్టుపురుగుల వృద్ధిజేసెను.

టాటా నారంభించు పరిశ్రమకు ప్రపంచమందన్ని ప్రాంతములలో నెట్టి విశేషపద్ధతు లవలంబింపబడినవో తెలుసుకొని, అవి యిచటి పరిస్థితులకు తగియున్నచో పరీక్షించి, వ్యయప్రయాసముల కోర్చి, అట్టి నవీనపద్ధతులతోనే తనపరిశ్రమలనడుపుట టాటా కలవాటు. ఈపట్టుపరిశ్రమను శాస్త్రీయముగ వృద్ధిచేసినవారిలో జపానీయులు ముఖ్యులు; వారు యూరపియనులనై జ్ఞానికయంత్రముల వాడుచు, వానిని ప్రాచ్యజనుల

కనుకూలముగ గృహపరిశ్రమ పద్ధతిని నడుపున్నారు. వారు పాశ్చాత్యపద్ధతులను ఆసియాలోని గ్రామపరిసరముల కనుకూలముగ సమన్వయించుటలో దిట్టలని జంషెడ్జీ గ్రహించి, తాను 1893 లో స్వయముగ జపానుకేగి, ఆపనివాండ్ర నేర్పును, పురుగుల జంపకుండ సులభముగ గూడులనుండి పట్టుతీసి వడకుటకు వారు వాడుయంత్రములను, గమనించెను. అవి యూరపుపద్ధతుల కన్నను ప్రశస్తములు; అందుచే జపాను నుండి కొందరువిజ్ఞులను రప్పించి, జంషెడ్జి తనతోటలందు వారినుద్యోగులుగ నియమించి, ఆపద్ధతులను, ఆపరిశ్రమలోని చర్యలన్నిటిని, ఇచ్చటి యువకులకు చక్కగ నేర్పించెను. ఆకులకు పురుగు పట్టినచో అవలంబింపవలసిన పద్ధతులను, యాంత్రిక విశేషములను గూడ, మన యువకులు నేర్చుకొనిరి. ఆపరిశ్రమ మర్మములన్నియు బోధించినమీదట, ఆజపానీయులు తిరుగ తమదేశముకును పంపివేయబడిరి.

తాతాచేయు కృషికానందించి, అప్పటిమైసూరు ప్రభుత్వమువారు తమదివానగు సర్ శేషాద్రిఅయ్యరుద్వారా, తాతాగారి పట్టుతోటపరిశ్రమకు సాలినా రు 3000లు చొప్పున కొన్నియేండ్లవరకు విరాళమునిచ్చుచు సహాయముచేసిరి. తనతోటలందు కొందరు మైసూరు యువకులను గూడ పట్టుపరిశ్రమలో విజ్ఞులనుగ తయారు చేసెను. తాతా సహజముగ ఆరామప్రియుడు; ఆ తోట నాదర్శవనముగ జేసెను. ఆ తోటలో తయారైన పట్టు చాల ప్రశస్తముగ నుండి, విదేశపు రకము

లన్నిటికిని తీసిపోకయుండెను. భారతదేశమున ఈపరిశ్రమ కిప్పు డవకాశము లేదని లోగడ నొకయపోహ కల్గియుండెను. ఆయ పోహాయింపుచే కొలగెను. తాతాకింపుగలిన విజయముచూచి, భారత ప్రభుత్వము మైసూరు ప్రభుత్వముకూడ స్వయముగ పట్టుతోటల బెంచి, పట్టుపరిశ్రమకు ప్రోత్సాహ మొసగిరి.

లాభముకొరకు కాక, ఇతరుల కాదర్శముగ నుండుటకే, తాతా ఈపరిశ్రమకై రు 50000 ఖర్చుచేసి, చాల ప్రయాసతో నీపరిశ్రమకు పునరుద్ధరణ గావించెను. ఆతోటలోని పట్టు భారత దేశమంతటను ప్రసిద్ధిజెందినది. తాము తరువాత స్థాపించిన పట్టు తోటలందు చిక్కుకలిగినప్పుడెల్ల, భారత ప్రభుత్వమువారు జంషెడ్జి తాతాకు వ్రాసి, ఆయనసలహా పొందుచువచ్చిరి.

జంషెడ్జి యనంతర మాయనకొమాళ్ళితరోద్యమము లందు నిమగ్నులై, తీరికలేక, ఈపట్టుతోట నమ్మజూపిరి. మన దేశమున నిమ్నజాతివృద్ధికై పాటుపడు క్రైస్తవసంస్థయగు యగు 'సాల్వేషన్ ఆర్మీ'కి నాయకుడగు 'బూత్ టక్కర్' గారితోటనంతట కొనిరి. ఆయన జంషెడ్జికి ముఖ్యస్నేహితుడై, ఆయన యుద్యమములందు సానుభూతి కల్గియుండెను. అందుచే తాతాపేరనే పిల్చుచు, టక్కరుగారా తోటను వృద్ధిజేసెను.

'తాతా తోట' పద్ధతినే, ఇప్పుడు అలీఘరు మొరదా బాదు, సింహళము, మున్నగుచోట్ల పట్టుతోటలు పెంచబడి, వృద్ధిలోనున్నవి. ముస్ముందు పట్టుపరిశ్రమ మనదేశమున నింక ను వృద్ధిగాంచి, ముఖ్యగృహపరిశ్రమలలో నొకటి కావచ్చును.

---

62

## 10. పౌ ర సే వ.

ఇతరజీవులవలె గాక నరుడు, విశేషముగ సాంఘికుడు; అనగా సంఘములో నొకభాగమై, దానివలన చాల సహాయము బొందుచుండును; చాలవరకు సంఘక్షేమమే అందలి వ్యక్తుల క్షేమమగును. * అందువలన తాను సంఘమునకు వీలైనంతవరకు సాయముచేయుట ప్రతినరుని ధర్మము. ఆ సాయము దేశమంతకు వ్యాపించిన, అది దేశసేవ యనిపించుకొనును. అట్టిసందర్భముకొలది మందికే కల్గును; కాని ప్రతివాడును తాను కాపురముండు గ్రామమునకో పురముకో ఉపకరింపవచ్చును. పెద్దనగరములందుండువారు తమ నగర వృద్ధికై యథాశక్తిగ పనిచేయుటకు మంచి యవకాశము లుండును. ఇదియే పౌరసేవ యనిపించుకొనును. (ఈపౌరసేవయే దేశసేవకు పునాదికావచ్చును. ఆయావ్యక్తి ప్రవృత్తిని బట్టి ఇది వేరువేరు రూపము దాల్చవచ్చును.)

13 వ యేట విద్యారంభముకై జంషెడ్జి బొంబాయి వచ్చి, అప్పటినుండి యందే వసించెను; (మధ్య ఎంప్రెసుమిల్లు

---

* ఆధ్యాత్మికముగ గూడ కేవల వ్యక్తి మోక్షమునే యపేక్షించి, కేవల జ్ఞానియై నిష్క్రియుడగుటకన్న, ఈశ్వరప్రీతికరముగ, ఈశ్వరసృష్టిలో ఆయాజీవులు గూడ తనవలె బంధమోక్షము నొందగోరుచు, అందుకై చేతనైనంతవరకు సంఘక్షేమకరమగు కర్మలజేయుటయే నిశ్శ్రేయసమని చాల మంది మతస్థాపకు లెంచినటుల తోచును.

సందర్భమున మూడునాలుగేండ్లుమాత్ర మాయన నాగపుర మందుండెను.) అప్పుడప్పుడు విదేశయాత్రలకు పోయినను కొన్ని నెలలకు బొంబాయి చేరుచుండెను. బొంబాయిపౌరు డగుటచే, జంషెడ్జి కానగరముపైన నమితాభిమానముండెను. ఆతని కాడంబరమన్నను వక్తృత్వమన్నను ఇష్టములేదు; ఎన్న డును మునిసిపలుసభ్యుడగుటకు యత్నింపలేదు; కాని పైకి తెలి యకుండనే, బొంబాయి నగరపుఆరోగ్యమును విద్యాదిసౌకర్య ములనుహెచ్చించి, దానినిసుందరముగ జేయుటకాయన చాల కృషిచేసెను. (తనజన్మస్థలమగు నవసారిలోను ఆయన పాఠ శాలలను భవనములను ఆరామములను నిర్మించెను.) బొంబా యియే మనదేశపు ప్రధానపురమని, అది ఆదర్శనగరము కావలెనని ఆయన ఆశయము. *

జంషెడ్జితాతా ప్రవేశించునప్పటికి బొంబాయి యిప్పటి స్థితికి రాలేదు. అది సముద్రతీరపు ద్వీపపుంజము; మొదట

* బొంబాయిపుర మిప్పుడు కొన్నివిషయములలో మనదేశమందస మానము, పదిలక్షులపైగా జనసంఖ్యగలది; కలకత్తా మాత్రము దీనికన్నను కొంచెము పెద్దదందురు. ఈరెండునగరములందును మనదేశమందికెక్కడను లేని అనేక ప్రాసాదములు, మహాయంత్రశాలలు, వివిధపరిశ్రమలు, వివిధకళా శాలలు,వివిధజాతిజనసంఘములును, గలవు. కాని కలకత్తాలోనిముఖ్యపరిశ్రమలు చాలవరకు యూరపియనుల వశమందున్నవి. బొంబాయిలో అట్లుగాక పరి శ్రమలు వ్యాపారములు ముఖ్యముగా భారతీయహస్తములందే యున్నవి. అందువల్ల కలకత్తాలో యున్నంత పాశ్చాత్యప్రాబల్యము బొంబాయిలో లేదు. మన దేశీయవ్యాపారములకు బొంబాయియే కేంద్రమని చెప్పవచ్చును.

చిన్నగ్రామముగ నుండి, 17 వ శతాబ్దినుండి పాశ్చాత్య స్పర్శ కలిగినమీదట వర్తకము కోస్తావ్యాపారము వృద్ధియైనందున మద్రాసు కలకత్తాలవలె క్రమముగా నది పెద్ద పట్టణమయ్యెను. కాని ఈతక్కినపురములకన్న బొంబాయి యూరపుకు చాల దగ్గర; పాశ్చాత్యులకది మనదేశపు ద్వారముగనుండెను. మరియు బొంబాయిరేవు మద్రాసు కలకత్తాలకన్న చాల ప్రశస్తము, నైసర్గికము, చాలభద్రము అందువలన 19 వ శతాబ్ది మధ్యకది చాల వేగముగ వృద్ధియయ్యెను. కాని యందు మహాభవనము లేర్పడినను, వానిని తగిన కట్టుబాట్లు పురనిర్మాణపద్ధతులు లేకుండ, అవసరమునుబట్టి జనులు తమకు తోచినటెల్ల కట్టిరి. చాల యంతస్తుల పెద్దమేడలు చిన్న యిండ్ల ప్రక్కను, ఇరుకుసందులవద్దను, ఏర్పడెను. వీధులు బారుగను విశాలముగను లేక, కశ్మలముగ నుండెను.

బొంబాయిలో దబాటువాన యధికము. నగరము హఠాత్తుగా జలమయమగుచుండెను. నీటిపారుదలకు తగు నేర్పాట్లు లేకుండెను; ఆహర్మ్యములు మధ్యకాలపురీతినై, బ్రహ్మాండమగు బోషాణములవలె నుండెను; గాలి వెలుతురు గృహములోపల ప్రసరించుటకు వీలులేకుండ కట్టబడెను. *

* 17, 18 వ శతాబ్దులందు మనదేశమందశాంతి బందిపోట్లభయమును వృద్ధియగుటచే, శ్రీమంతులు భద్రతయే ప్రధానముగ జూచుకొని, తమభవనములను ఇరుకుగను పెద్ద పెట్టెలవలెను గట్టుచుండిరని తోచును.

తాతా వ్యాపార మారంభించునరికి, ఆసంకులనగరము వికృత భవనములతో క్రిక్కిరిసి, జనసమ్మర్దముచే విశ్రాంతికి తావులేక, ఇరుకుసందులతో ననారోగ్యము కావాసమై యుండెను. మరియు మిల్లులు వృద్ధియైనకొలది, ఆప్రాంతములందు కార్మికులకై 'చాలు' లనబడు ఇరుకుకొట్లేర్పడెను. ఆపేటలు చాల క్రిక్కిరిసి తగువీధులు లేక గాలి వెలుతురులకు తావులేనివై, నీటిసదుపాయము లేకయుండెను. దుర్భరదుర్గంధభూయిష్టములైన యీ కొట్లలోని కూలిజనులు పశువులకన్న హీనముగ నుండిరి. తరుచు కుటుంబమంతయు, ఒక్కొకప్పుడు రెండు మూడు కుటుంబములుగూడ, ఒకే గదిలో భుజించుచు శయనించుచు, రాత్రింబవళ్లు నుండే కాపురముండెను. అట్టిస్థితిలో, ఆపేటలందంటువ్యాధు లారంభించి, తరుచు ప్రబలుచుండెను. ఆవ్యాధులు నగరమందలి యితరభాగములకును తీవ్రముగ వ్యాపించెను; వేలకొలది జను లావ్యాధులచే మరణించుచుండిరి. అందువలన బొంబాయి పురక్షేమమునకు వ్యాపారవృద్ధికిని గూడ చాల హాని కలుగుచున్నదని, ఈకళంకమును మాన్పి నగరమును వాసయోగ్యముగ జేయుట ప్రథమకర్తవ్యమని, తాతాకు తోచెను.

1863 ప్రాంతమున దూదిమెగుమతి చురుకుగ జరిగినపుడు, బొంబాయి వర్తకులకు చాల ద్రవ్యము చేరెను; అప్పుడాసొమ్ముతో చిత్రమగు కంపెనీలు చాల లేచెనుగదా? అప్పు

డు ప్రేమచందురాయచందు అను కోటీశ్వరు డొక్క పెద్ద బాంకును స్థాపించెను* అందలి సొమ్ముతో బొంబాయిచుట్టు నున్న విశాలమగు పల్లపు స్థలములో జొచ్చు సముద్రపుపోటు నీటిని పెద్దరాతిగోడలతో నరికట్టి, ఆస్థలముల మెరక జేసి, అందు వాసగృహముల నిర్మించుటకు తాతాయు మరికొందరును సమకట్టి కొంతపనిచేసిరి. అందుకు చాల సొమ్ముకావలెను. కాని అమెరికాలో సంధిచే యుద్ధము నిల్చిపోయి, మనదూది యెగుమతి హఠాత్తుగ ఆగినప్పుడు, బొంబాయిలో మరికొన్ని యితర బాంకులతో బాటు ప్రేమచందురాయచందుగారి బాంకును దివాలాతీసెను. ఆప్రళయమున చాలసొమ్ము నష్టమైనందున, ఆనివేశనస్థలముల ప్రణాళికయు నిల్చిపోయెను.

నాగపురమం దెంప్రెసు మిల్లుల స్థాపించినప్పుడు, అచటి కూలీలకై జంషెడ్జీ పాశ్చాత్యపురములందలి ఉత్తమరీతిని చక్కని కుటీరముల నిర్మించెను. దరిమిలాను బొంబాయిలోను అహమ్మదాబాదులోను మిల్లుల గట్టినప్పుడును, ఆయన యట్లే చేసెను. తనమిల్లుల నాయన విశాలముగను, పనివాండ్రకు సుకరముగనుండునట్లును, కట్టెను. వారు వసించుటకై, విశాలమగు పేటలను తానే, చాలచొమ్ము ఖర్చుపరచి, నిర్మించెను.

* ఈయన గొప్పవ్యాపారనాయకుడై, దూదియెగుమతిచే చాల శ్రీమంతుడై, అనేక దానధర్మములజేసెను; 'ఏషియాటిక్ బాంకింగ్ కార్పొరేషను' అను యీయన స్థాపించిన యాబాంకు దివాలాతీయగా, ఈయన స్థితిచెడెను.

లందు సరియైన వీథులనుంచి, మనుగుదొడ్లకు ఆటస్థలములకు ప్రత్యేకమగు వసతుల గల్గించెను. మంచి కిటికీలనుంచి గాలి వెలుతురు తగులునట్లు చౌకలోనే చక్కని కుటీరములను బారులుగను మనోహరముగను గట్టెను. కూలీల స్నానపానా దులకు మంచినీళ్ళవసతి నేర్పరచి, మురుగునీరు పోవుటకును తగునేర్పాటుల జేసెను; వానికి కొద్దిపాటి అద్దెనే స్థిరపర్చెను. ఆకుటీరముల పేటలు ఆరోగ్యకరములై, కూలీల కాకర్షకములై, అదర్శరూపముగ నుండెను. వానినిజూచి కొందరితరులును అట్టి కుటీరపంక్తులనే నిర్మించిరి. తాతా తనకూలీల కుటీరము లందు వ్యాయామస్థలములను వైద్యశాలలను విద్యాలయము లను పఠనమందిరములను నిర్మించి, వానినుచితముగ నడుపు చుండెను. అందువలన నాకార్మికుల దేహమనశ్శక్తులు వృద్ధి యాయెను.

ఇట్లు క్రమముగా బొంబాయి మిల్లుప్రాంతములందు కొంత ఆరోగ్యస్థితి కార్మికజనులకు సౌకర్యములు నేర్పడెను జనులు నధికారులును దూరదృష్టిలేక గృహములను వీథులను నిర్మించుటచే, నగర మనారోగ్యముగనున్న స్థితిలో, ఆసార్వ జనిక నగరమున పశ్చిమదేశములనుండి ప్లేగు (=మహామారి) తగిలెను; అంటువ్యాధులు ఆనగరమును పీడక, పండ్లకొలది బాధింపజొచ్చెను. ఈప్లేగు 1895 నుండి చాలతీవ్రముగ వ్యా పించెను; అందుచే చాలజనులు చనిపోయిరి, అనేకులు నగర

ముఖీడి పారి పోయిరి; వ్యాపారము స్తంభించెను, చాలమంది వ్యాపార నాయకులప్పుడు బొంబాయి విడచి చనిరి; అప్పుడు జంషెడ్జీ మాత్రమందేయుండి ఆవ్యాధి నివారణను, ఆరోగ్య వ్యాప్తికి, జరుపు చర్యలందు చాల తోడ్పడెను; ఆయనను చాల ద్రవ్యసహాయము గూడ చేసెను.

బాల్యమునుండి తండ్రితో గలసి ఆనగరమందు వేర్వేరు పేటలలో కాపుర ముండినందున, జంషెడ్జీ యాపురమున చక్కని భవనముల నిర్మించుటకు వీలగుస్థలములను, జాగత్త తో కనిపెట్టెను. వ్యాపారసందర్భమునను, తనబాకీసొమ్ముల తీర్మానముకును, ఆయన చాల నివేశనస్థలములను క్రయమును సంపాదించెను. వ్యాపారరంగములకు దగ్గరను ముందు వేగ ముగ వృద్ధికాదగిన ప్రాంతములందును గల ఖాళీస్థలములు ముందు చాల యుపయోగకరము లగునని గ్రహించి, ఆయన వానిని చౌకస్థితిలో కొనివేసెను; ఆస్థలములందు చక్కని సౌధముల నిర్మించెను.

ఇంగ్లండు ఫ్రాంసు జర్మనీలలోను, జపానులోను, అమెరికాలోను, గృహములను ఆరోగ్యకరముగ నిర్మించి, అందు చౌకలోనే స్నానపానదీపాదుల సౌకర్యములను, ఆధునికవైజ్ఞానికపద్ధతుల ప్రకార మొనగూర్చుచున్నారు; వానిని తనవ్యాపారయాత్రలందు టాటా గమనించి, బొంబాయిలో నాప్రకార మిండ్లను కట్టెను. చుట్టును ఖాళీస్థలముంచి, బలమగు పునాది

పైన, ప్రశస్తమగు నిర్మాణపరికరములతో నుక్కుస్థంభముల మూలమున చాల యంతస్థుల మేడల నిర్మించెను; విశాలమగు వరండాలు, గాలికెదురుగ పెద్దకిటికీలు గల్గి, మేడపైనగూడ నీటిసమపాయము, విద్యుచ్ఛక్తి యేర్పాటుతో వంటలు, లోనికి వెలుతురునిచ్చు నద్దపుపైకప్పులు, చలువరాతి చీడీలు మొదలగు చక్కని సౌకర్యము లమర్చబడెను అప్పటికింకను మనదేశమున వ్యాప్తిలేకున్నను, తానుకట్టు భవనములందు తాతా యెలెక్ట్రికు (విద్యుత్) దీపముల నమర్చెను. ఆభవనము లందనేక కుటుంబములు పరస్పర సంబాధ మక్కరలేకుండ వేర్వేరుగ కాపురముండునట్లు సౌకర్యముల నేర్పర్చెను; వానిని న్యాయమగు బాడుగకు మధ్యరకపు ఉద్యోగులకు వర్తకు లకు అద్దెల కిచ్చుచుండెను. ఆసుందరభవనముల చక్కని వస తినిబట్టియు, వ్యాపారస్థలములకవి సమీపముగ నుండుటవల నను, చాలమంది యాభవనములందే కాపురముండుటకు వచ్చుచుండిరి తాతాయు వారియవసరముల దెలుసుకొనుచు, సలహాల గ్రహించుచు, వారికి వలయు క్రొత్తసమపాయముల నమర్చుచు, సహృదయుడై, వారికష్టసుఖములందు సానుభూతి కల్గియుండెను. ఆయన కట్టించిన ఎస్ప్లనేడు భవనము, విక్టోరియా బిల్డింగ్సు, జూబిలీబిల్డింగ్సు మున్నగు ఆసౌధగృహములు బొంబాయిలోను ఆరాష్ట్రమంతటను గూడ త్వరలోనే ప్రసిద్ధ ములయ్యెను. వానిలో చక్కని బల్లలను, కుర్చీలను, తాను

యాత్రలందితరదేశములనుండి తెచ్చు సుందరప్రతిమలను, విచిత్రవస్తువులను, కొన్ని గ్రంథములను గూడ, అమర్చెను.

బొంబాయికి చుట్టుపట్ల 'జుహు, బంద్రా' సాల్సెటి, మహద్, అను చిన్నదీపములు గలవు. అందును బొంబాయికి పరిసరమందునుగూడ విశాలస్థలములను గొని, అందువాసయోగ్యమైన చక్కనిబంగాళాయిండ్ల నాయనకట్టించెను. ఆయన యితరదేశములందలికట్టడములలో వేశ్వేరు పంపిణీలనుకనిపెట్టుచు, అందు చౌకలో చక్కగనుండువానికీతిని తనగృహమున నిర్మించుటచే, అవి ఉత్తమములై ఇతరులకాదర్శముగ నేర్పడెను. తరువాత నట్టివిశాలములు ఆరోగ్యప్రదములునగు భవనములను కొందరితర శ్రీమంతులు ననుకరించిరి; సామాన్యమగుజీతము ఆదాయముగలవారికి వీలగునట్లు, 'జింఖానా చాంబర్సు' అనుపేర చాలయిండ్లవరుస నాతఁడు కట్టించెను. ఇందుపాశ్చాత్యపద్ధతి స్నానపానాదుల సౌకర్యమేర్పర్చబడెను. ఇదినాలుగంతస్థులదై వ్యాపారస్థలముల సమీపమున చుట్టునుఖాళీస్థలముననున్నది. చాలమందియూరపియనులిందు కాపురముందురు.

తనమిల్లులపైవచ్చు నాదాయములో కొంతభాగమును టాటాగారు భవననిర్మాణముకును వానినివృద్ధి జేయుటకును వినియోగించుచుండెను. ఆకర్షకములగు నాగృహములందెప్పుడును జనులు కాపురముండుటచే, ఆగృహములవల్లను టాటాకు మంచి ఆదాయమే వచ్చుచుండెను. కాని సౌకర్యమును బట్టి



తాజ్ మహల్ హోటలు.

జనులు హెచ్చుగవచ్చుచున్నను, ఆయన వాని అద్దెలను అనవసరముగ వృద్ధిచేయుటలేదు; కొద్దిరేటులాభముకే తృప్తుడగుచుండెను.

అంతట తాతా ప్రపంచపుసుందరభవనములలో నొకటై బొంబాయి కలంకారము మనదేశముకంతకు నాదర్శమునగు నొక మహాభవనమును నిర్మించెను. ఇదియే 'తాజ్‌మహల్ హోటలు'. మన మహానగరములన్నిటిలోను అన్నిదేశములనుండివచ్చు మహనీయులగు యాత్రికులు వసించుటకు ఆధునికసౌకర్యములసిచ్చు హోటళ్ళు అన్నియు యూరపియనులవే; వానిలోను పాశ్చాత్యశాలలలోనుండు నన్నిసౌకర్యములు లేవు; మరియు అందుభారతీయులకుచితస్థానముండదు. ఈలోపములదీర్చుటకు, తాతా 1898 లో 'తాజ్‌మహల్ హోటలు' నారంభించి యైదేండ్లలో దానినిబూర్తిచేసెను. ఇదిబొంబాయిహార్బరుప్రక్కను సముద్రమునకెదురుగా నున్నది. దేశాంతరములనుండి స్టీమరులపైవచ్చువారికి రేవుకుచాలదూరమునుండియు నీటిపైనముందుగ బొంబాయిలో నీభవనమే రమణీయముగ గాన్పించుచుండును. శ్రీమంతులు సామాన్యులు అన్నిదేశములవారు గూడ బసచేయుటకిందు తగువసతియు, వారివారి యాచారముల కనుకూలమగుసౌకర్యములును కలవు. వెలుతురునుసర్వకాలములందును సముద్రపుగాలియు నన్నిప్రక్కలను ప్రసరించునట్లుగా దీని గదులు విశాలమగు కిటికీలతో గట్టబడినవి; ఐనను దీని నిర్మాణ

పద్ధతి, అధికారవ్యవహారములు, భారతీయములే; ఏవైపునుండి చూచినను, ఈప్రాసాదరాజ మతిసుందరముగ కనబడును. ఇందు దీపములు, వంట, వేడినీటిసప్లై, బట్టలయిస్త్రీ, పై అంతస్తుల కెక్కుట, మున్నగు సౌకర్యములన్నియు, విద్యుచ్ఛక్తిమూలముగనే జరిపించబడును. మరియు పోస్టాఫీసు వైద్యసహాయాదులన్నియు అందే కల్పింపబడినవి. మనదేశపు హోటలులన్నిటిలో నిదియసమానము. నలుబదియడుగులలోతునుండి బలమగు పునాదితోను అందుపైన ప్రశస్తమగు ఉక్కు-కాంక్రీటుసిమెంటు మున్నగు చలించనివస్తువులతోను, సుందరముగనిర్మితమైన యీభవనముకై జంషెడ్జి నలుబదిలక్షలరూపాయలు ఖర్చుచేసి, చాల శ్రమపడి ముఖ్యమగు నేర్పాటుల స్వయముగ జరిగించెను.

ఇట్లు బొంబాయినలంకరించుటయే గాక, ఆనగరపు ఆరోగ్యము, విద్య, వ్యాయామమున్నగు సౌకర్యముల వృద్ధికై, ఆయన ధనమునిచ్చితోడ్పడుచుండెను; విద్యాధికులు, వర్తకులు, సాంఘికరాజకీయనాయకులు, సాయంకాలములందుకలుసుకొని అనేకవిషయముల చర్చించుచు సంప్రతించుకొనుటకును, సామాన్యజనులకు గ్రంథాలయ సౌకర్యముండుటకును, ఆయన చాలచోట్ల క్లబ్బులస్థాపింపతోడ్పడెను; అందుల సంభాషణలలో పాల్గొనుచు, అందు తన విశేషానుభవముతో మిత్రులకనేకముఖ్యవిషయములను తెలుపుచుండెను. ఆయన

కార్పొరేషనులో సభ్యుడగుటకెన్నడును తలపెట్టలేదు; కాని చాలకాలము బొంబాయిలో గౌరవన్యాయపతిగమాత్రము పనిచేసెను.

బొంబాయిపరిసరపు నివేశనస్థలములపైన లోగడప్రభుత్వమువారు హెచ్చుపన్నువిధించినప్పుడు, జంషెడ్జి ప్రభుత్వము వారితో తీవ్రచర్చజరిపి, ఆపన్నునుతగ్గించుటకు పత్రికలందుగూడ చాలవ్యాసములమూలమున నాందోళనసలిపెను. ఆయన బొంబాయిపురము పురోభివృద్ధికి సంబంధించు విషయములన్నిటిలోను శ్రద్ధవహించెను. మిల్లులందు బట్టలతయారుచేయుట ఆనగరపుముఖ్యపరిశ్రమ; అందుల ప్రతిసమస్యలోను పాల్గొని, ఆయన నాయకుడయ్యెను; తనమిల్లులలాభముకే యత్నింపక, నగరముకంతకు లాభించునట్లే కృషిసలిపెను. తనమిల్లులందు యువకులకు సాంకేతికవిద్యను, యంత్రములనడుపు పద్ధతులను, ఆర్థికవ్యాపారవిధానములను, ఉచితముగ నేర్పుచుండెను.

పౌరాభివృద్ధికి విద్యాసౌకర్య మవసరము; తన యాదాయములో కొంతభాగమును తాతా విద్యాపోషణకై వినియోగించుచుండెను. ఆర్థికవిషయము లందాసక్తికలిగియుండుటబట్టియు, తనయనుభవమునుబట్టియు, నాణెములు వెండిబంగారముల దామాషారేటు బాంకుపద్ధతులు మున్నగువాని గూర్చి, ఆయన సలుపువిమర్శలును జ్ఞానదాయకములై యుండెను. బొంబాయిలో తనకుమారునిచే కొన్ని వార్తాపత్రికల నడిపించి,

అందుకుతగుసలహాలనిచ్చి, అప్పుడప్పుడుఆర్థికసమస్యల జర్చించు వ్యాసముల వ్రాయుచుండెను. బొంబాయిలో గొప్పవర్తకశిఖామణులు చాలమందియున్నను, వారికందరకు తాతాయే ఆదర్శరూపముగనుండెను. తాతాబోలు మహనీయుల పౌరసేవ వలననే బొంబాయి మనదేశమున ప్రస్తుతపు నిరతిశయస్థితికివచ్చినది.

---

75

## 11. విజ్ఞానవర్ధనము.

జంషెడ్జితాతా పారిశ్రామికనాయకుడు; ఆమహనీయుడు తనజీవితమంతను ఈదేశపు వ్యాపారవృద్ధికి ఆర్థికోన్నతికినే ధారవోసెను; అందఖండప్రజ్ఞతో జయమొందెను. మన దేశపు ఇతరపారిశ్రామికులకు సాధారణముగా విజ్ఞానాభిలాష లేదు. కానితాతామాత్రము మొదటినుండియు విజ్ఞానమం దనురక్తి గలిగియుండెను. కళాశాలలో విద్యార్థిదశలోనే,ఆయ నకుశాగ్రబుద్ధి విజ్ఞానాభిరుచి విశదమగుచుండెను.

భారతదేశ ముచ్చస్థితిలో నుండినప్పు డీదేశీయులు విజ్ఞాన మందును ప్రజ్ఞావంతులై యుండిరి. అప్పుడు చాల వెనుకబడి యుండియు, ఇటీవల నీదేశముకన్న ఇంగ్లండు, జర్మనీ అమెరికా, జపానులు చాల బలీయములైనవి; అందు కాదేశములం దిటీవలజరిగిన యద్భుతవిజ్ఞానాభివృద్ధియే మూలకారణమనియు, విజ్ఞానమున వృద్ధిగాంచినగాని యీదేశము మరల ఉన్నతము కాజాలదనియు, తాతా గ్రహించెను. ఆర్థికవ్యాపారాదులకే గాక, రాజకీయమునకు, తుదకు నిజమగు ఆధ్యాత్మికాభివృద్ధికి గూడ, విజ్ఞాన మావశ్యకము; (ప్రకృతిలో లీనమగు భౌతికశక్తిని వశపర్చుకొనుటకును, అమేయమగు సృష్టిరహస్యమును చిద్వి లాసతత్వమును గ్రహించుటకును, విజ్ఞానమేముఖ్యసాధనము.) తాతా తనమిల్లుల స్థాపించునాటికి మనదేశమున కొత్తగ విశ్వ

విద్యాలయము లేర్పడినను, అందున్నత విజ్ఞానబోధకు పరిశోధనలకు అవకాశములు లేవు. అందుకై విదేశములకే పోవలెను. అంతటి ఉత్సాహసాహసములుగల ధీమంతులగు యువకులు నిర్ధనులగుటచేతను, మన శ్రీమంతుల కావిషయమున శ్రద్ధలేకయు, మన విద్యార్థులకు విజ్ఞానము దుర్లభమయ్యెను. మరియు కలెక్టరీమున్నగు ఉన్నతోద్యోగపరీక్షలందును ఉన్నత విజ్ఞానవంతులే సులభముగ కృతార్థులు కాగలరు; అప్పుడు ఐ. సి. ఎస్. పరీక్షలు లండనులోనే జరుగుచుండెను.* ఆ పరీక్షలో ద్రవ్యహీనులగు భారతీయులు పాల్గొనుటకు అవకాశ ముండుటలేదు; చాలవరకు బ్రిటిషువారే ఆపెద్ద యుద్యోగము లొందుచుండిరి; ఆస్థితిలో మనదేశీయులకు తగు నవకాశము కల్గించుట యవసరమని తాతాను తోచెను.

ఐ. సి. ఎస్. మున్నగు పెద్దఉద్యోగ పరీక్షలకు విజ్ఞానాభ్యాసముకు ఇంజనీరింగు (=వాస్తువిద్య) మున్నగువానికి పోదలచు బీదయువకులకు తోడ్పడుటకై, తాతా గారిల్లు 1892 లో కొన్నిలక్షల రూపాయలతో నొకనిధి నేర్పచ్చిరి. ప్రతిసంవత్సరము ప్రతిభావంతులగు ఇద్దరు మనదేశపు యువకులకు, విదేశములందున్నతవిద్య నభ్యసించుటకు, సాలీనా యీఫండులో నుండియవసరమునుబట్టి కొన్ని వేలరూపాయల ద్రవ్యసహాయ

* ఇప్పుడు ఆపరీక్ష యేకకాలమందే లండనులోను మనదేశమున ఢిల్లీలోనుగూడ జరుపబడుచున్నది.

ముచేయబడును.* ఆసొమ్ము సాయమున విదేశములందున్నతవి ద్యనభ్యసించి పరీక్షలలో కృతార్థులైనవారు మరల స్వదేశమునకు వచ్చినతరువాత పెద్దఉద్యోగులో డాక్టరులో వ్యాపారులో అయి, చాల సొమ్ము సంపాదింపవచ్చును. అట్లు సంపాదనలో నున్నయెడల, తరువాత వారు (తమ సంపాదనచేగల్గు ఆదాయమునుండి) తామిదివరలో తీసికొన్న సొమ్మును కొంతకొంతగా వసూలిచ్చుచు, తాతా ఫండు వారిసొమ్మును యథాశక్తిగ తీర్చివేయవలెను.

ఆపద్ధతివలన నాయువకులితరుల ద్రవ్యమును భిక్షగ దీసికొంటిమను నైచ్యములేకుండ, స్వయంసహాయమున నేవృద్ధికి వచ్చినట్లాత్మగౌరవము కల్గియుందురు; మరియు నాపద్ధతివలన తాతా యేర్పర్చిన యాఫండు నశింపులేక, ఎప్పటికప్పుడు భర్తీయగుచు తరతరములుగ నట్లేనిల్చి, ముందుతరముల యువకులకెల్ల కాలము నుపయోగించును. అప్పటినుండి నేటివరకు చాలమంది మనయువకులీఫండుసహాయమున, ఇంగ్లండు, జర్మనీ, అమెరికా మున్నగుదేశములందనేకవిజ్ఞానవిద్యల నభ్యసించి, స్వదేశమున కనేకవిధముల నుపకరించియున్నారు.

---

* ఆయువకులిద్దరిలో నొకడు పార్సీగ నుండవలెనని మొదట ఒక వరతుండెను; కాని ఉదారుడగు తాతా కొలదియేండ్లకే ఆషరతు తొలగించి, ఆయువకు లందరును భారతీయులెవరైననుసరే, బీదలు అర్హులు నయిన చాలునని నిర్ణయించెను.

ఇప్పటికి ; సుమారు డెబ్బదిమందివరకు భారతీయు లీఫండు సహాయమున విజ్ఞానవంతులై గొప్ప వైద్యులో, ఇంజనీర్లో, కలెక్టరులో అయిరి.*

యంత్రనిర్మాణము, గనులపని, బైసికిళ్ళు, మోటారు, అద్దములు, రసాయనవస్తువులు మున్నగు ఆధునిక పరిశ్రమలన్నిటి యభివృద్ధికి, శిల్పములకు గూడ, విజ్ఞానార్జన మత్యవసరము. అందుకై ప్రతిసాలున చాలమంది విదేశముల కేగుచో, వారికి విదేశములందు చాల వ్యయప్రయాసములు, అనారోగ్యాదులచే బాధలును, కలుగును. అంతమంది కచటతగు ప్రవేశముదొరకుటయుకష్టము. మరియు చాలకాలమట్లు విజ్ఞానముకై కేవల మితరదేశములపై నాధారపడుట భావ్యముకాదు. కనుక మనవిశ్వవిద్యాలయములం దంతవరకు లభింపని యున్నత విజ్ఞానమును యువకులు మనదేశమందే నేర్చుకొనుటకును, నూతనపరిశోధనల జేయగలుటకును, మనదేశమందే గొప్ప విజ్ఞానాలయమును స్థాపింపవలెనని జంషెడ్జి నిశ్చయించెను.

* యూరపియనే కలెక్టరు అగుటవలన, అతనికివచ్చు జీతము పెన్షను వగైరాలు దాదాపు అంతయు విదేశములకే పోవును. ఆయుద్యోగము భారతీయునికి వచ్చిన, అతనికి రాజ్యాంగానుభవము మున్నగు లాభములు గల్గుటే గాక, అతనికి వచ్చు జీతమువగైరా లీదేశమందే నిల్చియుండును. మొత్తము మీద లెక్కజూచినచో, యూరపియను స్థానమున భారతీయుడే ఐ. సి. ఎస్ అయి ఉద్యోగి అగుటవలన, సగటున రెండేసిలక్షల రూపాయలు మనదేశమునకు లాభమని టాటా గుణించి నిర్ణయించెను.

కాని, ఆధునికములగు ఉన్నతవిజ్ఞాన పరిశోధనాలయముల స్థాపనకు చాల ద్రవ్యము కావలెను. యూరపు అమెరికాలందు గొప్ప కుబేరులు విజ్ఞానాభివృద్ధి యావశ్యకతను గమనించి, తమదేశముల పురోభివృద్ధికై గొప్ప విరాళములనిచ్చి, అనేక విజ్ఞానపరిశోధనశాలల స్థాపించి, జరుపుచున్నారు. అచ్చటి విశ్వవిద్యాలయములకును చాల ద్రవ్యనిధి యుండుటచే, అందును పరిశోధనలకు మంచి యవకాశములు గలవు. మన దేశముననున్న శ్రీమంతుల కట్టి యభినివేశము లేదు. అప్పటికి విజ్ఞానాలయ స్థాపనకు యత్నమేమియు కలుగలేదు. అందుచే, తాతాయే మార్గదర్శకుడై, మంచి విజ్ఞానాలయముకై అధమము 30 లక్షల రూపాయలు కిమ్మతుచేయు స్థిరవసతి నిచ్చుటకు నిశ్చయించి, 1898 లో ఆసంగతిని ప్రకటించెను.

అట్టి విజ్ఞానాలయము జయప్రదమగుటకు ప్రభుత్వపు ఆదరప్రోత్సాహము లవసరములు. అది స్థిరముగ జరుగుటకు ప్రభుత్వము నిబంధన చేయవలెను; అందు చదివి కృతార్థులైన యువకుల పట్టముల గుర్తించి, వారి కున్నతోద్యోగములను పరిశ్రమలం దుచితస్థానమును, ప్రభుత్వ మీయవలెను. ఆ విజ్ఞానాలయము బాగుగ వృద్ధిజెందుట కింకను ద్రవ్యసహాయ మవసరము. అందుచే దానికి తనపేరు పెట్టకూడదని తాతా

నిర్ణయించెను;* అందుచే దానికి ప్రభుత్వపుప్రోత్సాహము ద్రవ్యసహాయము కూడ కోరెను. మనదేశమున శ్రీమంతులు కొందరు కలరు. కాని ప్రభుత్వాదరము లేనివానికి, ఇతర వ్యక్తులపేర ఉన్నసంస్థలకు, వారు సాధారణముగా సాయము చేయరని తాతాకు తెలియును.

అంతట భారతప్రభుత్వమువారి కోరికపైన, ప్రసిద్ధ పాశ్చాత్య దేశములందలి ఆయావిజ్ఞానాలయముల ప్రణాళికలను సేకరించుటకై, తాతా ప్రకృతి శాస్త్రవేత్త ప్రతిభాశాలియునగు బర్జోర్జిపాద్షా అను ఒక పార్సీ యువకునంపెను; అంత డాదేశముల దిరిగి, ఆప్రణాళికల విమర్శించి, కొందరు ముఖ్యవైజ్ఞానికుల యభిప్రాయములగూడ గ్రహించివచ్చి, విపులమగు రిపోర్టునిచ్చెను. ఆరిపోర్టును ప్రభుత్వమువారంగుకొనిరి. అప్పటినుంచి పాద్షా చాల ఉత్సాహముతో పనిచేయుచు, ఈవిషయమందును ఇతరోద్యమములందుగూడ తాతా కుటుంబమునకు సహాయకుడై, చాల విశ్వాసపాత్రుడుగ కృషిచేసెను. ఆరిపోర్టునందుకొని, 1900 లో ప్రభుత్వమువారా విజ్ఞానాలయ

*ఇతరుల పేరుతోస్థాపితమై వారికేప్రఖ్యాతి గల్గించు సంస్థకు తాము సహాయముచేయుటకు సాధారణముగ మనదేశపు శ్రీమంతు లిచ్ఛగింపరు. తమకు పేరునిచ్చు సత్కారముల జేయుటకు కొందరు శ్రీమంతులు సిద్ధమగుదురు. అట్టివారి యౌదార్యముకు నిరోధము లేకుండుటకును, తాను సహజముగ కీర్తికాముడు కానందువలనను, తాతా యావిజ్ఞానాలయమునకు తనపేరు చేర్చకుండ నిషేధించెను.

ము స్థాపించుట కంగీకరించిరి. కానిసుప్రసిద్ధులగు వైజ్ఞానికు లొక రీదేశమునకువచ్చి స్వయముగ పరిస్థితుల విమర్శింప వలెనని ప్రభుత్వము వారనిరి; అంతట టాటా బ్రిటనునకువెళ్ళి, అందు వైజ్ఞానిక ప్రముఖుడగు ప్రొఫెసర్ విలియం రామ్సేగారిని లండను నుండి రప్పించెను. టాటాఖర్చుపైన రామ్సేగారు వచ్చి, ఆయాప్రాంతములదిరిగి, విమర్శించి, 1901 లో కొన్ని సూచనలతో రిపోర్టు నిచ్చెను. టాటా ఆయనను బహూకరించి పంపెను.

పరిశ్రమలకు సహాయకరముగ నుండుటకై, ఈవిజ్ఞానాలయమును బొంబాయిలోనే ఉంచవలెనని, అట్లైనచో నింకను కొందరు వదాన్యులగు కోటీశ్వరులు విత్తమిత్తురని, కొందరనిరి. కాని యట్లెవ్వరును పెద్దమొత్తముల నిచ్చుట కప్పుడుసిద్ధపడలేదు. మరియు, ఆయాపరిశోధనాదులకు విశేషస్థలము కావలెను; బొంబాయిలో, అంతఖాళీస్థలము దొరకుటకష్టము; దొరకినను చాల ప్రియముగ నుండును. బెంగుళూరెక్కువ యనుకూలముగ తోచెను. బెంగుళూరు మైసూరుసంస్థానపు మధ్యను పీఠభూమిపైనున్నది; అది సమశీతోష్ణము, చాల ఆరోగ్యకరము; ఎక్కువ మనఃపరిశ్రమతో పరిశోధనల జేయుటకచ్చటి వాతావరణము చాల ననుకూలము; అచట కావ

లసినంత విశాలమగు ఖాళీస్థలము కలదు. భారతప్రభుత్వము, రామ్సేగారు కూడ, బెంగుళూరునే వరించిరి *

ఈస్థితిలో వదాన్యుడు ప్రజాక్షేమాభిలాషియునగు మైసూరు మహారాజుగారు (అప్పటి తమదివానగు శేషాద్రి అయ్యరుగారిప్రోత్సాహమున), బెంగుళూరులో దానినుంచుచో, అచట (300 ఎకరములకు తక్కువలేకుండ) అందుకు వలయు స్థలమంతయు, భవనయంత్రాదులకై 5 లక్షల రూపాయలను, ఇంకను సాలినా యేబదివేల రూప్యములను, ఎట్టిషరతులు లేకుండ నుచితముగ నిచ్చెదమనిరి. మరొక ప్రాంతమున దాని నుంచుచో, ఇట్టివిరాళము దొరకునట్లు కనబడలేదు; (మైసూరు సంస్థానమందు స్థాపింపదలచు వివిధపరిశ్రమల కావిజ్ఞానాలయము సహకారియగునని, తమ సంస్థానవిద్యార్థులకును లాభకరమని, మైసూరుప్రభుత్వమువారు గ్రహించిరి). అంతట బెంగుళూరిలోనే యావిజ్ఞానాలయము నుంచుట స్థిరమయ్యెను.

కాని యప్పుడైనను పనులు వెంటనే యారంభము కాలేదు; రామ్సేగారియంచనాఖర్చు నింకనుతగ్గించుటకు భారత

* బొంబాయియంత పెద్దదికాదు కాని, బెంగుళూరును మూడులక్షల జనసంఖ్య గలిగి, ఇంకనువృద్ధియగుచున్నది. ఇందుకొంత (కంటోన్మెంటు) బ్రిటిషుపాలనమందు, మిగిలినది మైసూరుప్రభుత్వపు పాలనలోను, ఉన్నది. ఇది యూరపియనులకు భారతీయులకు గూడ ఆరోగ్యప్రదము. 'రాయల్ సొసైటీ' ప్రపంచపు విఖ్యాతవైజ్ఞానిక సంఘములలో నొకటి; దీనికార్యస్థానము లండనులోనుండును.

ప్రభుత్వమువారొక కమిటీ నేర్పఱచిరి. ఆకమిటీవారు కొన్ని సందేహములదెల్పిరి; భారతప్రభుత్వమెంత యిచ్చునదియు తేలలేదు; ఇట్లు కాలహరణమగుచుండెను. తాతా యీలోగా జబ్బుపడుచుండెను; ఆయన స్వయముగ లండనువెళ్ళి, అచట రామ్సేగారితోను భారతమంత్రితోను చర్చించి, వారిచే మనప్రభుత్వమున కావిషయమై తొందరకల్గించెను. 1903 లో నటనుండి మనదేశమునకు తిరిగివచ్చి, తాతా మరల నిచ్చటి ప్రభుత్వాధికారుల బ్రోత్సహించెను. అంతట మనప్రభుత్వమువారు కొంత స్థిరసహాయమును చేయుదుమని ప్రచురించిరి. ఇట్లు వివరముల విమర్శ జరుగుచుండగా, 1904 మే నెలలో జంషెడ్జీ కాలధర్మ మొందెను.

కాని యాయన కుమాళ్ళగు దొరాబ్జి రత్నజీతాతాలు పితృవాక్యపాలన జరిగింప నిశ్చయించిరి; 30 లక్షలరూపాయలు అప్పటికిమ్మతుగ తేల్చిన (బొంబాయిలోని) తనమహాభవనములను జంషెడ్జీ యీవిజ్ఞానాలయమునకై యిచ్చుటకు నిర్ణయించి యుండెను. ఆప్రకార మాధర్మము జరుపుట కాయాస్తులను ప్రభుత్వాధికారులకు దఖలుపర్చుచు, దొరాబ్జి రత్నజీలు 1905 లో దఖలుపత్రము వ్రాయించియిచ్చిరి.

అంతట నియంతకై కొంతయత్నము జరిగి, రాయల్ సొసైటీసభ్యుడు, రామ్సేకు సహకారి, సుప్రసిద్ధ వైజ్ఞానికుడు నగు ట్రావెర్సుపండితు డావిజ్ఞానశాలకు డైరక్టరు(=నియంత)గ

రప్పింపబడెను. దానికి 'ది ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్' (=భారతీయవిజ్ఞానాలయము) అని పేరుపెట్టిరి. తరువాత కొన్ని వివరముల గూర్చి 'ట్రావర్సు' గారికిని మనప్రభుత్వమువారికిని తగవువచ్చి, కొన్నియేండ్లు చర్చజరిగెను. తాతాగారిచ్చిన యాస్తులవలన సాలినా ఆదాయము రు 125000 మాత్రముం డునని ప్రభుత్వప్రతినిధు లంచనావేసిరి; మైసూరుప్రభుత్వము సాలినా రు 50000 ఇచ్చును; ఈరెంటిలో సగము అనగా రు 87500 సాలీనాయును భవనాదులకై ఒకసారిగ రెండున్నర లక్షలును భారతప్రభుత్వమిచ్చుటకు తుదకు నిర్ణయమయ్యెను. అంతట 1911 వ యేట కార్యక్రమ మారంభించిరి. జీవరసాయ నవిద్య, విద్యుచ్ఛక్తి, వైద్యశాస్త్రము, సాంకేతికవిద్య, తత్వ శాస్త్రము, ఈశాఖల నేర్పర్చి, అందు పరిశోధన లారంభించిరి. అవసరమగు యంత్రపరికరములు, భవనములు, గ్రంథభాండా రము, సిద్ధముచేయబడెను.

ప్రభుత్వముతో నభిప్రాయభేదము కలిగి, ట్రావర్సుగారు త్వరలోనే యిందుండి వెడలిపోయిరి. తరువాతవచ్చిన డైర క్టర్లు, గొప్పపరిశోధకులుకారు; వారు సాధారణముగా మనప్ర భుత్వశాఖనుండి వచ్చిన యూరపియనులు; మామూలు నిర్వ హణమందేగాని, విజ్ఞాన పరిశోధనలందు వారికంతగా ప్రజ్ఞలేదు; భవనాదులకే చాలసొమ్ము ఖర్చగుచుండెను. మొదట నాశించి నంత విజ్ఞానకృషి జరుగలేదని కొంతకాలముకు గుసగుసలు బయలుదేరెను.



భారతీయ విజ్ఞానాలయము (బెంగుళూరు).

84A

యువకులకు కొంత యసంతృప్తికలిగి, 1922 లో ఒక కమిటీద్వారా కొంతవిచారణ జరిగెను. కార్యక్రమమున కొన్నిమార్పులజేసిరి; అంతట యూరపియను ఉద్యోగులసంఖ్య కొంత తగ్గెను; మనదేశీయపరిశోధకుల సంఖ్య హెచ్చి, తరువాత క్రమముగా అభివృద్ధికలిగెను. ఇప్పుడు పరిశోధనలు, జ్ఞానార్జన, బాగుగ జరుగుచున్నవి. ఆశాఖలం దిచ్చుట గల పరిశోధనావకాశములు మనదేశమందింకెచ్చటను లేవు. ప్రసిద్ధవైజ్ఞానిక గ్రంథములు విజ్ఞాన పత్రికలన్నియు వివిధ పరిశోధన యంత్రములు నిచ్చటదొరకును.

వైజ్ఞానిక విషయములందును పరిశ్రమలగూర్చి ప్రభుత్వముకు పారిశ్రామికులకు నిండు సహాయముచేయబడును. ముఖ్యముగ మైసూరు రాష్ట్రపుపరిశ్రమల క్రిందలిపరిశోధనలచే చాల లాభముకల్గినది. అనేకవిధములగు ముడిదినుసులు, యంత్రనిర్మాణము, వస్తుతత్వము, వీనినిగూర్చి, ఇందనుకూల పరిశోధనలు జరిగినవి. వాని ఫలితముగ మైసూరులో ప్రశస్తమగు సబ్బుబిళ్ళలు, చందనపుతైలము, గట్టికర్రల పిండిజేయు విధము, అల్యూమినం, గంధకం, సోడియం మున్నగు రసాయన వస్తువుల జేయుట, విద్యుచ్ఛక్తి యుత్పత్తి, పెన్సిలులుమున్నగు వాని తయారు, వీనికి చౌకయగు వైజ్ఞానికపద్ధతులు కనిపెట్టబడి, అందుల కర్మాగారము లీ విజ్ఞానాలయపు సహాయమున నిర్మింపబడినవి.

ప్రజ క్షేమముగోరు మైసూరుప్రభుత్వమువారు స్వయముగనే యిట్టిపరిశ్రమలను, పట్టు, ఇనుమును న్నగు వానిని గూడ, స్థాపించి జరుపుచున్నారు; ఆపరిశ్రమ లిప్పుడు వేల కొలదిజనులకు జీవనాధారమైనవి. విజ్ఞానాలయమునకు ఇట్లు మైసూరుప్రభుత్వమువారు దూరదృష్టితో ద్రవ్యసహాయముచేసి, దానిని బెంగుళూరిలోనే స్థాపింపజేయుట, మైసూరురాజ్యమునకు విశేష లాభకరమయ్యెను.

ఇటీవల, ఈవిజ్ఞానాలయపు యూరపియను డైరక్టరిందుండి వెడలిపోగా, దీనిసలహాకమిటీవారి శిఫారసుపైన, 1933 సం॥లో ఆచార్య సి. వి. రామనుగారు దీనిడైరక్టరుగ నియమింపబడిరి. రామను గారప్పటికి కలకత్తా విశ్వవిద్యాలపు విజ్ఞాన శాలాశాలలో ఫిజిక్సు అనగా భౌతికశాస్త్రశాఖలో ప్రధానాచార్యులుగనుండిరి. ఆయనగొప్పపరిశోధకుడై, నూతనావిష్కారములు జేసి జగద్విఖ్యాతుడయ్యెను. ఆయన యాజమాన్యమున ఈవిజ్ఞానాలయమున భౌతికశాస్త్రశాఖగూడ చేర్చబడి, క్రొత్తపరిశోధనలు విశేషముగ చేయబడుచు, నూతనోత్సాహముతో కార్యక్రమము జరుగుచున్నది. ఇప్పుడు నిర్వహణము మితవ్యయముతో సమర్థతిని జేయబడుచున్నది. పాశ్చాత్యదేశములందే యిదివరలో లభించు విజ్ఞానబోధను, అంత వ్యయప్ర

యాసలక్కర లేకుండ, ఇప్పటికి 300 మందికిపైగా భారతీయులీవిజ్ఞానాలయమందే పొందియున్నారు. వారిలో కొందర నేకపరిశోధనలగూడ చేసియున్నారు*

---

* ఈవిజ్ఞానాలయ మేర్పడినంతటు, ఇంకొక విజ్ఞానకళాశాలను భారతీయుల యాజమాన్యమందే స్థాపించుటకు కొందరు బంగాలీ లుద్దేశించిరి. దాని ఫలితముగ కలకత్తాలో న్యాయవాదిప్రముఖుడగు శ్రీతారకనాధపాలితుగారు 15 లక్షల రూపాయలను, శ్రీరాసవిహారిఘోషుగా రొకసారి పది లక్షలను మరల మరికొంతసొమ్మును, కొందరంతటు కొంత భూవసతిని, కలకత్తాలో విజ్ఞానకళాశాల స్థాపనకై యచ్చటి విశ్వవిద్యాలయమున కిచ్చిరి. ఆకళాశాలలో భారతీయులద్వారానే యున్నతవిజ్ఞానబోధ జరుగవలెనని నియమ మేర్పడెను. సుప్రసిద్ధరసాయనాచార్యులు అనేకపరిశ్రమల నడిపిన నిపుణులు నయిన శ్రీప్రఫుల్లచంద్రరాయలు దీని నియంతగా నేర్పడిరి. భవనాదులకు విశేషముగ సొమ్ము ఖర్చుకాకుండ, ఆయన మితవ్యయముతో నాకళాశాల నారంభమునుండి జయప్రదముగ నడిపిరి. ఇందు విజ్ఞానపరిశోధనజేసిన యనేక యువకు లన్యదేశములందును ప్రసిద్ధిజెంది, స్వతంత్రపరిశోధకులు ఆచార్యులునై ఉన్నతోద్యోగముల నలంకరించిరి. వారి యావిష్కారములలో కొన్ని పరిశ్రమలకును సహాయకములైనవి. ఇందు కృతార్థులైన యువకులు రాయిగారు నడిపించు 'బెంగాల్ కెమికల్ అండ్ ఫర్మసిటికల్ వర్క్స్'లో వివిధరసాయనవస్తువులను పాశ్చాత్యౌషధములనుగూడ కలకత్తాలో చౌకగ తయారు చేయుచున్నారు. ఇప్పుడు బెంగుళూరులో నియంతగానున్న చంద్రశేఖర వెంకటరామనుగా రాకళాశాలలోనే సుమారు 15 ఏండ్లు పరిశోధనల జేసి ఖ్యాతిగాంచిరి; అచటి మితవ్యయపద్ధతుల ప్రకారమే, బెంగుళూరి విజ్ఞానాలయమును రామనుగా రిప్పుడునడుపుచున్నారు.

---

## 12. లోహయంత్రశాల.

జంషెడ్జి తాతా తన అంత్యకాలమునకు ముందు మరి రెండు పెద్దపరిశ్రమలగూడ స్థాపింపయత్నించెను: అందొకటి మంచియినుమును, ఇనుపవస్తువులను జేయుట; రెండవది జలపాతమూలమున విద్యుచ్ఛక్తిని తయారుచేసి, దానిని చోదకశక్తిగను, దీపాదులకును, వినియోగించుట. బొంబాయిలోని మిల్లు పరిశ్రమ పరాధీనత లేకుండ, వీలైనంతవరకు నిరాఘాటముగ సాగవలెనని, ఆయనగాఢముగకోరెను. మిల్లులను ఇతర పరిశ్రమలను స్థాపించుటకు వలయు యంత్రములన్నిటిని, చాల వ్యయప్రయాసలకులోనై, మనమితరదేశములనుండియే తెప్పించుకొనవలసి వచ్చుచున్నది. సూది, గుండుసూది, మంచిచాకులు, మేకులు ఉక్కుతీగలు మున్నగు నిత్యావసరమగు చిన్నపనిముట్లుగూడ తరుచు విదేశములనుండియే తెచ్చుకొనుచుంటిమి. ఇవి మనదేశమందే తయారు కావలెనన్నచో, మంచియినుము ఉక్కు సమృద్ధిగ తయారుచేయవలెను. మరియు బొంబాయిలో మిల్లులు మున్నగుయంత్రములకు చోదకశక్తినిచ్చు నేలబొగ్గు చాలదూరమునుండి రావలెను. అది సమృద్ధిగ సకాలమునకు దొరుకకను, రాణిగంజి ప్రాంతమునుండి రైలుపై దెచ్చుటకు వ్యయప్రయాసలు హెచ్చుట వల్లను, బొంబాయి పరిశ్రమలకు చిక్కు గల్గుచుండెను. అందువలన తాతా బొంబాయికి సమీపమగు

సహ్యాద్రిలో జలపాతముగల్పించి, దానితో విద్యుచ్ఛక్తి జనింప జేసి, దాని నీయంత్రాగాల కుపయోగింపదలచెను.

ఈరెండు మహాపరిశ్రమలను ఆయన తలపెట్టినను, 1904 లోనే యామహనీయుడు మరణించుటచే, తానేవానిని స్థాపించి జరుపుటకు వీలుకలుగలేదు. ఆయన కోరికప్రకారము వాని నాయనపుత్రులు పూర్తిచేసి నిర్వహించిరి*

ఆధునిక నాగరికత అయోమయము. అయఃపరిశ్రమ తోనే గొప్ప మరఫిరంగులను, గుండ్లను, శస్త్రములను, గొప్ప యుద్ధనౌకలను తయారుచేసి, పాశ్చాత్యజాతులు, జపానీయులు, బలీయులైరి. ఇంజనులు, రైలుపట్టాలు, కత్తులు, మేకులు, మరలు మున్నగు పనిముట్లును ఇనుపవే. ఇనుపవస్తువుల వాడుక యింకను హెచ్చుచున్నది. ఇటీవల గొప్ప భవనములు, వంతెనలు, భద్రమగు పెట్టెలు, పనిముట్లు, మున్నగువానికిని క్రమముగా కర్రకు బదులు యినుమునే వాడుచున్నారు.

* జంషెడ్జితాతా కథలో, ఈరెంటి వివరణ మవసరముకాదని కొందరికి తోపవచ్చును. కాని ఈరెండుపరిశ్రమలు మనదేశము కత్యావశ్యకములని, వానిని స్థాపించి లాభకరముగ సాగింపవచ్చునని, జంషెడ్జితాతాయే కనిపెట్టెను; దృఢవిశ్వాసముతో, వానిని సాధించుటకై, అనేక సంవత్సరములు పరిశోధనలజేసి, విశేషవ్యయముతో అనేకప్రాంతముల బరీక్షించి, దూరదృష్టితో సాధనకలాపముల సిద్ధముజేసి, మార్గదర్శకు డయ్యెను; తనకుమాళ్ళకును, అంతరంగమిత్రులకును సాధనసామగ్రినంతను నొప్పగించి, వారికి కార్యదీక్ష కల్గించెను; అందువలననే ఆపరిశ్రమలు జయముగాంచగల్గెను. అందుచే జంషెడ్జితాతాయే ఆపరిశ్రమల స్థాపనకు కారకుడని యెంచవలెను.

పూర్వము, మనదేశమున లోహపరిశ్రమ వృద్ధిలో నుండెను. ఇచటి యినుపఆయుధములు దేశాంతరములందును ప్రసిద్ధిజెందెను. చిరకాలమునుండియు మనదేశమున నేటికిని చెక్కుచెదరకయున్న 'కుతుబ్ మినారు'ను బోలుకట్టడము లద్భుతములు; అవి మన పూర్వీకుల లోహశిల్పమునకు నిదర్శనములు. కొన్ని ఖడ్గములుమున్నగు వివిధశస్త్రములు విదేశములకు చాల యెగుమతి యగుచుండెను.

ఆపరిశ్రమ 18 వ శతాబ్దివరకు జరుగుచుండి, అంతట నితరపరిశ్రమలవలె క్షీణించినది. పాశ్చాత్యు లీరెండు శతాబ్దులలో తమవిజ్ఞానమువృద్ధిజేసుకొని, గనులనుండి భస్మముతీసి శుద్ధిజేసి, లోహపరిశ్రమలో నవీనపద్ధతులగనిపెట్టి, వివిధయంత్రములను పనిముట్లను యంత్రసహాయమున చౌకగచేయదొడగిరి. వాని దిగుమతిచే, పోటీవలన, మనలోహపరిశ్రమ క్రమముగ మూలకొదిగెను. రైళ్ళువచ్చిన మీదట విదేశపు లోహవస్తువులు మనదేశమున మూలమూలలకు గూడ వ్యాపించెను. అంతట మన లోహపరిశ్రమలడుగంటెను. ఇక పురాతన పద్ధతులతో నీదాడి నెదుర్కొనుట సాధ్యముకాదు.

కర్రబొగ్గుతో కొలుములద్వారా ఇనుపపొడిని కరగించు పూర్వపద్ధతి లాభకరముకాదు. పాశ్చాత్యదేశములందువలె వైజ్ఞానిక పద్ధతినే గనులనుండితీయుయినుపపొడిని నేలబొగ్గు నిప్పుతో బాగుగ కాచి, కరగించి, సున్నముతో శుద్ధిచేసి, పోతపోసి,

ఉక్కును పనిముట్లను తయారుచేయవలెనని, జంషెడ్జి నిశ్చయించెను. అట్లుపెద్దయెత్తున చేసిననే, అవి ప్రశస్తములై, చౌకగ గిట్టుబాటగును. ఇందుకు నేలబొగ్గు, ఇనుము, సున్నము, ఈమూడింటిగనులు సమీపముగనుండి జలవసతిగూడ గల ప్రదేశమవసరము. ఈవస్తువులు బలువువి. ఆగనులు పరస్పరము దూరమందుండిన లాభములేదు; మరియు అవి సమృద్ధిగలేకున్న పెద్దయెత్తున చౌక యగునట్లు తయారుచేయ వీలుండదు.

ఈదేశమున నట్టి సన్నివేశ సౌకర్యములుగల గనులులేవని, అందువలన పెద్దఅయఃపరిశ్రమ సాధ్యముకాదని, మనదేశపు ప్రభుత్వోద్యోగులు భూతత్వజ్ఞులుగూడ తలచుచుండిరి. కాని టాటా అట్లెంచలేదు. ఈదేశమందు తయారైన పూర్వపులోహవస్తువు లుండుట బట్టియే, అట్టిసౌకర్యములు మన దేశమందుండి తీరునని, సరిగ వెదకినచో అట్టిగనులు దొరకుననియు, ఆయనకు దృఢవిశ్వాసముండెను. ఇందునుగూర్చి ప్రచురితమగు గ్రంథములన్నిటిని, కరపత్రములనుగూడ, ఆయన యెప్పటి కప్పుడు, తెప్పించిజాగ్రత్తతో పరిశీలించుచుండెను.

మనదేశపు మధ్యరాష్ట్రమున చందాజిల్లాలో లోహగనులు కలవు; వానినిగూర్చి 'హాన్ స్వాక్' అను జర్మను వైజ్ఞానికుడు వ్రాసిన వ్యాసమును మనప్రభుత్వమువారు 1882 లో ప్రచురించిరి. అప్పుడు జంషెడ్జి మధ్యరాష్ట్రమున బట్టలమిల్లుకనువగుస్థలముకై తిరుగుచుండెను; వెంటనే యావ్యాసమును చదివెను.

అచట 'లోహార' యనుచోట లోహఖనియు, సమీపమున 'వరోర' లో నేలబొగ్గుగనియు కలవని, కానివానిని పనిచేయుటకు ప్రతిబంధముకలదనియు, అందు తెలుపబడెను. జంషెడ్జి వెంటనే యాలోహముకు బొగ్గుకు మచ్చులనుతీసుకొని వెళ్ళి, వానిని స్వయముగ జర్మనీలో గొప్పలోహయంత్రశాలలందు వైజ్ఞానికముగ పరీక్షచేయించెను. వానితో మంచియుక్కు తయారగునని తేలెను. వెంటనే స్వదేశముకుతిరిగివచ్చి, ఆయన మధ్యరాష్ట్రపు గవర్నరగు మారిసుదొరగారితో మాట్లాడి, ఆగనులస్థలములను, ఆప్రాంతమందున్న 45 మైళ్ళ బ్రాంచిరైలు లైనునుగూడ తనకు కవులుకిమ్మని కోరెను. (బలువగు నావస్తువుల జేరవేయుటకారైలులైనుకూడ అవసరము.) ఎంప్రెసుమిల్లు స్థాపకుడై మధ్యరాష్ట్రముకు మహోపకారముచేసిన తాతాయందు గవర్నరుకు గౌరవమే; కాని భారతప్రభుత్వమువారా రైలులైను నెవ్వరికిని కవులుకిచ్చుటకు నిరాకరించిరి. అందుచే నాప్రయత్నమంతటితో నిల్చిపోయెను.

కాని, తాతాయధైర్యముజెందక, తరువాతగూడ లోహపరిశ్రమకై పరీక్షలజేయుచునే యుండెను. లోహతత్వజ్ఞులతో నావిషయమును వీలైనప్పుడెల్ల చర్చించుచుండెను. 1899 లో 'మాహన్' అను ప్రభుత్వసేనాని యొకడు మనదేశమున లోహపరిశ్రమజేయుట కవకాశములగూర్చి యొక రిపోర్టును ప్రచురించెను. 'ఝరియా' ప్రాంతమున నినుముచేయవచ్చునని, అందుకు

సున్నపురాళ్ళు మాత్రము బర్మానుండి తేవలెనని, అందు వ్రాయబడెను. ఈరిపోర్టును వెంటనేచదివి, జంషెడ్జి మరలతీవ్రకృషి నారంభించెను. గనులకు ప్రభుత్వమువారిచ్చు కవుళ్ళవిషయమై యప్పటికి గనులలోనుండిన నియమములతికఠినములై యుండెను. 1899 లో, అంకుప్రతిబంధకమైన షరతులు తగ్గింపబడినవి. అంతట గనులపని కొంతసుకరమయ్యెను. జంషెడ్జి 1900 సం॥లో నింగ్లండునకువెళ్ళి, అచట భారతమంత్రియగు హామిల్టను ప్రభువుతో లోహపరిశ్రమస్థాపించుటకై తానుచేయు యత్నముల గూర్చి చెప్పి, ఆయనసానుభూతిని సంపాదించెను. 1882 లో వలెగాక, ఈసారిప్రభుత్వము వారతనికి సాయముచేయగలరని, హామిల్టనుగారు వాగ్దానముచేసిరి.

అంతట స్వదేశమునకు తిరిగివచ్చి, జంషెడ్జి చందాజిల్లాలోని 'లోహార' గనుల కవులకై మరలదరఖాస్తునంపెను. ప్రభుత్వమువారీసారి యనుకూలభావము దెల్పిరి; కాని చాలవివరములగూర్చి దీర్ఘవిచారణ, ముందుగాపరిశోధన, కావలెనని తెల్పిరి. 1902 వేసవిని తాతా మరల బ్రిటనునకుచని, ఆలస్యము లేకుండ జేయుమని భారతమంత్రితో ప్రశంసింపదలచెను. అప్పుడు విక్టోరియా మరణానంతరము, 7 వ ఎడ్వర్డురాజుగారి పట్టాభిషేకోత్సవపు ప్రయత్నములు జరుగుచుండెను; ఆతొందరవలన భారతమంత్రికి తీరికలేకుండెను. అంతట నింగ్లండు జర్మనీల బొగ్గుగనులను, అచటి యుక్కుయంత్రశాలలను బరీక్షించి, తాతా యమెరికాకు చనెను.

అందు సంయుక్తరాజ్యమున లోహపరిశ్రమ చాలవృద్ధిలోనున్నది. అచటినిపుణులతో మాట్లాడి, ఆయన వారిపరిశ్రమపద్ధతుల గమనించెను; అటనుండి తనకుమారునికి వ్రాసి, మనదేశమున గనులపరీక్షను జరిగించుచునే ఉండెను. లోహఖనిజములగూర్చియే గాక, అమెరికనుల బట్టలమిల్లుల గూర్చియు, విద్యుచ్ఛక్తిశాలలగూర్చియు, ఆయాత్రలో తాతా చాల సంగతుల గ్రహించెను. అమెరికాలో నయాగరా జలపాతమునుండి విద్యుచ్ఛక్తిని పుట్టించుపద్ధతుల జూచెను. పిట్సుబర్గు పురమున ప్రపంచమంతటికి పెద్దవగు లోహయంత్రములుగలవు. ఆపరిశ్రమకు నాయకుడగు 'కన్నడి' తో కొన్నిసమస్యలజర్చించెను. ఆయన మంచిసలహాలనిచ్చెను. ఆయన సలహాపైన 'పెరిను' అనుమహనీయుడగు విజ్ఞుని న్యూయార్కునగరమున కలుసుకొని, ఆయనను చాలహెచ్చుజీతముపైన తనలోహపరిశ్రమ పరీక్షకు ముఖ్యోద్యోగిగ జేసెను. పెరినుగారు మెటలర్జికల్ ఇంజనీరింగ్ అనబడు లోహవాస్తుశాస్త్రమున నిధి. ఆయనసహచరుడగు 'వెల్డు'గారు వెంటనే ముందుగా మనదేశమువచ్చి, ఆయాస్థలముల భూతత్వము బరీక్షింపసాగెను.

ఈలోగా అమెరికాలో పనియైనంతట, తాతా లండనుకువచ్చి, భారతమంత్రితో మాటాడి, అటనుండి జర్మనీవచ్చి, బొంబాయిలో తానుకట్టెన 'తాజ్ మహల్ హోటలు' కవసరమగు ఎలెక్ట్రికువస్తువు లన్నిటిని జర్మనుశాలలందు వెదకికొని, 1902 డిసెంబరులో మరల స్వదేశము చేరెను.

బొంబాయి రాగానే, జ్యేష్ఠపుత్రుడగు దొరాబ్జిని మిత్రులను కలుసుకొని, జంషెడ్జితాతా ఆయాపరిశ్రమలగూర్చి విదేశయాత్రలో గ్రహించిన క్రొత్తసంగతులను, చేసిన పనులను, వారికి తెలిపెను. కొంతకాలమునుండి అస్వస్థతతోనున్న జంషెడ్జి యీనిరంతరకృషిచే నింకను జబ్బుపడెను; ఆయన మనశ్శక్తిమాత్రము పోలేదు. కుమారునికిని ఆయాపరిశ్రమలయుద్యోగులకును ఆయన అమూల్యములగు చాల సలహాల నిచ్చెను. తన విదేశానుభవములను వారికి తెలిపి, తానాపరిశ్రమలకై సేకరించిన సామగ్రులను వారి కందజేసి, వారికి కార్యదీక్ష కల్గించెను.

దొరాబ్జి తాతాకు మేనమామకొడుకగు షపుర్జి సక్లత్వాలా అను ధీశాలియగు యువకు డిదివరలో జంషెడ్జీతో తిరిగి, చందాజిల్లాగనులం దనుభవము గల్గియుండెను.* ఆతడు,

* ఈసక్లత్వాలా లోహపరిశ్రమస్థాపనలో తాతాకంపెనీకి చాలసాయము చేసెను. తరువాత ఈయన ఈకంపెనీవారి లండను కార్యస్థానమున పనిచేయుచు, ఆంగ్లస్త్రీని పెండ్లియాడి, ఆంగ్లదేశమందే యుండెను; దరిమిలాను బ్రిటిషు కార్మికోద్యమమున పాల్గొనుచు, తీవ్రభావములుగల కమ్యూనిస్టు (సామ్యవాది) ఆయెను. సామ్యవాదము కాపిటలిజమునకు (పుంజీపతిపద్ధతికి) కేవల విరుద్ధము. అందుచే, సక్లత్వాలా తాతాకంపెనీతో సంబంధము వదలుకొని, బ్రిటిషు సామ్యవాదుల నాయకుడుగ పార్లమెంటులో సభ్యుడై కొంతకాలము పనిచేసెను; ఇంగ్లండులో భారతీయులపక్షమున ధైర్యముతో పనిచేయుచు, ఆదేశమున మనదేశీయులకు సాయపడుచుండెను. ఈయన 1935 సాలాఖరున లండనులో చనిపోయెను.

చోరాబ్జి, వెల్డుదోర, ఈముగ్గురును మధ్యదేశమున ఒరిస్సా ప్రాంతమున కొండలలోను అడవులలోను గనులకై తిరుగుచు, తీవ్రముగ పరిశోధనజేసిరి. అందుచాలచోట్ల రోడ్డు, సరియగు దారికూడ, లేకుండెను. కొన్ని ప్రదేశములందు త్రాగుటకు నీళ్ళు లేవు. పులులు మున్నగు భీకరమృగము లందందు తిరుగుచుండె ను. రాత్రులం దొకప్పుడు కొండనేలను, ఒకప్పుడు తమ యెడ్ల బండిలోనే, వారు నిద్రించుచుండిరి, ఇట్లు సంచరించుచు ఆయా ప్రాంతముల భూతత్వమును శ్రద్ధతో బరీక్షించిరి.

చందాలో ఇనుము సున్నపురాళ్ళు నుండెను; కాని అప్పటికి 'వరోరా' గనిలోని బొగ్గు అడుగంటెను. అందుచే, దగ్గరనున్న 'బెల్లారపు' బొగ్గుగనికై వారు దరఖాస్తుపెట్టిరి. ఆబొగ్గు ప్రభుత్వముకే యవసరమని, దాని కేవ్యక్తులకును లైసన్సు నీయవీలులేదని, ప్రభుత్వమువారు తెల్పిరి. ఆప్రాంతపు లోహమును ఒకేచోట సమృద్ధిగ లేదు. కనుక చందాజిల్లా లోని గనులను తుదకు వదలుకొనవలసివచ్చెను. ఈపరీక్ష లన్నిటికై, అప్పటికి జంషెడ్జికి 5 లక్షల రూపాయలు వ్యయ మయ్యెను.

అంత నాయంధకారబంధురస్థితిలో హఠాత్తుగ వారికొక జ్యోతి కనబడెను. 'ప్రమథనాథవసు' అను ప్రతిభాశాలియగు బెంగాలి భూతత్వజ్ఞుడు ప్రభుత్వోద్యోగవశమున అనేకప్రాంత ముల భూమిస్వభావమును శ్రద్ధతో బరిశీలించి యుండెను.

ఆయన ఓఁఛ ప్రాంతపు 'ధల్లి, రాజహర' కొండలందు ప్రశస్త మగు నినుము సమృద్ధిగ కలదని, 1887 లోనే యొక ప్రభుత్వపు రిపోర్టులో వ్రాసియుండెను. 1904 లో తిరిగి తిరిగి వేసారి యేమి యు తోచక, మనత్రిమూర్తులు నాగపురముజేరి, అందలి గ్రంథాలయములోనికిబోయి, కాలయాపనకని అందు బూజుపట్టిన యొకపుస్తకమునుతీసిరి. అది వసువురిపోర్టేయగుట తటస్థించెను. దానిని చదివి యచ్చెరువొంది, వారు ముగ్గురును ఆకొండల యొద్దకు తక్షణము పోయి, పరీక్షించిరి; వెంటనే యాగనుల పని కై ప్రభుత్వమునుండి లైసెన్సు బొందిరి. ఆకొండల దృశ్య మత్యద్భుతము; ఆప్రాంతమంతయు అయోమయమే. ఆయినుము చాల ప్రశస్తము పరిశుద్ధముగ నుండెను. 'ఝరియా' బొగ్గు గనులును దీనిసమీపమందే యున్నవి. వెంటనే, ఆయినుము బొగ్గుల మచ్చుల దీసికొని, వానిని వా రమెరికాకు పరీక్షకై పంపిరి. వానితో ప్రశస్తమగు ఉక్కు తయారగునని యా పరీక్షచే తెలియవచ్చెను.

కాని యాప్రాంతమున నీరులేదు. పెద్ద యినుపకార్ఖానాలు పనిచేయునప్పుడు, అందలి బ్రహ్మాండమగు కొలుముల వేడిని తగ్గించుటకు, సంతతము నీరు పోయుచుండవలెను. అచట నది మొదలగు నీటివసతి లేనందున చిక్కుకలిగెను. ఇంతలో, అమెరికానుండి 'పెరిను'గా రచటకు చేరిరి. జంషెడ్జితాతా 1904 మే నెలలో చనిపోయినను, ఆయనకుమాళ్ళు విడువక,

తండ్రి యుద్దేశించిన పరిశ్రమల నడుప నిశ్చయించిరి; జంషెడ్జికి కార్యదర్శిగనుండిన బర్జోర్జిపాద్షాయు వారి నుత్సాహపూరితుల జేసి, బొంబాయిలో కేంద్రకార్యాలయమునుండియే పనులన్నిటిని చక్కబెట్టుచుండెను.

ఈయినుపగనుల గనిపెట్టిన ప్రమథనాథు డప్పటి కుద్యోగకాలముతీరి, ఆసమయమున నోర్థప్రాంతమందే, 'మయూరభంజి' సంస్థానములో దివానుగా నుండెను. ఈవిచిత్రసంఘటనమువలన, తాతాకంపెనీవారి ప్రయత్నముసంగతి యాయనకు తెలిసి, మయూరభంజి సంస్థానములో నింకను నత్యుత్తమములగులోహగనులు కలవని, వానిని సులభముగ పనిచేయవచ్చునని, అందుకు మహారాజుచేత నవసరమగు కవుళ్ళనిప్పించెదననియు, ఆయన తాతాకంపెనీకి వ్రాసెను.

పెరినుగూడ వారిని చేరినందున, ఆచతుష్టయమును రాజుగారి యాహ్వానముపైన, మయూరభంజిరాజ్యముకుజనిరి. ఈరాజ్యము సుమారు 4000 చదరపుమైళ్ళుండును. దాని మధ్యను విశాలమగు మహాటవులతో నిండి వనగజములతో సంకులమగు వేయిమైళ్ళ కొండభూమి కలదు. వారాగహనములందు జొరబడి, దిగ్భ్రమజెందుచు ప్రమథనాథుడు దోవ చూపిన ట్లెల్ల బోవుచుండిరి. చాలదూరమువర కంతయు నగమ్యాగోచరముగ నుండెను. అప్పుడు వారికి మూడువేలయడుగుల యెత్తగు 'గురుమైశిని' గిరి ప్రత్యక్షమయ్యెను. దానిని

చూడగనే వారి కపరిమితానందము కలిగెను. అది పాదా దిశిరఃపర్యంతము లోహమయమే; ఎటుజూచినను అన్ని ప్రక్కలను పెద్ద ఇనుపకొండలు, ఆకొండలే కొన్నియేండ్ల పనికి చాలును. ఆనెపుడ నింకను నిట్టిగనులు కొండలు గలవు. లో గడజూచిన 'ధల్లి, రాజహర' గనులకన్న గూడ నివి చాల ప్రశస్తములు; వానికన్నను ఇవి బొగ్గుగనులకు సముద్రమునకు దగ్గరవి. సమృద్ధిగ మంచి యినుము తయారైనచో, దాని నిట నుండి 150 మైళ్ళ లోపుననున్న కలకత్తారేవుద్వారా విదేశములకు గూడ నెగుమతి చేయవచ్చును. ఇట్టి సౌకర్యఘటనము దుర్లభము. ఇరువదిమైళ్ళ విశాలమగు యీగనుల ప్రాంతమం తను వెంటనే తాతాకంపెనీవారు మయూరభంజిసంస్థానమునకు న్యాయమైన రాజాంశమిచ్చుపద్ధతిని, వసువుగారి ద్వారా ఆమహారాజుగారివద్ద కవులుకు తీసుకొనిరి.

ఈగనులను ఇంగ్లండు అమెరికాలలోవలె పెద్దయెత్తున లాభకరముగ పనిచేయుటకు, చాల మూలధనము, గొప్ప నిపుణుల సహాయమును, కావలెను. అట్టిపరిశ్రమ లింతవరకు మన దేశమునలేవు. కావున దొరాబ్జితాతా 1906 లో లండనుకు వెళ్ళి, ఇంగ్లీషు పరిశ్రమల నాయకులను పెట్టుబడి పెట్టుడని కోరెను; అందుకు, వడ్డీయేగాక, వారికి పరిశ్రమలో వాటా గూడ నిచ్చెదననెను. కాని, అట్లును, అచట తగు ద్రవ్య సహాయము లేకపోయెను. ఇట్లు దొరాబ్జి నిరాశుడై, 1907 లో స్వదేశమునకు తిరిగి వచ్చెను.

ఈలోగా మనదేశమున హఠాత్తుగ 'స్వదేశి' ఉద్యమ మారంభించెను. ప్రభుత్వమువారు 1905 లో వంగ రాష్ట్రమును రెండుగా విభజించిరి. ఈవంగభంగమునకు ప్రజ లిష్టపడక, దానిని రద్దుచేయించుటకై తీవ్రముగ ఆందోళన నారంభించిరి. అప్పుడే పాశ్చాత్యమహాసామ్రాజ్యమగు రష్యా ను ప్రాచ్యులగు జపానీయు లోడించిరి. అందుచే భారతీయులలో గూడ ఆత్మవిశ్వాసము, జాతీయోత్సాహమును, ప్రబలెను. పాశ్చాత్యదేశములనుండి దిగుమతియగుచున్న సరుకులగొనుట తగ్గించి, 'స్వదేశీ'య వస్తువులనే కొనవలెనని, సాధ్యమైనంత వరకు పరిశ్రమలను మనదేశమందే స్థాపించుచు, అవసరమగు వస్తువుల నీదేశమందే తయారుచేసుకొనవలెననియు, దేశమం తట నుద్బోధము కలిగెను; విద్యావంతులలో నుత్సాహ ము వ్యాపించెను. ఆయుద్రేకమువలన మనదేశీయులే దో రాబ్జికి తోడ్పడిరి. ఆయన జారీచేసిన ప్రకటనప్రకారము రు. 2,31,00,000 లును భారతీయులనుండియే సమకూడెను. అందుతో "తాతా ఐరన్ అండ్ స్టీల్ వర్క్సు" అను పేర వాటాదార్ల జాయింటుస్టాకు కంపెనీ యేర్పడెను. తాతా కంపెనీవారే దీని నియంతలు; దొరాబ్జితాతా యధ్యక్షుడు, నరోత్తమగోకులదాసు, విఠల్ దాస్ థాకర్సే, కొవాస్జి జహాం గీరు మున్నగువారు డైరక్టర్లును, అయిరి. అందు చాల వాటా లను తాతా బంధుమిత్రులు తీసుకొనిరి.

అంతట తాతాకంపెనీవారీలోహపు కార్ఖానాల గట్టుట కుచితస్థానము వెదకి, తుదకు బిహారురాష్ట్రపు మానభూమిజిల్లాలో, 'సాక్షి' అను కుగ్రామపు స్థలమును నిర్ణయించిరి. ఇది బెంగాలు నాగపుర రైలులైనుకు సుమారు రెండు మైళ్లలో నున్నది. ఆప్రాంతము వనమయము, సుందరము, కొండనేలయునగుటచే, అందు భవననిర్మాణము సుకరము; కావలసినంత విశాలస్థలము చౌకగ దొరకును. ఇది కలకత్తారేవుకు 150 మైళ్లలో నుండును. అచటనే రైలుమార్గ ముండుట యెగుమతికి లాభకరము. అచటి రైలుస్టేషను అగు కలిమాటి* నుండి $2\frac{1}{2}$ మైళ్లును, గురుమైశిని ఇనుపగనులకు 40 మైళ్లును, రైలులైను వేయబడినది. ఈరైలులైనులను తాతాకంపెనీ వారే నడుపుకొందురు. దక్షిణమున ఇనుపగనులు, ఉత్తరమున తూర్పున బొగ్గుగనులు, పడమట సున్నపురాళ్లదిబ్బలు, వీనిమధ్య నీస్థలము జీవనదియగు 'సువర్ణరేఖ' తీరమందున్నది. ఇచట సంతాలులు మున్నగు దృఢగాత్రులగు అడవిజనులు కొద్దిమంది కలరు. వీరిభాష ప్రాచ్యహిందికి ఉపశాఖ; ఇచట యంత్రాలయపు నిర్మాణము 1908 లో ఆరంభించెను.

పవిత్రాండ్రకు వీలైనంతవరకు శ్రమతగుటకై, బలువుపనులన్నిటికి నవీనపద్ధతివగు ప్రశస్తయంత్రములను జర్మనీ, అమెరికా,

---

*ఈస్టేషను పేరు తరువాత 'తాతానగర్' అని, అచటవృద్ధియైనతాతానగరముపేరుగ, మార్చబడినది.

ఇంగ్లండులనుండి రప్పించిరి. లోహకార్యపు యంత్రముల నడుపు కార్మికులు, ఉద్యోగులు, ఇదివరలో నిచటలేనందున, ఆమహా యంత్రములనడిపి అందుసరిగపనిచేయుటకు, వారు రెండువందల మంది తెల్లవారి నుద్యోగులుగ చేర్చుకొనిరి. అందు అమెరికనులు, ఆంగ్లేయులు, జర్మనులు, ముఖ్యులు; కార్ఖానాలగట్టి, పరిశోధించి, యంత్రముల జయప్రదముల నడుపుటకు, వారికి చాలహెచ్చు జీతముల నీయవలసివచ్చెను. వెల్సు అను ఒక యమెరికను కొంత కాలమువరకు ముఖ్యుడగు మేనేజరుగ నుండెను. పెరినుగారే ఇంజనీర్లలో ప్రధాని. వీరిక్రింద పార్సీలు బెంగాలీలు మున్నగు భారతీయులనేకులు మొదటినుండియు ఉద్యోగులుగ పనిచేయుచుండిరి.

ఉత్తరపు 'ఝరియా' మున్నగుగనులనుండి నేలబొగ్గు తెప్పించి యంత్రములలో శుద్ధిజేసి, అందు తయారగు 'కోకు' *తో దక్షిణపు లోహఖనులనుండి తెచ్చుపొడిని బాగుగ కరిగింతురు; ఇచట బ్రహ్మాండమగు ఉక్కుకొలుములందు విద్యుచ్ఛక్తిచే జనించు విపరీతోష్ణముచే నాపొడి ద్రవమగును. దానిని కట్నిప్రాంతమునుండి రప్పించు రాతిసున్నముతో కలిపి, శుద్ధి

* మామూలుకర్రబొగ్గుకన్న నేలబొగ్గుచే నెక్కువ వేడి నిప్పు కల్గును. కాని ఇనుమును కరగించి మంచిఉక్కుగజేయుట కావేడియుచాలదు. అందుచే నేలబొగ్గును ప్రత్యేకయంత్రములందు ముందుగా శుద్ధిజేసి, దానిసారమగు 'కోకు' ను చేయుదురు. దానినిప్పు అత్యుష్ణము; అందుతో ఇనుము బాగుగా కరగించి ఉక్కుచేయవచ్చును.

చేయుదురు; అప్పుడు శుద్ధమగు ఇనుము నీటివలె ప్రవహించును. ఈద్రవలోహమూమహాయంత్రములందు అత్యుష్ణమువలన పాలవలెకళపెళకాగును. ఇంకనుశుద్ధిజేసి, అందుబయలుదేరు బూడిదను వేరుచేయుదురు; మిగిలిన పరిశుద్ధప్రవాహ మొకచోట చేర్చబడి, జాగ్రత్తతో మెల్లగ చల్లార్పబడి, ఇనుమగును. అంతట కొన్నిశాస్త్రీయచర్యలు జరిగినంతట, అది ప్రశస్తమగు ఉక్కగును; అది అనేకవిధములగు పనిముట్లుగ, ఆయాయంత్రములందు మార్చబడును. ఇట్లు అన్నిశాఖల యంత్రములు నమర్చబడి, ఆలోహపరిశ్రమ దినదినవృద్ధినొందెను.

ఈకార్ఖానాలందు రైలుపట్టాలు, పనిముట్లు, రేకులు, స్లీపర్లు, స్థంభములు, దూలములు, మున్నగు చాలరకముల లోహవస్తువులు తయారై, ప్రతిసాలున కోట్లకొలది రూపాయల విలువగల వివిధవస్తువులు విక్రయింపబడును. ఆయావైజ్ఞానిక చర్యలలో ప్రతిదానికి వేర్వేరుగ పెద్దయంత్రములుండును. ఆయా వివిధచర్యలు అతిజాగ్రత్తతో జరిగించబడును. అందుకు ప్రకృతిశాస్త్రమున పూర్ణప్రజ్ఞ, ధైర్యసాహసములు, దక్షత,శిల్పము, కావలెను. ఆయాశాస్త్రములందు వాస్తువిద్యయందు నిపుణులగుటయే గాక, ఆయాశాఖాధికారులు, ఉత్సాహులు, సహృదయులు, దూరదృష్టియుతులుగను, ఉండవలెను.

వివిధశాఖలకు, ఈకార్ఖానాలకు పురమునకును వలయు బలీయమగు విద్యుచ్ఛక్తినంతను ఈకంపెనీవారే తమ ప్రత్యేక యంత్రములందు పుట్టించి, తమకార్ఖానాలకు, నగరమునకుకూడ,

విద్యుచ్ఛక్తి నందజేయుదురు. ఈలోహాయంత్రశాల అమెరికా, ఇంగ్లండు, జర్మనీలలోని నవీనవాస్తువిజ్ఞానము ప్రకారము కట్టబడిన మహాయంత్రములకుకూడ తీసిపోక, సర్వసమగ్రముగ నుండునట్లుగ నిర్మింపబడినది. ఈపనిపూర్తియగుటకు సహజముగ చాలయేండ్లుపట్టెను. ఇప్పుడు టాటా లోహాయంత్రశాల మన ఆసియాఖండమందును, బ్రిటిషుసామ్రాజ్యమంతటను, ఉన్నయన్నిటిలోను గొప్పదని చెప్పుదురు. ఈయంత్రములం దిప్పుడు సాలీనా సుమారు ఆరులక్షల టన్నుల శుద్ధమగు ఇనుము, 570,000 టన్నుల ఉక్కును తయారుచేయవచ్చును. వానిని వివిధవస్తువులుగా చేయు చాలయంత్రములు దరిమిలాను చేర్చబడినవి.

ఇందు తయారైన ఇనుపవస్తువుల చాలఉపకరణము లిప్పుడు దేశమంతటను అమ్ముచున్నవి. ఇందలి ఇనుము ఉక్కు జపాను ఇంగ్లండు మొదలగు ఇతరదేశములకును ఎగుమతియై, ఆదేశముల పరిశ్రమలతో పోటీగా చలామణి అగుచున్నవి. 1914 నుండి జరిగిన ప్రపంచయుద్ధమున మన ప్రభుత్వమువారికి మెసపొటేమియా, ఆఫ్రికాయున్నగు ప్రాంతములకు చాలరకముల యుద్ధసామగ్రులను 1500 మైళ్ళరైలుపట్టాలను 3 లక్షల టన్నుల ఉక్కువస్తువులను ఈకంపెనీవారు సప్లై చేసిరి. ఇందు ప్రత్యేకము సుమారు 40000 కార్మికులు ఉద్యోగులు పనిచేయుచున్నారు. వారిలో రమారమి నూరుమంది ఉద్యోగులు పాశ్చాత్యులు; తక్కినవారందరు భారతీయులే; మరియు, ఈ

తాతాలోహయంత్రములకై బొగ్గు యినుము వగైరాల బావుగనులలో ఇంకను వేలకొలది పనివాండ్రు మధ్యరకపు ఉద్యోగులు భూతత్వజ్ఞులు ఇంజినీర్లు మున్నగువారు పనిచేయుచు, గౌరవజీవనము చేయుచున్నారు.

అభివృద్ధికలినకొలదిని, అవసరమునుబట్టి ఈకంపెనీమూలధనము క్రమముగ హెచ్చింపబడినది. పని బాగుగనున్నప్పుడాకంపెనీకి సాలీనా సుమారు 75 లక్షలరూపాయల లాభముకలుగును. ఒక గొప్పపరిశ్రమజరుగుచున్నప్పుడు, అందునుబట్టి ఇతరపరిశ్రమలకు సహాయముకలుగును. మనదేశపు అనేకరసాయనాదివస్తువులను తమయంత్రకార్యములకై కొనుచును, తమయినుపవస్తువులను ఇంసుజనించు ఉపవస్తువులను దేశీయులకందజేసియు, మనదేశపు ఇతరపరిశ్రమల కీయంత్రశాలవారు సహకారులగుచున్నారు. †

† తాతాకంపెనీవారి లోహయంత్రశాల జయప్రదమగుట జూచి, మైసూరు దివాను విశ్వేశ్వరయ్యగారాసంస్థానమున (ఈకంపెనీ ఉద్యోగుల సహాయముతో) భద్రావతిప్రాంతమున లోహయంత్రశాల నేర్పర్చిరి; ఆ కర్మాగారమున కొన్నిలోపములవలన మొదట సరిగా పనిజరుగక, కొంతనష్టము వచ్చెను; కాని యిటీవల అది బాగుచేయబడి, ఇప్పుడు చక్కగ పనిచేయుచున్నది. ఇప్పుడచ్చట ఉక్కుకార్ఖానా సిమెంటుఫాక్టరీకూడచేర్చి, అందు ఉక్కు సిమెంటుగూడ చేయదలచుచున్నారు. ఇట్లే వంగదేశమందొక కంపెనీవారు రాణిగంజిగనుల బొగ్గుతో దానిసమీపపు ఇనుపగనుల బనిచేయుచు, ఇంకొక లోహయంత్రశాల స్థాపించిరి. దాని యజమానులు ఆంగ్లేయులు; అది తాతావారి యంత్రశాల యంత పెద్దదికాదు; దానికన్ని సౌకర్యములును లేవు.

## 14. జమ్షెడ్పురము.

టాటా లోహకర్మాగారము లోకయటవీప్రాంతమున 'సాక్షి' అను గ్రామమునొద్ద నిర్మింపబడెనుగదా ! అప్పటి కా ప్రాంతమున పెద్దగ్రామముగాని నాగరికసౌకర్యములుగాని లేవు. ఈస్థితిలో టాటాకంపెనీవారికార్ఖానాలు పనిచేయ నారంభించెను; ఆపని యారంభమునుండి కొంద రుద్యోగులును వేల కొలదిని కూలీలును, అచట పనిచేయుచుండిరి. ఆప్రాంతపు 'సంతాలు' లు దృఢగాత్రులే; కాని వారిసంఖ్య చాలతక్కువ. అందువలన సంయుక్తప్రాంతములనుండి, చుట్టుపట్ల జిల్లాలనుండియు,చాలమంది కూలికచట చేరిరి. ఆకార్ఖానాపనులు వృద్ధియైనకొలదిని పనివాండ్రును ఉద్యోగులును హెచ్చిరి. ఇట్లు వేల కొలది జనులు కుటుంబములతో నచట నివసించుటచే, ఆవన మధ్యమందు కొద్దియేండ్లలోనే యతివేగముగ నొక పెద్దనగర మేర్పడెను. అంతవరకచట నాగరికులకేగాక సామాన్యజనబృందమునకు గూడ వలయు వసతులేవియు లేవు.

అందుచే నచట నాయంత్రాలయమునకై చేరిన జనులకు వలయుసౌకర్యములన్నిటి నప్పుడు టాటాకంపెనీవారే యేర్పర్చిరి. ఫాక్టరీల కార్మికులు సాధారణముగా కిక్కిరిసిన యిరుకు తాటాకు గుడిసెలలో నుండుచు, తగు నీటివసతివగైరాలు లేక బాధ పడుచుందురు. జంషెడ్జి టాటా మాత్రము మొదటినుండియు తన యంత్రశాలల కనుబంధముగ కార్మికుల కారోగ్యద

ములు సుఖకరములు నగు రమ్యకుటీరములను శుభ్రమగు విశాలవీథులతో నిర్మించుచుండెను. ఆయనకుమారుడు దొరాబ్జియు మిత్రులగు మిగిలిన డైరక్టరులును ఆ ప్రకారమే యచటి పనివాండ్రకై ప్రత్యేకవసతులతో పేటలనిర్మించిరి; అంతేగాక తక్కినవారి వాసముకొరకును నగరమంతను తామే కట్టించుట యుచితమని గ్రహించి, అందలి యుద్యోగులు మున్నగువారి కిని వీలుగనుండునట్లు సరియగు నేర్పాటులతో, ఆధునికపుర నిర్మాణపద్ధతిని ఒక ప్రత్యేకపురము నంతను నిర్మించిరి. అచట ఖాళీస్థలము సమృద్ధిగ కలదు; అందు 25 మైళ్ళస్థలమున నా నగరము విశాలముగ కట్టబడినది. ఇప్పటికిని అందు 4500 గృహము లీకంపెనీవారివే; అందు పెద్దయుద్యోగుల కనుకూల ముగ పాశ్చాత్యపద్ధతిని చుట్టును తోటలతో బంగాళాభవనముల గట్టి, ఒకపేట నేర్పర్చిరి.* సామాన్యపుజీతగాండ్రగు మధ్యరకపు భారతీయులకు వారి సంసారములకును వీలగునటుల, చక్కని భవనములు మనదేశీయావసరములకు వలయు సౌకర్యములతో గట్టబడి, ఒక చక్కనిపురముగ నేర్పడినది. వీథులు విశాలముగ సరియైన వరుసపంక్తులుగ నుంచబడెను. అచటి సువర్ణరేఖ నది కానకట్టను కట్టించి, దానినీటిని ఎత్తగు మెట్టపైన నిర్మించిన ప్రత్యేకపు చెరువుల కెక్కించి, అందుండి నగరముకంతకు కొళా

* ఇదియే తరువాత 'టాటానగరము' అని పిలువబడుచున్నది. అచటి రైలుస్టేషనుకును 'కలిమాటి' అను పేరుకు బదులు 'టాటానగర్' అని పేరు పెట్టబడినది.

యీాలద్వారా మంచినీ రందింపబడుచున్నది. టాటావారి యంత్ర శాలలందే చాల విద్యుచ్ఛక్తియు బొగ్గుసారమగు 'కోల్‌గాసు' అను, వాయువును పుట్టింపబడును. వానితో నానగరమంతటను ప్రదీపములబెట్టిరి. అన్నిపేటలందును, ఉచితగ్రంథాలయము లను, పఠనమందిరములను, పాఠశాలలను, కార్మికులకు రాత్రి బడులను, చక్కని వైద్యశాలలను, నెలకొల్పిరి. నీటిపారుదలకు మురుగుదొడ్లకు నవీనవిజ్ఞానపద్ధతుల ప్రకారము ప్రశస్తపద్ధతు లను అమలులోనికి దెచ్చిరి.

ఆధునికపరిశ్రమలకు ప్రకృతిశాస్త్రపరిజ్ఞాన మవసరము. నవీనావిష్కారములు కలిగినకొలదిని, నిర్మాణమున సౌకర్యపద్ధ తులను లాభకరమగు సదుపాయములను అమలుబెట్టనచ్చును. ఆయంత్రశాలల కంగముగవిజ్ఞానపరిశోధనశాలలనుంచి, విద్యా వంతులగు యువకులకు విజ్ఞానమును ఆధునిక శిల్పవిద్యలను నేర్చుకొనుటకు అందు ప్రత్యేకప్రోత్సాహము నిచ్చుచున్నారు; ప్రత్యేకమగు టెక్నికలు పాఠశాలలగూడ పెట్టిరి. ఈనగరపు నిర్మాణమునకు దాని పారిశుధ్యభద్రతలకు ఆకంపెనీవారే బాధ్యత వహించి, వ్యయప్రయాసములకు జంకక దాని నాదర్శనగర ముగ జేసిరి. ఆనగరమునకై, ఆకంపెనీవా రిప్పటికి రమారమి రెండుకోట్ల రూపాయలసొమ్ము ఖర్చుజేసిరి. అందిప్పుడు సుమా రు లక్షమంది జనులు వసించుచున్నారు;

ఆపురమున క్రొత్తక్రొత్త అనుబంధపరిశ్రమలింకను ఏర్పడుచున్నవి. ఇంకను క్రొత్తపనివాండ్రు వ్యాపారస్థులు చేరుచున్నందున, ఆపురమింకను వేగముగ వృద్ధియగుచున్నది. 1919లో, అప్పటి రాజప్రతినిధియగు చెమ్సుఫర్డ్‌ప్రభు వాపురమునకు వచ్చెను; అప్పు డానగరమునకు పూర్వపు కుగ్రామనామమగు 'సాక్చి'కి బదులు, 'జంషెడ్‌పుర'మని పేరుపెట్టిరి. అచట యూరపియనులు మున్నగు పెద్దయుద్యోగులు వసించుపేటకు మాత్రము 'తాతానగర్' అని పేరుంచబడెను. అప్పటినుండి యీపవిత్రనగరమును 'జాంషెడ్‌పుర' మనియే వాడుక. ఇట్లు జంషెడ్జీ తాతాగారి యాంత్రిక ప్రతిభ కానగరము స్మారకచిహ్నమైనది.

ఈపురము సార్వజనికము; ఇందు పాశ్చాత్యులు, చీనులు, భారతీయులలో అన్నిప్రాంతములవారును, కలరు. భారతీయైక్యమునకు నిదియొక చిహ్నము. ఇం దప్పటికిని కొందరు పెద్దయుద్యోగులు పాశ్చాత్యులే; కాని కొంతవర కిటీవల భారతీయులే పూచీతోఁగూడిన నిర్వహణకార్యములగూడ నిర్వహించుచున్నారు. విద్యుచ్ఛక్తి వైద్యశాఖ మున్నగు కొన్ని శాఖల ప్రవర్తకులు భారతీయులే. తక్కిన కొన్ని శాఖల నిర్వాహకులు, ప్రత్యేకనిపుణత విశేషవాస్తువిజ్ఞానము కావలసిన ప్రధానోద్యోగులును, ఇప్పటికిని విదేశీయులే. ఇందుకు వలయు ప్రత్యేకనైపుణ్యపరిజ్ఞానములు విదేశీయులకే కలవను భావమున, వారు దీర్ఘకాలపు షరతులపైన ఇంగ్లండు, జర్మనీ, అమెరికా,

మున్నగు దేశముల పెద్దయంత్రాలయములనుండి రప్పింపబడిరి. వారికి చాల హెచ్చుజీతము లీయబడును.* వారు పెద్దయుద్యోగులగుటవలన, అచటి వ్యవహారముల నడుపుటలో నాపాశ్చాత్యులకు పలుకుబడియుండుట సహజము; కాని కంపెనీ యాజమాన్యము భారతీయులదే.

అందలి కార్మికులకు సముపాయమునకై చిల్లరవైద్య సహాయమును సోడానీరుమున్నగు వానిసౌకర్యమును, ఆకంపెనీ వా రుచితముగనే కలిగించుచున్నారు. బియ్యము మున్నగు నిత్యాహారపు వస్తువులను కంపెనీవారే కొని యుంచి, ప్రత్యేకపు చౌకధర కందజేయుదురు. అచటి సీటిపన్ను, దొడ్డిపన్ను, దీపపుపన్ను మున్నగునవి ఆగృహములందు వసించు వ్యక్తులు భరింపనక్కరలేదు. నగరపు మునిసిపలుఖర్చు చాలవరకు కంపెనీవారే (కొంతవరకు ఇటీవల నచట నేర్పడిన 7 క్రొత్త కంపెనీలును) భరింతురు. అచటి ప్రజాప్రతినిధులు ఇప్పుడు కొంతవరకు నగరయాజమాన్యము వహించియున్నారు. విద్యావ్యాయామసమావేశాదులకై చాల క్లబ్బు లేర్పడినవి.

* ఇప్పుడున్న పాశ్చాత్యులనుగూడ చాలవరకు తగ్గింపవలెనని, వారు చేయుపనులలోగూడ కొన్నింటిని నిర్వహింపగల సామర్థ్యము ఇప్పుడు భారతీయులకును కలదని, అందువలన చాల హెచ్చుజీతముల నిచ్చి విదేశీయులనే పెద్దయుద్యోగులుగ నుంచుట యవసరముకాదని, చాలమంది భారతీయుల అభిప్రాయము. పాశ్చాత్యోద్యోగులకు చాల హెచ్చుజీతముల నీయవలసి వచ్చుటచే, కంపెనీ సిబ్బందిఖర్చు చాల హెచ్చుగనున్నది.

ఇందు వాస్తువిద్య, విద్యుచ్ఛక్తి, ఖనిజశాస్త్రము, రసాయనము, పారిశుధ్యశాస్త్రము, లోహశాస్త్రము, కార్ఖానా నిర్మాణము, మున్నగు విద్యలందు పరిశోధనకును ప్రత్యక్షానుభవమునకును చాల అవకాశముకలదు. అందువలన ఇచట పనివాండ్ర జ్ఞానాభివృద్ధికిని మంచి యవకాశముండును. ఈసౌకర్యముల నేర్పఱచుట కంపెనీవారి దూరదృష్టిని తెల్పును. (కంపెనీలోని యుద్యోగులు కార్మికులు ఆరోగ్యవంతులు జ్ఞానవంతులునగుటవలన, కంపెనీవారి పనులు ప్రశస్తముగ జరుపబడి కంపెనీకిని లాభమే కలుగును.)

ఈపురమున నీకంపెనీవారి కార్ఖానాలనుండి వేర్వేరు మచ్చుల యినుమును ఉక్కును చౌకగ, వలయునంత సమృద్ధిగ, వలయునప్పుడెల్ల దొరకును; శిల్పజ్ఞానముగల నిపుణులగు పనివాండ్రకును లోటులేదు. అందువలన, ఈనగరమందే కొన్ని యనుబంధపరిశ్రమల కంపెనీ లేర్పడినవి. ఇందలి 'జూట్ మెషినరీ కంపెనీ' వారు కలకత్తామున్నగు ప్రాంతములందలి జనపనార పాక్టరీలకు వలయు యంత్రముల తయారుచేయుదురు. * 'టిన్

* సంచులుమున్నగువానిని తయారుచేయు జూటుమిల్లులకు కలకత్తా నగరము ముఖ్యకేంద్రము; ఆమిల్లులయజమానులు చాలవరకు బ్రిటిషువారు; ఆమిల్లులకు తరుచు కావలసియుండు వివిధయంత్రములను పనిముట్లను వారు విదేశములనుండియే తెప్పించుకొనుచుండిరి. అచటికి 150 మైళ్ళలోనే మంచి యినుము ఉక్కు దొరకుచున్నందున, జూటుమిల్లులకువలయు కొన్నియంత్రములుగూడ జంషెడ్పురమందే తయారగుట సుకరమైనది.

ప్లేట్ కంపెనీ' యను మరియొకకంపెనీవారు ఇందు తగరపు డబ్బాలు ఇత్యాదుల జేయుదురు. 'ఎగ్రికల్చరల్ ఇంప్లిమెంట్స్ కంపెనీ'లో ఇనుపనాగళ్ళు మున్నగు వ్యవసాయపరికరములు తయారగును. 'ఎన్‌ఫీల్డ్ కేబిల్ కంపెనీ'లో విద్యుచ్ఛక్తి ప్రసారాదులకు వలయు బలీయమగు లోహపు తీగలు చేయబడును. 'ఇండియన్ స్టీల్ వైర్ ప్రోడక్ట్స్' వారుక్కుతీగలతో వివిధ వస్తువుల జేయుదురు. 'ఎనామల్డ్ ఐరన్ వేర్ కంపెనీ' వారు ఎనామలు పూతతో రేకు పాత్రల జేయుదురు. ఇట్లు మనకు తరుచు అవసరమగు చాల వస్తువులను ఇదివరలోవలె విదేశములనుండియే తెప్పించుకొననక్కర లేకుండ, ఇచటనే తయారు చేయబడుచున్నవి. టాటాలోహయంత్రశాలలో ఇనుము ఉక్కు సులభముగ దొరికి, శిల్పులు సిద్ధముగ యంత్రముల పనినేర్చియుండుటచేతను, సమృద్ధియగు విద్యుచ్ఛక్తి నేలబొగ్గు మున్నగు సౌకర్యములుండుటచేతను, అట్టి అనుబంధపరిశ్రమలు గూడ ఇచ్చట నేర్పడి, గిట్టుబాటుగ పాశ్చాత్యపు సరుకులతో పోటీకినిలుచుట సాధ్యమైనది.

## 15. జలవిద్యుచ్ఛక్తిశాల.

రాట్నము, చేతిమగ్గము చేతిమరలు మున్నగు చిన్న యంత్రములను చేతితోనే త్రిప్పి నడుపవచ్చును; కాని పెద్ద యంత్రముల నడుపుటకింకను చాల బలీయమగు చోదకశక్తి కావలెను. 'ఇంజను'లనబడు ఆవిరియంత్రము లట్టిచోదకశక్తి నిచ్చును. ఆయింజనులందు నీరు సలసలకాగి యావిరియై, అందలి ఉక్కుకడ్డులను త్రోయును. ఆశక్తిమూలమున వానికి చేర్చిన చక్రము లతివేగముగ తిరుగును. ఇట్లు ఇంజనులు రైళ్ళను మిల్లులను నడుపుట చూచుచున్నాము; ఈఇంజనులం దావిరి కలుగుటకై, అత్యుష్ణతనిచ్చు నిప్పుకావలెను; ఇందుకు నేలబొగ్గును వాడుదురు. (కర్రనిప్పు పెద్దయంత్రములం దంత యుష్ణత నిచ్చుటకు చాలదు.)

బొంబాయినగరప్రాంతమున చాల దూదిమిల్లులు క్రమముగా వృద్ధియాయెను. ఆమిల్లుల ఇంజనులకు వలసినంత నేలబొగ్గు సప్లై చేయుట కట్టిగనులా ప్రాంతమున లేవు. వంగ విహారాది దూరప్రాంతములనుండి బొగ్గును రైలుపై తేవలెను. ఆరైలుకంపెనీవారు బలువుసామానును తెచ్చుటకు చాల హెచ్చురేటు బాడుగ వసూలుచేయుదురు. అందువలన బొంబాయిలో బొగ్గుకు కిమ్మతు చాలహెచ్చి, మిల్లులపని గిట్టుబాటుగాక, నష్టముకలుగుచుండెను. మరియు కొన్నిగనుల నేలబొగ్గుకు ఖర్చు అధికమై, సరుకు చాలనప్పుడును గిరాకి కలుగును. ఇంగ్లం

డు, అమెరికా, జర్మనీలందున్నంత విశాలమగు బొగ్గుగనులు మనదేశమున దొరకలేదు.* అందువలన మరియొక బలీయమగుశక్తి దొరకుట యవసరమయ్యెను.

కొన్ని పాశ్చాత్యదేశములందు కొన్నిచోట్ల విజ్ఞానసహాయమున నదులజలపాతముతో విద్యుచ్ఛక్తిని పుట్టించి, బొగ్గుకు బదులు విద్యుచ్ఛక్తితో పెద్దయంత్రముల నడుపుచున్నారు. మనదేశమున, కావేరినది మైసూరులోని శివసముద్రమునొద్ద కొండలనుండి క్రిందకు ప్రవహించుచోట, గొప్ప జలపాతము కలదు; ఆజలపాతమున్నచోట క్రిందచక్రములనుంచి, ప్రవాహపుదెబ్బచే వేగముగ తిరుగు చక్రయంత్రములద్వారా యచట నొకయూరపియను కంపెనీవారు విద్యుచ్ఛక్తిని పుట్టించుచున్నారు. దానితో యంత్రములు నడుపబడి, మైసూరులో కోలారుస్వర్ణఖనులనుండి బంగారు చేయబడును. ఆవిద్యుచ్ఛక్తి బెంగుళూరు మైసూరుల యెలెక్ట్రికుదీపములకుగూడ నుపయోగించుచున్నది. ఇట్లే బొంబాయిప్రాంతమునగూడ చౌకగ విద్యుచ్ఛక్తి దొరకినచో, దానిసహాయముననే బొంబాయిమిల్లులు నడుపవచ్చును; ఆవిధముగ బొగ్గుబాధయు వదలునని జమ్షెడ్జి తాతా ఆలోచించెను. (రసాయనశాలలందు విద్యుచ్ఛక్తి తయారుచేయుటకు చాలసొమ్ము ఖర్చు అగును.)

---

* ఓఢ్రవంగ ప్రాంతములందుమాత్రము బొగ్గుగనులు సమృద్ధిగానే కలవు.

ఇదివరలో 1875 ప్రాంతమున, మధ్యరాష్ట్రమందు తన ఎంప్రెసుమిల్లు స్థాపించుటకు తగుస్థలముకొరకు వెదకుచుండి నప్పుడు, జంషెడ్జితాతా జబ్బల్‌పురమునకు వెళ్ళెను; అచట నర్మదానది వింధ్యగిరినుండి క్రిందకు పడును. ఆజలపాతమునొద్ద తనమిల్లునుంచి, దానిశక్తితో సులభముగ యంత్రములనడిపింప దలచి, తాతా యాస్థలమును ఖరీదుకిమ్మని ప్రభుత్వమును కోరెను. కాని అక్కడనే, ఒక సన్యాసి ఆశ్రమముంచి, అందొక విగ్రహమునుంచి, పూజించుచుండుట తటస్థించెను. ఆజిల్లాలోని పామరులందరు నచటికివచ్చుచు, ఆవిగ్రహమును దర్శించి, ఆ సన్యాసిని సేవించి పోవుచుండిరి. ఆస్థలము మిల్లుకై అమ్మినచో, ఆసన్యాసి యటనుండి పోవలెనని, అందుచే చుట్టుపట్లజనులం దుద్రేకము కలుగునని తలచి, ప్రభుత్వమువారు తాతా కోరినక్రయము జరిగించుటకు నిరాకరించిరి. తుదకు జంషెడ్జి తనమిల్లును నాగపురమం దేర్పర్చెను.

తరువాత 1897 లో జంషెడ్జితాతా, 'మిల్లను' అను నాంగ్లేయవర్తకుడు, గోస్లింగు అనుఇంజనీరు, గుజరాతుప్రాంతపు దుగ్ధసాగరజలపాతముద్వారా జలవిద్యుచ్ఛక్తి జనింపజేయ నిశ్చయించిరి. ఈస్థితిలో వీరిదృష్టి 'లోనవ్లా'వైపు మరలెను.

బొంబాయిప్రాంతమున సహ్యాద్రి యుత్తరదక్షిణములుగా వ్యాపించి యున్నది; దీనినే పడమటికనుమలు అందుము. (అది మనప్రాంతమునకు పడమటిదిశనున్నది.) ఈపర్వతపంక్తిలో

బొంబాయినగరమునకు 50 మైళ్ల లోపున 'లోనవ్లా' అను కొండ స్థలము కలదు. అది సముద్రతీరమునకు 2000 అడుగుల ఎత్తున నున్న యొకబంగాళాయందు చల్లదనముకై ప్రతిసాలున కొన్ని నెలలు 'గోస్లింగు' గారు నివసించుచుండిరి; అప్పుడచ్చటి పరిస్థితుల నాయన గమనించెను. ఈకొండలు చాలయెత్తు; పడమటి వానలమబ్బులు మనప్రాంతమునకు వచ్చుటకుముందే యాకొండల దాకును. ఇచట నాన్నైఋతివానలవల్ల కుంభవృష్టిగ వర్షధారలు పడుచుండును. ఆకొండపైనచుట్టును ఎత్తగుగట్లును మధ్యను విశాలమగుచరియలు రాతినేలయు నున్నవి. అందువలన వర్షోదక మాకొండపైన నిలవయుండి, బాగుగహెచ్చినప్పుడు ప్రోల్లి నలుప్రక్కలను పారుచుండెను. ఆఎత్తుస్థలమునుండి యానీటి నొక్కప్రక్కగా నొకే పెద్దధారగా క్రిందికి త్రిప్పుచో, గొప్ప జలపాతమేర్పడును. అందుండి సమృద్ధిగ విద్యుచ్ఛక్తి పుట్టింప వచ్చును.

దూరస్థమగు దుగ్ధసాగరజలపాతముకన్న, 'లోనవ్లా' లో హెచ్చుసదుపాయములు కలవు. అదిబొంబాయికిచాలదగ్గర; తక్కువఖర్చుతో నావిద్యుచ్ఛక్తిని బొంబాయిమిల్లులకు సప్లై చేయవచ్చును; ఆమహానగరమున విద్యుచ్ఛక్తికి చాల గిరాకి యుండును. 'లోనవ్లా' ప్రాంతమున సాలీనా వేయినుక్కుల కన్నను హెచ్చుగ వర్షించును. అచట విద్యుచ్ఛక్తిని జనింపజేసి బొంబాయిపురమునకు చేర్చుచో, ఆశక్తితో మిల్లులెక్కువబాగుగ

పనిచేయును. మిల్లుగొట్టములనుండి యిదివరలో నిరంతరము బొగ్గుపొగవచ్చి వాయుమండలము నావరించుచు, బొంబాయి నగరమునకనారోగ్యము కలిగించుచుండెను. నేలబొగ్గువాడక విద్యుచ్ఛక్తినే వాడుచో, బొగ్గుపొగయుండదు. కనుక నచటిగాలియు శుభ్రమగును. మరియు ఈవర్ష జలమంతయు చెదిరి వ్యర్థముగ సముద్రములో పడకుండ, దానిని కాలువలద్వారా వ్యవసాయాదులకు లాభకరముగ వినియోగింపవచ్చును.

ఈ సంగతులన్నిటిని గ్రహించి, వెంటనే తాతాగారు సమర్థులగు వాస్తువిజ్ఞులచే నాప్రణాళికను పూర్తిగా పరీక్షింపజేసిరి. ఆయుద్యమము సాధ్యమని, లాభకరమని, వారు తెల్పిరి. అంతట, స్వయముగ నింగ్లండుకుజని, అచటభారతమంత్రియగు హామిల్టను ప్రభువుతో, తాను తలపెట్టిన యుక్కుపరిశ్రమనుగూర్చియు, ఈజలవిద్యుచ్ఛక్తికార్యమును గూర్చియు, తాతా చర్చించెను; సాధకబాధకములదెల్పి ఆయనసహాయమును గోరెను. హామిల్టనుప్రభువు తనసానుభూతిని తెల్పెను. అందువలన, తరువాత మనదేశమందలి ప్రభుత్వాధికారుల యాటంకమును, ప్రభుత్వపు పరిశోధనలలో తరుచుగ కలుగు విశేషకాలయాపనయు లేకుండ, కొంతసౌకర్యము కలిగినది.

ఈపరిశ్రమకై మెళ్ళకొలది కొండస్థలములను, అడవులను, కొలదిజనులుమాత్రము వసించు కొన్నిలోయలను, కొనవలసివచ్చెను. అందు కొన్నిప్రాంతములు వ్యక్తులవి. వానినికొనుటకు

ప్రభుత్వమునకే అధికారముకలదు.† అందుకు ప్రభుత్వసానుభూతి అవసరము. తనప్రణాళికకు పూర్తియగువివరములను ఆయుద్యమముచే బొంబాయినగరప్రజలకు చుట్టుపట్టజిల్లాల భూస్వాములకు, రయితులకు, గలుగగలలాభములను వివరించుచు, జంషెడ్జి లండనులోహామిల్టను ప్రభువునకొక పెద్దరిపోర్టునంపెను. దానివిశేషమును గమనించి, భారతమంత్రి దానిని తన యాశీర్వాదముతో బొంబాయిగవర్నరు కంపెను. అంతట జంషెడ్జి గవర్నరుతో చాలసార్లు సంప్రతించి, తనయత్నములచే నాప్రాంతములకు లాభము కలుగునని గవర్నరుకు విశదముచేసి, ఆయనకు తృప్తి కలిగించెను. 1903 లో అమెరికా వెళ్ళినప్పు డచ్చటి నయాగరా జలపాతము మున్నగువా నినిజూచి, అందు విద్యుచ్ఛక్తిపరిశ్రమ నాయకులనుండి చాలసంగతుల గ్రహించెను. ఇట్లునిరంతరశ్రమతోనాయుద్యమమునకు పునాదివేసి, ఆమహోద్యమమును నిర్వహించుటకై తొందరగ యత్నించుచుండగనే, 1904లో జంషెడ్జి చాలవ్యాధిగ్రస్తుడై, మేనెల 19 వ తేదీని మరణించెను.

ఈయాపత్తుచే బంధుమిత్రులు శోకసంతప్తులైరి. ఆయుద్యమమును తరువాత జయప్రదముగ స్థాపించినపుడు భార

† వ్యక్తులకు హక్కుగల ఆస్తిని నిర్బంధముగ కొనుటకు వ్యక్తుల కధికారములేదు. అది పబ్లికు కార్యములనిమిత్తము కావలెనని గజెట్టులో ప్రకటించి లాండు అక్విజిషను ఆక్టుప్రకారము సర్వేజరిపి, తగుకిమ్మతునిచ్చి, ప్రభుత్వమువారు మాత్రము నిర్బంధముగాగూడ ఆయాహక్కుదార్లనుండి తీసికొనవచ్చును. రైలు గ్రామ నివేశనములు మున్నగు వాటికై యిట్లే చేయుదురు.

మాయన పుత్రమిత్రులపై బడెను. జాంషెడ్జి ఈమహోద్యమము లోని ఆనుపానులను వారికి మొదటినుండి తెలిపి, వారి కా కార్యక్రమపునిర్వహణమున పూర్తియగు శ్రద్ధను ధైర్యో త్సాహములను కలిగించెను. మిల్లరుగోస్లింగులతో నేర్పడిన సంఘమందు తనతో బాటు జ్యేష్ఠపుత్రుడగు దొరాబ్జినికూడ సభ్యునిగ చేర్చెను. అందువలన, ఆయనయనంతర మాయుద్య మమును విడువక, దొరాబ్జియు మిత్రులును సాధించి, జయప్రద ముగ నడుపగల్గిరి. 1907 నందే ప్రభుత్వమునుండి ఆపరిశ్రమ స్థాపనకు వలయు లైసెన్సు లభించెను.

కాని గొప్ప యింజనీర్లచే నాకొండస్థలము లన్నిటిని పూర్తిగా పరీక్షింపజేసినమీదట, వివరములగూర్చి కొన్ని చిక్కులు కన్పట్టెను. మిల్లులకు, మునిసిపాలిటీకి, ఇతరసంస్థలకు, విద్యుచ్ఛక్తి సప్లై చేయుటకు ఖరారుచేయుచో, మధ్య నెన్నడు నావిద్యుచ్ఛక్తిసప్లై నిల్చిపోకుండ తగు కట్టుదిట్టముల జేయ వలెను. (అట్లు తప్పిపోయినయెడల, ప్రజలకు అసౌకర్యము కల్గును; మరియు తాతావారు ఆసంస్థలకు చాల నష్టపరిహార మీయవలసియుండును.) నయాగరా శివసముద్రములందువలె నిచట సహజనదీప్రవాహము లేదు. బొంబాయిప్రాంతపు కొండ లపైన వేయిఅంగుళములకుపైగా వాన కురియును. కాని అందు చాలభాగము వర్షకాలపు మూడునెలలలోనే పడును. తక్కిన 9 నెలలందును, నిరంతరముగ జలధార కొండలనుండి పడు

టెట్లు ? ఈమూడునెలలలోను పడు మహావర్షపు సమృద్ధజలము వ్యర్థముగ సాగరములోనికి బోకుండ, కొండలపైననే చాల మెత్తగు మహాసరస్సుల నిర్మించి, అందు విశేషజలమును నిలవజేసి, క్రమముగా నందుండి యవసరమగునంత నీటి ప్రవాహము నొకచోట కొండయంచుకు రప్పించి, అటనుండి క్రిందకు గొట్టములద్వారా జలధార వేగముగ బడునట్లు చేయవలెను. పూర్తియైన జయము కలుగవలెనన్న, రెండుమూడేండ్లు వరుసగ నెప్పుడైన ననావృష్టికలిగి, తగినంతవర్షము పడకున్నను, అప్పటివరకును చాలునంత నీరుకూడ నాకొండలమధ్య నిలవజేసి యుంచవలెను.

అందువలన, వారాలోచించి, మొదట తలపెట్టిన 'లోనవ్లా' ప్రాంతమునేగాక, దాని కాగ్నేయమందున్న 'వల్వాను' కొండను, దానికిని ఆగ్నేయదిశదగు 'షిరాటా' కొండను, వీనిమధ్యనున్న లోయలన్నిటినిగూడ కొని, ఆలోయలనుండి నీరు ప్రక్కలకు తెగిపోకుండ, చాల మెత్తగు బలమైన రాతిప్రాకారముల గట్టుటకు నిశ్చయించిరి. ప్రశస్తమగు యంత్రములను, ఎన్నటికిని చెడని బలీయమగు ఉక్కుగొట్టములు మహోన్నతమగు స్తంభములు తీగలు మొదలగు చాల ఉపకరణములను, హెచ్చువెలకు తేవలసియుండెను. కార్యమంతయు విజ్ఞులు, జగద్విఖ్యాతులు విదేశములం దట్టి కార్యములలో విశేషానుభవము సంపాదించినవారునగు ఇంజనీర్లచే జరిగించ

బడవలెను. అందుకు చాల మూలధనము ఒక్కసారిగా కావలసి వచ్చెను.

పెద్దపరిశ్రమలులేని మనదేశమున, సందేహగ్రస్తమగు నావిచిత్రపరిశ్రమకై అంతమూలధనము దొరకుట దుర్ఘటము. అందువలన, పరిశ్రమలతో నొప్పుచు ధనముతో తులతూగు చున్న ఆంగ్లదేశపు లండనులోనే ఈసంఘమును స్థాపించి, అందు చాలమంది విజ్ఞులగు ఆంగ్లేయుల సభ్యుల యజమానులుగ జేర్చుకొని, వారిద్వారా ఆంగ్లకోటీశ్వరులనుండి మూలధనము సేకరించి, ఈయుద్యమము సాగింపవలయునని తలచి, దొరాబ్జి తన యాంగ్లమిత్రులసహాయముతో లండనులో నట్టిసంఘము స్థాపించి, ద్రవ్యముకై ప్రకటనలజేసి, మనసార యత్నించెను. అచట ధనము చేకూరినచో, ఈపరిశ్రమ యాజమాన్యము, లాభమును, చాలవర కాంగ్లేయుల హస్తగతమై యుండును. మూడేండ్లు యత్నించినను,కొన్నికారణములవలన, ఆమూలధన మాంగ్లదేశమున చేకూరలేదు. ఈయదృష్టఫలితమున దొరాబ్జి నిరాశుడై, తిరిగివచ్చెను.

ఈలోగా మనదేశమున స్థితి మారి, 'స్వదేశీ'యుద్యమము క్రమముగా దేశమంతటను నాటుకొనెను. టాటావారి లోహపరిశ్రమ స్థాపితమై, పనిచేయ నారంభించెను. అందువలన

తాతాకంపెనీవారి ప్రజ్ఞ, కార్యశూరత్వము, దేశీయులకు విదితమై, తాతావారి ప్రతిష్ఠ హెచ్చెను. 'స్వదేశీ' వలన బొంబాయి మిల్లుదార్లకు చాల లాభించెను. బొంబాయిలోని కోటీశ్వరులగు కొందరు తమమిల్లులకు విద్యుచ్ఛక్తి నీకంపెనీనుండి తీసుకొనుటకు ఖరారునిచ్చిరి; వారీకంపెనీలో చాలవాటాలను గూడ తీసికొని, కొంత ద్రవ్యమిచ్చిరి. తుదకు, 1910 నవంబరులో, ఈ సంఘము 'తాతాహైడ్రో-ఎలెక్ట్రిక్ సప్లైకంపెనీ' అను పేర రిజస్టరు చేయబడెను.

మొదట నిర్ణయించిన మూలధనము రెండుకోట్ల రూపాయలు. తాతాకంపెనీవారే యీసంఘము నడుపుటకేజెంటులుగా నేర్పడిరి. కొన్నివాటాలను తాతాకంపెనీవారే తీసికొనిరి; కొన్నిటిని బరోడా గయకవ్వారు మొదలగు స్వదేశీయ రాజులు, మరికొన్నింటిని కొందరు మిల్లుయజమానులు మున్నగు వ్యాపారస్థులును, తీసికొనిరి. ఇట్లు మూలధనమంతయు చేకూరెను. అంతట ద్రవ్యబాధ వదలి, దొరాబ్జితాతా తదేకదీక్షతో కృషిచేసెను. సస్సూన్ డేవిడు, ఆర్. డి తాతా, రతన్ తాతా, బ్రోచా మున్నగు భారతీయులే చాలవరకు డైరక్టరులు; సర్ దొరాబ్జితాతా ఈబోర్డు కధ్యక్షుడయ్యెను. 1911 ఫిబ్రవరిలో, బొంబాయిగవర్నరగు సిడెన్హాం ప్రభువుచే దీని కట్టడములకు పునాది వేయబడెను; 700 మంది కూలీలతో ఇంజనీర్లు వేర్వేరుకట్టడముల నిర్మాణకార్య మారంభించిరి.

ఇదివరలో ప్రపంచమందున్న విద్యుచ్ఛక్తి కుపయోగించు జలపాతములన్నియు సహజమగు జీవనములవి; ఆజలపాతములకు నీరు నిలవచేయనక్కర లేదు; అందు పెద్దరాతికట్టడము లక్కర లేదు. సహ్యాద్రియం దట్లుకాదు; ఇచట హిందూమహాసముద్రమునుండి వచ్చు నైఋతిమేఘములు కొండలదాకుడువలన విపరీతమగు వర్షోదక మాకొండలందు బడును; కొండలందు మూడు నెలలలో బడుదానినంతను అరికట్టి, సాలుకంతకును నిలవ యుంచుటకు, చలనములేని ఆనకట్టలబోలు బ్రహ్మాండమగు రాతి గోడల గట్టవలసివచ్చెను. ఉత్తరమందున్న 5 మైళ్ళ విశాలమగు 'షిరాటా' సరస్సుకు 31 గజములయెత్తును మైలున్నరపొడుగు నుగల గోడనుకట్టి, అందు 720 కోట్ల ఘనపదములనీటికై కొండలలోనుండి సుమారు మైలుపొడుగు సొరంగముత్రవ్వి, 'వల్వాన్' సరస్సుకు దారిజేసిరి. ఈ 'వల్వాను'ను నిట్లే దీర్ఘమగు పెద్దరాతిగోడలతో బిగించి, 1500 ఎకరముల మహాసరస్సుగ జేసిరి. ఇందుండి కొండలలోనే మూడుమైళ్ళ దూరమందలి 'లోనవ్లా'కు దారిచేయబడినది. 'లోనవ్లా'కు నిట్లే యింకొక బలీయమగు రాతిగోడ నిర్మింపబడినది. ఇందలి నిలవనీరు చాలనప్పుడు, ఇట్లు పైరెండుసరస్సులనుండియు దీనికి నీరువచ్చును.

కొండలమధ్యనున్న యీ 'లోనవ్లా'సరస్సులోని యుదకము కృతకనదీప్రవాహముగ, ఆకొండపీఠభూమియందుచుకు

పెద్దసారంగములద్వారా తేబడి, * అటనుండి 7 అడుగుల వెడల్పుగల పెద్దయినుకగొట్టములద్వారా 1734 అడుగుల క్రిందికి వేగముతో విడువబడును. ఈమహాజలధార కచట అంగుళమునకు 750 పౌనుల రేటున యొత్తిడియుండును. అట్టిమహాశక్తితో వచ్చునాధార యచ్చటనుంచినయినుకచక్రముల నతివేగముగ త్రిప్పివేయును. అందుచే జనించు మహాశక్తి యంత్రసహాయమున ఎలెక్ట్రిసిటీ (=విద్యుచ్ఛక్తి) గా మార్చబడును. అప్పుడాశక్తి 5 వేల 'వోల్టు' లది; దానినిమరియొకమహాయంత్రపుసహాయమున కుదించి, దానిని లక్షవోల్టులుగా చేయుదురు. ఆ 'పవర్ హౌసు' (=శక్తిగృహము) నుండి బొంబాయినగరమందలి 'పరేల్' అను మిల్లుపేటకు 43 మైళ్లుండును; మధ్యను ఉప్పుటేళ్లు, సముద్రపుపాయకూడ, దాటవలెను; ఈ 43 మైళ్ళురు లోతుగ కాంక్రీటుపునాదులతో 200 అడుగులయెత్తున బలీయములగు నినుకస్తంభములనుపాతి, వానిపైనుండి రాగితీగలనుబిగించిరి; ఈతీగలపైన పవర్ హౌసునుండి 'పరేలు'లో నిర్మించిన రిసీవింగ్ స్టేషను

* ఈయయిదుమైళ్ళపొడుగునను ఆనదికడుగున నేల చదును చేయబడి, రాతితోను సిమెంటుతోను గట్టిగా కట్టబడినది. పైపరోడ్డు వంతెన, క్రిందనుంచి రైలుమార్గమును, కట్టవలసివచ్చెను. కొండయందు రాతినేలకానందున, అచట నీరింకి నేలదిగి పోవుచుండుటకై, అందుభాగమంతయు కాంక్రీటుతో గట్టిచేయబడెను. ఆకొండలపైన రాళ్లలో బిగించియుంచిన పెద్ద యినుకగొట్టములు శీతోష్ణములకు తగ్గిహెచ్చుటచే కలుగుచిక్కులు తప్పుటకు వైజ్ఞానికమగు కట్టుదిట్టముల జేయవలసివచ్చెను.

(=గ్రాహకస్థానము) లోని కీలకు వోల్టులబలముగల యమ్మహాశక్తి కొనిపోబడును; అందాశక్తి మరల నైకువేల 'వోల్టులకు' పలచన చేయబడి, నిలవయుంచబడును; అటనుండి భూమిలోపలనుండి వేసిన తీగలద్వారా బొంబాయినగరపు మిల్లులకు నితరయంత్రములకును ఈవిద్యుచ్ఛక్తి చాలచౌకగ సరఫరాచేయబడును. (విద్యుచ్ఛక్తి ప్రసరించుచున్నతీగలను నరులు ఇతరప్రాణులు ముట్టినచో, ఆశక్తిబలమునవారు తక్షణము మరణింతురు. అందు వలన విద్యుచ్ఛక్తి ప్రసరించుతీగలు చాలఎత్తుగనో భూమిలో పలనుండియో పోవలెను.)

నీరు షిరాటా మొదలుకొని కొండలపై నిలవచేయుట, దానిని కొండలక్రిందకు సరియగుధారగరప్పించుట, కొండక్రింద విద్యుచ్ఛక్తిపుట్టించు యంత్రముల గట్టుట, ఆశక్తిని బొంబాయికి తీగలపై చేర్చి నిలవయుంచుట, ఇట్టిపనియంతయు పదేండ్లు పట్టి, 1920 తో పూర్తియయ్యెను. లోనవ్లా సరస్సునుండి కార్యము 4 ఏండ్లలోనే పూర్తిఅయినవి. 1915 నుండియే మిల్లులకు విద్యుచ్ఛక్తిసప్లై ఆరంభించెను. ఆయామిల్లుల మోటార్లకేగాక అందుల దీపములకు గాలివిసురు 'ఫాను'లు మున్నగువానికిని తాతాకంపెనీనుండియే విద్యుచ్ఛక్తి యందజేయబడును.

ఈచౌక విద్యుచ్ఛక్తితో బొంబాయిమిల్లులవారు బొగ్గు బాధలేకుండ తమమిల్లులను ఇతరయంత్రములను, నడుపుకొన

జొచ్చిరి.* అందువలన బొంబాయిప్రాంతమున పరిశ్రమలు వేగ
ముగ వృద్ధియయ్యెను, ఈవిద్యుచ్ఛక్తిజనకయంత్రమునోదను
ఆతీగలుపోవుదారిని గూడ, క్రొత్తపరిశ్రమల కర్మాగారములేర్ప
డెను. పొగబాధ పోయినందున, బొంబాయినగరపు ఆరోగ్య
మును అందువలన బాగుపడెను.

కొలదియేండ్లకే యీకంపెనీవారు జనింపజేయు విద్యు
చ్ఛక్తియంతయు నాయామిల్లులువగైరాలకు ఖర్చైపోవుచుండె
ను. ఇంకను విద్యుచ్ఛక్తి కావలెనని, గిరాకి కలిగెను. అంతట
తాతాకంపెనీవారీకంపెనీమేనేజరుద్వారా ఆప్రాంతపు ఇతరగిరు
లనుగూడ పరిశోధించిరి. 'లోనవ్లా'కు 12 మైళ్ళు ఉత్తరమం
దలి సహ్యాద్రినేయున్న 'ఆంధ్ర' నదియొక్కలోయయు నింపుకు
తగినదని తేలెను. ఈలోయకు 19 అడుగులయెత్తు రమారమి
1800 అడుగులపొడుగుగల పెద్దరాతిప్రాకారములగట్టి, 11 మైళ్ల
మహాసరస్సు నాకొండలోయలలో సృజింపజేసి, అటనుండి నీటి

---

* బొంబాయిలో గృహములు ట్రాంబండ్లు మున్నగువానికి విద్యుచ్ఛక్తి నొక యూరపియనుకంపెనీవారు జనులకుసప్లై చేయుచుండిరి; ఈకంపెనీ 1905కు పూర్వమే యేర్పడియుండెను. ఆట్రాములకును చిల్లరగా గృహములకునుగూడ తాతాకంపెనీనుండి విద్యుచ్ఛక్తిని కొనుటకవకాశ మిచ్చినయెడల, అందరును తాతాకంపెనీనుండియే తీసికొందురు. కోట్లకొలది యూనిటుశక్తిని జలపాతసహాయమున వైజ్ఞానికముగ అతిజాగ్రత్తతో తయారుచేయుటవలన తాతావారి రేటు ఈయూరపియనులరేటుకన్న చాలాచౌక. అందువలన చిల్లరలకు ట్రాములకు ఈతాతా కంపెనీవారు స్వయముగ సప్లై చేయకూడదని ప్రథమమందు లైసెన్సునిచ్చునప్పుడు ప్రభుత్వమువారు షరతునేర్పర్చిరి.

ధారవలన కొండక్రిందయంత్రములద్వారా 60 వేలయశ్వశక్తిగల విద్యుచ్ఛక్తి జనింపజేసి, బొంబాయికి తీగలపైన బంపుటకు నేర్పాటుజరిగెను. కాని తాతాకంపెనీవారు దానిని స్వయముగానడుపలేరు. ఆసూక్కను తాతావారివద్ద ఖరీదుకుతీసుకొని, 'ఆంధ్ర వాలీపవర్ సప్లైకంపెనీ' అనుపేర మరియొకసంఘమువారాయంత్రాలయమును 1922 వ సంవత్సరమునుండి జరుపుచున్నారు. 'లోనవ్లా' కట్టడములకును ఈకంపెనీవానికిని కొన్నివివరములలో భేదముకలదు. దీనికార్యము జయప్రదముగనే యున్నది.

బొంబాయిమహానగరమందలి వివిధావసరములకు నీ రెండుకంపెనీలుపంపు విద్యుచ్ఛక్తియు వినియోగమై, ఇంకనధికముగ కావలసివచ్చెను. అంతట తాతాకంపెనీవారాపడమటికనుమల యితరప్రాంతములగూడ తిరుగపరిశోధించిరి. పూనాకు పడమర 25 మైళ్ళదూరమున నాకనుమలలో నీల, మూాల, అను రెండునదులు కలియును. వర్షకాలమున చుట్టుపట్లసెలయేళ్ల నీళ్లు నీలమూాలల సంగమపులోయలోజేరును. ఆనీటినచ్చట 'డాము' లతోనరికట్టి, 16 మైళ్లవెడల్పుగల చెరువుగజేసి, ఆనీటిప్రవాహముతో క్రొత్తజలపాతమును సృజించి, అందుండి యంత్రమూలమున విద్యుచ్ఛక్తిపుట్టించుటకు, తాతాకంపెనీవారు నిశ్చయించిరి. ఈ 'డాము' 150 అడుగుల ఎత్తు, 4000 అడుగులపొడుగు. ఇచట కొండను దొలిచి, అందుండి నీటికాలువను కొండయంచుకును, అందుండి క్రిందికిని, రప్పించిరి. ఇచట 1700 అడుగుల

ఎత్తునుండి వచ్చుధారతో విద్యుచ్ఛక్తి కల్గింపబడి, అటనుండి 76 మైళ్ళదూరమందున్న బొంబాయికి తీగలపై గొనిపోబడుచున్నది. ఇచటి విద్యుచ్ఛక్తిపరిమితి 170 వేల అశ్వశక్తి వరకుండును. ఇది టాటాపవర్ కంపెనీ అనబడును; 1927 నుండి 1929 వరకు టాటాకంపెనీవారే దీనినిజరిపి, తరువాత కొంతహక్కునుంచుకొని, దీని యాజమాన్యమును తగ్గించుకొనిరి. ఇదియు జయప్రదముగ నున్నది.

బొంబాయిలో టాటాకంపెనీవారి కార్యాలయములన్నియు సౌకర్యమునకై యొకే మహాభవనమున నెలకొల్పబడినవి. దానికి టాటాగారి స్వగ్రామమునకు స్మారకముగ 'నవసారిబిల్డింగ్స్' అని పేరు పెట్టబడినది.

ఈ మూడుజలవిద్యుచ్ఛక్తిసంఘములును సాలీనా సుమారు $2\frac{1}{2}$ లక్షల అశ్వబలమునగు శక్తిని పుట్టించును. బొంబాయినుండి పూనావరకు నీశక్తి యుండును. బొంబాయిలోని చాల మిల్లులకు నితరకర్మాగారములకు కలిపి, $1\frac{1}{2}$ లక్ష అశ్వశక్తిది ఖర్చుఅగును. వీని రేటు చాల చౌక † యగుటచే, బొంబాయికి మునిసిపలుఅవసరములకు, ట్రాముబండ్లకును, ఇటీవల బి. బి. సి. ఐ. కంపెనీవారి రైలులైను రైళ్ళ నడుపుటకునుగూడ, ఈకంపెనీలనుండియే విద్యుచ్ఛక్తి (ప్రభుత్వాంగీకారముతో)నందజేయుట కేర్పాటుజరిగి, అట్లు వారందజేయుచున్నారు.

---

† అచట టోకున యూనిటుకు అర్ధణా చొప్పున విద్యుచ్ఛక్తి దొరకును; మనప్రాంతములందు యూనిటుఖరీదు సుమారైదణాలు.

ఈపరిశ్రమవలన బొంబాయిప్రాంతపు వ్యవసాయాదులకును చాలనుపయోగము కలిగినది. పూర్వము సముద్రములోనికి పోవుచుండిన నీరు విద్యుచ్ఛక్తి పుట్టించుటకై కొండలనుండి మరల్పబడి, గొట్టములద్వారా యంత్రచక్రములపై బడి, క్రింద నేలపై పెద్దకాలువలుగ నిరంతరము పారును. అది స్వచ్ఛమగు వర్షోదకము; ఆచుట్టుపట్ల భూములను తోటలుగ జేసి, అందాసమృద్ధజలముతో కూరగాయలను, పూవులను, మంచిపండ్లను, విశేషముగ పండించి, బొంబాయికి పూనాకు సప్లై చేయుచున్నారు. ఇందుకు ప్రత్యేకసంఘము లేర్పడినవి. ఈనీరు జనులు త్రాగుటకును ప్రశస్తమైనది. అందువలన కొంత నీరు పానీయముగను ఉపయోగపడును. †

---

† టాటా జలవిద్యుచ్ఛక్తిసంఘము చాల లాభకరముగ పనిచేయుచుండుటవలన, ఆరీతిని తమప్రాంతమున మద్రాసుప్రభుత్వమువారు సుమారైదేండ్లక్రిందట 'పైకారాస్కీమ్' అనబడు ఉద్యమమును స్థాపించిరి. సహ్యాద్రి దక్షిణాగ్రమున (నీలగిరికొండల సమీపమున) 'పైకారా' అను చిన్న నదియొకటికలదు; దానినీరు కొండలోయలో పెద్ద యడ్డుగట్ల మూలమున నిలవజేయబడి, పెద్ద జలపాతమును, అందుండి విద్యుచ్ఛక్తియు, కలిగింపబడుచున్నవి. ఒకసం॥నుండి ఇందువిద్యుచ్ఛక్తి తయారగుచున్నది. ఈవిద్యుచ్ఛక్తిని నిలవజేసి, తీగలపైన నీలగిరి, కోయంబత్తూరు, సేలం, తిరుచనాపల్లి, మధుర మున్నగు తమిళజిల్లాలలోని పురములకును, గ్రామములకును గూడ, ప్రభుత్వమువారందజేయుచున్నారు. ఇందువలన వేలకొలది బీదలకు వృత్తులును, ఆజిల్లాల జనులకు చాల సదుపాయములును, ఏర్పడినవి. ఈపైకారా విద్యుచ్ఛక్తి, టాటాకంపెనీవారమ్మునంత చవుక గాకున్నను, ఆవిరియింజనుద్వారా మన మునిసిపాలిటీలలో జనింపజేయు విద్యుచ్ఛక్తికన్న చవుకగనే యున్నది.

## 16. అంత్యదశ.

వ్యవసాయము తరువాత, మనదేశపు పరిశ్రమలన్నిటిలో నెక్కువముఖ్యము, హెచ్చుమందికి జీవనాధారమైనది, దూది బట్టల పరిశ్రమ. దానివృద్ధికై, నాగపురం, బొంబాయి, అహమ్మదాబాదు, ఈమూడునగరములందును ఆధునికపద్ధతులపైన ఉత్తమకీతివగు దూదిబట్టలమిల్లులను జంషెడ్జితాతా స్థాపించెను; ఆదర్శరూపమగు వ్యాపారనీతినే యవలంబించి, అందు తనమిత్రులను, విద్యావంతులగు యువకులను, తరిఫీయతు చేసెను; అంతట తనజోక్య మక్కరలేకుండ, ఆయనయుద్యోగులే ఆపరిశ్రమల నడుపుకొనజొచ్చిరి.

అందుచే గలిగిన విశ్రాంతిని తాతా ఆపరిశ్రమవృద్ధి సందర్భమున అన్నిమిల్లులకును గలిగిన మహాసమస్యల పరిష్కారముకు వినియోగించెను: అవి కార్మికసమస్య, నౌకావ్యాపారము, ప్రశస్తమగు ప్రత్తిసాగు, బట్టలపన్ను మున్నగునవి; ఈసమస్యలచర్చను సవ్యమార్గమున జరిగించి వానిననుకూలముగ బరిష్కరించుటకు, ఆయన చాలదూరదృష్టితోవర్తించి, విశేష కృషిచేయుటయేగాక, తోటిమిల్లుదార్లయొక్కయు ప్రభుత్వాధికారులయొక్కయు సహకారమును సంపాదించుట యత్యవసరమయ్యెను. తాతా కుండిన పరిజ్ఞానము, దేశాభిమానము, దూరదృష్టి, తక్కినమిల్లుదార్లకు తరుచు లేకపోవుటయు, అందువలన తాతాగారికృషికి వెంటనే పూర్తియగుఫలము కలుగక

పోవుటయు గూడ, మనము గమనించియున్నాము. ఈకాల మందే ఆయన బెంగుళూరుప్రాంతమున పట్టుపరిశ్రమను స్థాపించి, దానిని జయప్రదముగ జేసెను; మామిడిపండ్లను చెడకుండ మంచులో నిలవజేసి వానిని విదేశములకు యెగుమతిచేయుట, జలలనుండి గొట్టములద్వారా నూతులకు నీరు రప్పించుట, మున్నగు కొన్ని యితరవ్యాపారముల ప్రయత్నమును గూడ ఆయన చేయుచుండెను. ఆవ్యాపారము లిప్పుడీదేశమున లాభకరముగ జరుగుచున్నవి. వీనిని మొదట ఆరంభించి మార్గదర్శకుడైనది తాతాగారే.

1898 నుండి, ఆయన మనదేశపు ఆర్థికసౌభాగ్యమున కవసరమగు విజ్ఞానాలయము, లోహపరిశ్రమ, జలవిద్యుచ్ఛక్తి, ఈమూడింటిస్థాపనయందును ప్రత్యేకదీక్ష వహించి, వానికై నిరంతరము కృషిచేసెను. ఈమూడును చాల గొప్పసంస్థలు, ఇదివరలో మనదేశమున నిట్టివి లేవు. వీనికి సంబంధించిన అనేక విజ్ఞానవిషయములను సమస్యలను పరిష్కరించుటకు ప్రతిభ, విశాలజ్ఞానము, అమితచాతుర్యము, నిరంతరశ్రమ, దూరదృష్టి అవసరములు.

ఆయన యీమహాసంస్థల స్థాపనకై మనదేశపు వివిధ ప్రాంతములను జగద్విఖ్యాతులగు విజ్ఞులచేత, విశేషవ్యయము కోర్చి, పరిశోధింపజేసెను; స్వయముగా యూరపు అమెరికాలకు చాలసారులు వెళ్ళి, అచట పరిస్థితుల గ్రహించి,

సుప్రసిద్ధకర్మాగారముల బరీక్షించి, అనేకసమస్యల నచటి గొప్పవ్యాపారనాయకులతో చర్చించి, ఆసంస్థలను స్థిరముగ స్థాపించి నడుపగల ఉత్సాహులు విశ్వాసపాత్రులునగు పాశ్చాత్య ప్రవీణుల నెన్నుకొనెను; (ఆరంభదశలో వారి సహకార మత్యవసరమాయెను.) ఆయుద్యమములకాంగ్లసీమలోని భారత మంత్రియు మనదేశమందున్న భారతప్రభుత్వమువారును సుముఖులగునట్లు చేయగలిగెను; అనేకవిఘ్నముల నెను ర్కొని దాటెను; వానికి సంబంధించిన యమూల్యమగు వాఙ్మయమును అనేకపరికరములను భద్రపరచి, తనపుత్రమిత్రులకు వశముచేసెను.

ఈసంతతకృషివలన 1900 నుండియు, ఆయన యారోగ్యము క్రమముగ చెడి, దేహము క్షీణించెను; నీరసము హెచ్చెను. వ్యాపారసందర్భమున ఆయన తరుచు విదేశములందు యాత్ర చేయవలసివచ్చెను. అమెరికా యూరపులనుండి 1902 సాలాఖరున మనదేశమునకు తిరిగివచ్చి, తన మహోద్యమముల స్థాపనకై సిద్ధముచేసిన ఆయా ప్రణాళికల పరిశీలించుచు, శ్రమపడుచుండగ, ఆయనకు దౌర్బల్యము క్రమముగ హెచ్చి, వ్యాధి యధికమయ్యెను. వైద్యులేర్పర్చిన యాహారనియమముల నాయన సరిగా పాటింపలేకపోయెను. వెంటనే యారోగ్యముకై యూరపుకు వెళ్ళవలెనని వైద్యు లాయనను ప్రోత్సహించిరి. ఆయన మొదట నంగీకరించలేదు; కాని తరువాత తన సహజమిత్రుడగు ఆర్. డి. తాతా తొందరజేయగా, ఆయ



'జంషెడ్జీ' తాతా, 'ఆర్. డి.' తాతా, 'దోరాబ్జి' తాతా,
(నిలుచున్నవారు) 'రత్నజీ' తాతా.

132A

నతో నీజపురు వెళ్ళెను; అచ్చట నొకనెల యుండినమీదట, జ్యేష్ఠపుత్త్రుకును కోడలును 1904 ఫిబ్రవరిలో ఆయన నిటలీకి తీసికొనిపోయిరి.

అప్పుడు భారతదేశమున ఆయన భార్యయగు హీరాబాయి, చనిపోయెను; ఆవార్త తెలిసినమీదట జంషెడ్జి యారోగ్య మింకను క్షీణింపజొచ్చెను. దొరాబ్జితో వియన్నా నగరము పోయి, అందుండి జంషెడ్జి, వైద్యుల సలహాపైన, జర్మనీలోని ఆరోగ్యస్థానమగు 'నౌహీం' పురముకు చేరెను. ఆయన మనోబలముమాత్రము తుదవరకల్లే యుండెను. మరియు, ఆదుర్బలస్థితిలో గూడ, జంషెడ్జి మనదేశపు ఆర్థికాభివృద్ధినిగూర్చి యాలోచించుచునే యుండెను. యూరపులో క్రొత్తగా కనబడిన ఉపయోగకరమగు కొన్ని ఫలవృక్షములను పుష్పజాతులను మనదేశమున నెట్లు పెంచవచ్చునో, తనమిత్త్రులతో చాలసార్లు చర్చించుచుండెను. నీరసమును వ్యాధియు హెచ్చుచున్న కబురు తెలసి, దొరాబ్జి తన భార్యతో వియన్నానుండి నౌహీముకు వచ్చి, తండ్రిని కలుసుకొనెను. తాను తలపెట్టి యత్నించుచున్న మహోద్యమములను శ్రద్ధతో పూర్తిచేయుడని, స్వదేశపు పారిశ్రామికస్థితిని వృద్ధి చేయుడనియు, దొరాబ్జితోను మిత్త్రులతోను తన యంత్యాభిలాషమును తెల్పి, జంషెడ్జితాతా 19-5-1904 తేదీని కాలధర్మమునొందెను.

ఆదుస్థితిలో, వెంటనే దొరాబ్జి యామృతదేహమును తైలసిక్తముజేసి, నౌకామునుండి లండనునగరమునకు జేర్చెను. అచట యూరపునందుండిన పార్సీలందరును, చాలమంది భారతీయ మిత్రులును, జంషెడ్జియొక్క పాశ్చాత్యమిత్రులును సమావిష్టులైరి; అంతట, అచటి పార్సీదేవాలయమున పార్సీమతవిధుల ప్రకారము సంస్కారము చేయబడెను. (పార్సీలమృతదేహముకు ఖననము దహనము కూడ జరిగింపరు. పార్సీదేవాలయముల పైభాగమున మృతసంస్కారమునకై ప్రత్యేకస్థానమేర్పడి యుండును; అందు కళేబరము మాత్రయుతముగ, డేగలుమున్నగు జంతువులకు బలిగ వదలివేయబడును. నరునియాస్తియే గాక యాతని సర్వస్వమగు దేహమును జీవితకాలమందును అనంతరము కూడ, ఇతరజీవుల యుపయోగమునిమిత్తమే వినియోగముకావలెననియు, వ్యర్థముగబోకూడదనియు, తెల్పు మహాసిద్ధాంతమిందిమిడి యున్నదని తోచును. పార్సీలలో చాలమంది మహాదాతలగుట కీసంస్కారసూత్రముకొంతవరకు తోడ్పడియుండవచ్చును.)

మరణించునప్పటికి జంషెడ్జివయస్సు 65 సంవత్సరములు. భారతీయుల దాయాపాయుర్దాయము చాలమంది విదేశీయుల దానికన్న మిక్కిలి తక్కువ. అందువలన జంషెడ్జిమృతియకాలమరణమనుటకు వీలులేదు. భారతజాతీయపితామహుడుగనుండిన దాదాభాయినౌరోజీ, పౌరపరిపాలనధురంధరుడగు ఫిరోజిషామెహతా, దిన్షావాచా,మున్నగు కొలదిమంది జంషెడ్జి

మిత్రులింకను చాలకాలము జీవించిరి; కాని, భారతీయ ప్రముఖుల లో చాలమంది షష్టిపూర్తికాకుండగనే మరణించుటయు, వారి ప్రజ్ఞానుభవములు దేశమునకు పూర్తిగ వినియోగింపకపోవుటయు, శోచనీయవిషయము. ఆంగ్లదేశమందు 65 ఏండ్లు నడివయస్సుగనే భావింపబడును.

జంషెడ్జితాతా మరణవార్త వెంటనే ప్రపంచమంతటను తంతిద్వారా వ్యాపించెను. అది భారతీయులను శోకసాగరమున ముంచెను; మనదేశమం దన్నిప్రాంతములందును విచారసూచక సభలుజరిగి, జనులదుఃఖము తెలుపు తీర్మానములుచేయబడెను. తరువాత కొంతకాలమునకు జంషెడ్జి స్థాపింప యత్నించుచుండిన లోహపరిశ్రమ జలవిద్యుచ్ఛక్తిపరిశ్రమ సాధింపబడి, వాని జాతీయ ప్రాముఖ్యము జనులకు బోధపడెను. అంతట జంషెడ్జి తాతాగారికి స్థిరమగు స్మారకచిహ్న మేర్పర్చుట యుక్తమని జనులు నిశ్చయించి, కొందరుప్రముఖుల నందుకొకసంఘముగా నేర్పర్చిరి. అందుకు చందాలవలన 47000 రూపాయలు వసూలాయెను. ఆస్మారకచిహ్న మేరీతిగనుండవలెనని కొంతచర్చజరిగి, తుదకు ఆయన జీవితకృషికి ముఖ్యరంగస్థలమైన బొంబాయి నగరమధ్యమున స్థలముతీసికొని, అందు ఆయనశిలాప్రతిమను నెలకొల్పుటకు, నిశ్చయింపబడెను. ఆప్రకారము బొంబాయిలో జి. ఐ. పి, రైల్వేకంపెనీవారి కార్యాలయము నెదుట, విశాల వీధులు కలియుచోట, మధ్యస్థలమందు, జంషెడ్జి తాతాగారి

శిలాప్రతిమ 1912 లో స్థాపింపబడి, అప్పటి బొంబాయి గవర్నరుచే బహిరంగము చేయబడెను.

తనకు శిలాప్రతిమను జ్ఞాపికలను నెలకొల్పుట జంషెడ్జి కెంతమాత్రము నిష్టముకాదు; అది యాయన ప్రకృతికే వ్యతిరిక్తము. కాని యాప్రతిమ ముందుతరముల యువకులందరకు పారిశ్రామిక జీవనముకు జాతీయోద్ధరణకు నుద్బోధకముగనుండును. ఆయనకు నిజమైన జ్ఞాపకచిహ్నములు బెంగుళూరులో, జంషెడ్పురమందు, నాగపురమున, బొంబాయి అహమ్మదాబాదులలో, ఇట్లు మనదేశమం దన్ని ప్రక్కలను ఆర్థికోపకారకమగు సంస్థలరూపమున నేర్పడియేయున్నవి. భారతీయులుగూడ తదేకదీక్షతో పనిచేయునెడల స్వయంకృషివలననే మనదేశమున పెద్దపరిశ్రమల నడపి, వానిని పాశ్చాత్యసంస్థలకు తీసిపోకుండునట్లు జయప్రదముగ జేయవచ్చునని, ఈసంస్థలును ఆశిలాప్రతిమయు జ్ఞప్తికి తెచ్చుచుండును.

---

## 17. ఇతర తాతాసంస్థలు.

జంషెడ్జి యారంభించిన పునాదులపైననే, ఆయన నియమించిన రీతినే, ఆయనకుమాళ్లు విజ్ఞానాలయమును, లోహయంత్రాలయమును, జలవిద్యుచ్ఛక్తికర్మాగారములను, నిర్మింపజేసిరి; వారు బంధుమిత్రుల సహాయముతో వానిని క్రమముగ వృద్ధిజేసిరి.

జంషెడ్జికి రెండవకుమారుడగు రత్నజితాతా 1871 లో జనించి, బొంబాయిలో విద్యాభ్యాసముచేసి, 1892 లో వివాహమాడి, తన తండ్రియొక్క పరిశ్రమలలో పాల్గొనెను; కాని ఆయన ముఖ్యముగ జంషెడ్జి బొంబాయినగరాభివృద్ధికై చేయు వివిధప్రయత్నములందు చాల సాయము చేయుచుండెను. బొంబాయినగరపు చుట్టుపట్ల స్థలములను బాగుచేసి, వాసయోగ్యముగజేసి, వానిలో పేటలు నిర్మింపజేయుటలో చాల కృషిచేసెను. బొంబాయిలో తన తండ్రికున్న వివిధభవనాములను వృద్ధిచేసి, తండ్రిచేసిన దానములకు చాల సాయముచేసెను. ఆయనకు సాంఘికశాస్త్రమం దభిమాన మధికముగ నుండెను. బెంగుళూరు విజ్ఞానాలయమందు సాంఘికశాస్త్రము బోధించుటకును, అందు ప్రత్యేకపరిశోధనల జేయుటకును, తనతండ్రి యనంతరము తనవాటాఆస్తిలోనుండి పెద్దధర్మము చేయుటకు యత్నించెను; కాని ప్రభుత్వమువారు ఆర్థికబాధాదికారణములచేత దాని నంగీకరింపరైరి.

తరువాత తాతాకంపెనీవారి లండనుశాఖ పర్యవేక్షణకై, రత్నజీతాతా యింగ్లండుకు జని, లండనునందే యుండిపోయెను. అచట తనబంధువగు శక్లత్వాలాతో కలసి వ్యాపార కార్యములందును సాంఘికసమస్యల పరిష్కారమందును పాల్గొనుచుండెను. లండనులో సాంఘికశాస్త్రపరిశోధనలకై చాల ద్రవ్యమును నిధిగనిచ్చెను, కొంతకాలముకు జబ్బుచేసి, రత్నజి తాతా 1918లో నింగ్లండులోనే చనిపోయెను. దొరాబ్జి రత్నజీ లిద్దరును చాలమందిబీదలకు విశేషద్రవ్యసహాయము చేయుటయేగాక, అనేకప్రజోపకారి సంస్థల బోషించిరి. దొరాబ్జి తాతా భాండారకర సంస్కృతపరిశోధన సంస్థకును పూనాలో పార్సీలపూర్వచరిత్రగూర్చి విమర్శచేయుటకును, చాల ద్రవ్యసహాయముచేసెను. సోదరులిరువురును జనోపయోగకరమగు కొన్నిపరిశోధనలను స్వయముగ చేయించిరి.

జంషెడ్జి జ్యేష్ఠపుత్త్రుడగు దొరాబ్జితాతా తనతమ్ముని కన్న నెక్కువ దృఢగాత్రుడు; ఆయన తనతండ్రియభిలాషను పూర్తిగ సాగించి, జంషెడ్జి యారంభించిన యుద్యమముల నన్నిటిని జయప్రదముగ నెరవేర్చి, వృద్ధిచేసెను. తాతాకుటుంబము మనదేశపు పరిశ్రమల వృద్ధికై చేసిన యపారకృషికై, దొరాబ్జి రత్నజీ లిద్దరకును ప్రభుత్వమువారు 'సర్' బిరుదము నిచ్చిరి. భారతజాతి తనఆమోదమును మరియొక విధమున స్పష్టముగ తెల్పెను. మనజాతీయమహాసభతో బాటు, ఆసభ

వారి సహాయముతో, ప్రతిసాలున, అఖిలభారతపారిశ్రామిక మహాసభ జరుపబడుచుండెను * 1915 లో జరిగిన పారిశ్రామికమహాసభ సర్ దొరాబ్జితాతాగారి అధ్యక్షతనే మహోత్సాహముతో నడిపింపబడెను. దొరాబ్జితాతాకును విద్యాసక్తి యధికమే. తాను విద్యనభ్యసించిన కేంబ్రిడ్జిలో పరిశోధనల జరిగించుట కావిశ్వవిద్యాలయమున కాయన 25000 పౌనుల నిచ్చెను.

ఇట్లు తండ్రిపరిశ్రమల జరిపి, మరికొన్ని క్రొత్తపరిశ్రమలకూడ స్థాపింప దోడ్పడి, దొరాబ్జితాతా 1932 లో కాలము చేసెను. పోవుటకుముందు తనఆస్తిలో విశేషభాగము నొక ధర్మనిధిగ నేర్పర్చి, ఆద్రవ్యమును కొందరు ట్రస్టీలద్వారా చాల ఆర్థికసాంఘికధర్మకార్యములకు వినియోగించుటకు నిర్ణయించెను. ఆసంస్థ 'సర్ దొరాబ్జితాతాట్రస్టు' అనుపేర బొంబాయిలో పనిచేయుచున్నది. వారిసహాయమున బొంబాయిలో సాంఘికశాస్త్రబోధకు పరిశోధనకు ప్రత్యేక విద్యాలయము స్థాపింపబడినది.

లోగడ వివరించినవానినేగాక, దరిమిలాను తాతా కంపెనీవారు మరికొన్ని పరిశ్రమలనుగూడ స్థాపించినారు. ఈకాలమున పాశ్చాత్యదేశములందు మెకానికల్ ఇంజనీరింగు

* కొన్నియేండ్లనుండి ఆసభ ప్రతిసంవత్సరమును కాంగ్రెసుతో సంబంధములేకుండ వేరుగా జరుగుచున్నది.

అనబడు యంత్రవాస్తువిద్య గొప్పవిజ్ఞానముగ వృద్ధియైనది. అందువలన, అత్యద్భుతములగు మహాభవనములు గొప్ప ఆనకట్టలు వంతెనలు క్రేనులు మున్నగునవి నిర్మింపబడు చున్నవి. అట్టి ఉపయోగకరములగు గొప్పకట్టడములను వైజ్ఞానికముగ నిర్మించుటకు, వాస్తువిశారదులు సభ్యులు గాగల ఒకనిర్మాణసంఘమును తాతాకంపెనీవారు స్థాపించిరి. ఇదివరలో రైల్వేలబోలు పెద్దకంట్రాక్టులను పాశ్చాత్యులే తీసికొనుచుండిరి. అట్టివాని నిప్పుడీకంపెనీవారు తీసికొని, సులభముగ ప్రజ్ఞతో నిర్వహింప గల్గుచున్నారు. తాతాకంపెనీవారి వివిధ కార్యాలయముల నుంచుటకు మహాద్భుతమగు నొకే భవనము నీకంపెనీవారు నిర్మించిరి. (దీనికే నవసారి బిల్డింగ్సు అని పేరు.)

దొరాబ్జితాతాయు ఆయనమిత్రులును కలసి, రెండు కోట్ల రూపాయల మూలధనముతో, 'న్యూ ఇండియా అస్యూరెన్సు కంపెనీ' అనుపేర క్రొత్తరకపు భీమాకంపెనీని స్థాపించిరి. దీని నిలవద్రవ్యము మనదేశమున గొప్పపరిశ్రమల సంఘములకును బలీయమగు ధనసంస్థలకును ఈయబడి, భద్రముగ వృద్ధిచేయబడును. అందువలన ఆదేశీయపరిశ్రమలకు ద్రవ్య సహాయము కల్గును; ఆయిన్స్యూరెన్సు కంపెనీయు చిరస్థాయిగ నుండును. మరియు, ఇదివరలో మనదేశీయములగు కంపెనీలలో లేని ప్రశస్తమగు క్రొత్తరకపు భీమాలకును, ఇందు ఏర్పాటు కలదు. నరులకు ప్రమాదమరణము కలిగినచో హెచ్చుసొమ్ము

నిచ్చుట, అంగవైకల్యమువలన నశక్తులగువారికి సొమ్ము నిచ్చుట, జలాగ్నిప్రమాదములకు లోనగు భవనములు ఓడలు సరుకులు మున్నగువానికిని భీమాపట్టుట, ఇట్టివిందు కలవు. ఇవి పెద్ద వర్తకులకు, వ్యాపారస్తులకు, కార్మికులకును, చాల వినియోగించును.

ఇట్లే కొబ్బరినుండి వివిధవస్తువుల జేయుటకు, 'తాతా ఆయిల్ మిల్స్ కంపెనీ' అనుసంఘము స్థాపింపబడినది. మనదేశపు వివిధప్రాంతములందు చిరకాలమునుండి కొబ్బరితోటలు విశేషముగ గలవు. ఈతోటలు కొన్ని మనము కాయలతినుటకును, తక్కినవన్నియుకల్లుగీతకును ఉపయోగపడుచున్నవి. కొబ్బరియు, ఇంకను ఇతరవిధములగు చమురుగింజలును, చాలవరకు విదేశముల కెగుమతి యగుచున్నవి. అట్లుగాక కొబ్బరినుండి చమురుగింజలనుండి ఈకంపెనీవారు వైజ్ఞానికపద్ధతులచే చిరకాలము నిలవయుండు పరిశుద్ధమగు నూనెలను, ప్రశస్తమగు చాలరకముల సబ్బులను చేయుచున్నారు. మరియు ఈకొబ్బరిసారము శుద్ధిజేసి 'కోకోజెం' అనబడు చౌక నేతినిగూడ చేయుచున్నారు. మనము మామూలుగ వాడు నేయి శాకాహారము కాదు; అది పశుసంబంధము. అట్లుగాక 'కోకోజం' కేవలము వృక్షసంబంధము. ఈకంపెనీవారు బట్టలసబ్బులు మున్నగు చాలరకముల వస్తువుల జేయుచున్నారు; అవి చౌకవి ; అవి విదేశపువాని కెంతును తీసిపోవు.

'తాతాఎయిర్వేసు' అనబడు ఆకాశవిమానసంఘముని ఇటీవల ఈసంఘమువారి సహాయమున ఆరంభమైనదే. తాతా కరాచీ బొంబాయిలనుండి హైదరాబాదుగుండ మన మద్రాసు ప్రాంతమునకు, తిరువాన్కూరుకు, ఈకంపెనీవారు విమానములను నడుపుచున్నారు. తాతాకంపెనీలు చేయు వ్యాపారము లింకను కొన్నికలవు.

మనదేశపు పారిశ్రామికసంస్థలన్నిటిలో తాతాకంపెనీయే ప్రధానము. జంషెడ్జితలపెట్టి స్థాపించినవానిని వారు వృద్ధినొందించినారు; క్రొత్తపరిశ్రములను స్థాపించుచున్నారు. ఇతరపరిశ్రామికులతో సృహృద్భావముకలిగి, దేశపు ఆర్థికసంపత్తిని పెంపొందించుచున్నారు. ఆకంపెనీలో పుంజీపతులకుండు కొన్నిలోపము లున్నను, అనేకసుగుణములును కలవు. ప్రస్తుతము తాతాకంపెనీలు రమారమి నూరుకోట్లరూపాయల మూలధనముతో వివిధప్రాంతములందు చాల పరిశ్రమల స్థాపించి నడుపుచున్నారు. వంగదేశము మొదలు మళయాళప్రాంతమువరకు దేశమంతటను వీరి కార్ఖానాలు పనిచేయుచున్నవి. ఇందు రమారమి మూడులక్షలజనులు పనిచేయుచున్నారు. ఇందు కొంతమంది విద్యావంతులకు, ప్రభుత్వోద్యోగమునందుకన్న, హెచ్చు జీతములుండును. ప్రపంచమందలి ముఖ్యదేశము లంతటను వీరి కార్యాలయము లున్నవి. అంతర్జాతీయముగను దీనికి చాల ప్రసిద్ధి ప్రాముఖ్యము కలవు. వీనికన్నిటికిని మన కథానాయకుడగు జంషెడ్జితాతాయే బీజమని చెప్పవచ్చును.

తాతా కంపెనీ స్థాపించిన యీసంస్థలన్నియు రిజిష్టరు చేయబడిన లిమిటెడుకంపెనీలు. ఈకంపెనీల వాటాలను అందరును కొనవచ్చును. వాటాదార్లు సమావేశములందు నీకంపెనీల డైరక్టర్లను ఎన్నుకొనబడుదురు; వారిచర్యలు, కంపెనీస్థితి ఆసమావేశములందు చర్చకు ఆమోదమునకు వచ్చును. ఒకరిద్దరు వ్యక్తులపైనే ఆధారపడు సంస్థలు వారియనంతరమును, వారిపరిస్థితులు మారుటవలనను, తరుచు త్వరలోనే క్షీణించిపోవుట యెరుగుదుము. అట్లుగాక నివి అనుభవము పలుకుబడి గల బొంబాయి వ్యాపారస్థులచే ప్రస్తుతము నడుపబడుచున్నవి. వీని యన్నిటికి కేంద్రకార్యాలయములు బొంబాయి లోనే యుండును. ఈసంస్థలందు ప్రజాప్రతినిధు లెక్కువశ్రద్ధవహించి, చాలమంది వాటాల దీసికొని, క్రమముగ వానిని జాతీయ సంస్థలుగ జేయింప యత్నించుట యవసరము.

---

## 18. తాతాస్వభావము.

తాతాగారి జీవితపు ముఖ్యసంగతు లిట్లు పైయధ్యాయములందు వివరింపబడినవి. అందు, చాలవరకు, ఆయన స్వరూపస్వభావములును సూచితములు. అందలి ముఖ్యసంగతుల నచట స్మరింతము.

జంషెడ్జితాతా కొంచెము పొట్టియై, చామనచాయవర్ణము సౌమ్యమగు ముఖవర్చస్సు గలిగియుండెను. అయనశరీరము దృఢమైనదే; ఆయనమనోబలము, సహృదయత, అద్భుతములు. ఆయన తన నిత్యకృత్యములను సకాలముగ జేసికొను నలవాటు గలిగియుండెను. ప్రతిదినమును, ఉషఃకాలముననే లేచి, సముద్రతీరమున బాలసూర్యుని దర్శించి, అచట కొంత సేపు నడచి, కాల్యకృత్యములన్నిటిని దీర్చుకొనును; ఉదయము 8 గంట లగునప్పటికే, తనగుర్రపుబండిపై నెక్కి, ఆయన కొందరుమిత్రుల యిండ్లకు బోయి, వారితో మాట్లాడును; అప్పటికి వారు తరుచు పడకనుండి లేవబోవుచుండిరి. అటనుండి తిరుగ వచ్చి, ఉదయభోజనము కాగనే, తొందరవ్రాతపనియున్న, దానిని స్వయముగ చేసికొనును; లేనిచో నేదేని చదువుకొనుచుండును. మధ్యాహ్నము తనకార్యాలయమునకు బోయి, అచట సాయంకాల మూడుగంటలగువర కతిశ్రద్ధతో తన వ్యవహారముల జేసికొనును; అంతట నొకగంట విహారమునకు పోవును; లేదా క్లబ్బులో మిత్రులతో సంభాషించును; అంతట

గృహాముచేరి, చక్కగ భుజించును. (ఆయన కొంచెము భోజన ప్రియుడు.) మద్యపాన మెన్నడును చేయుటలేదు; రాత్రి చాల సేపు గ్రంథముల జదువుచుండును. ఆయనకు మంచి పుస్తకముల జదువుటయన్న చాల ప్రీతి. ఆటలాడుట కాయనకు తీరిక, అభిలాషయుకూడ, లేకుండెను. కాని ఆయన మంచి వ్యాయామగ్రంథములగూడ దెప్పించి, తనకొ్ల్లబ్బుల కిచ్చును; తానును చదువును. ఆయన గుజరాతీ హిందూస్థానీలలోనే గాక, ఇంగ్లీషులోను మంచి విద్వాంసుడయ్యెను. ఆయనరచనశైలి శబ్దాడంబరములేక, సులభమై, ఓజోవంతమై యుండెను.

ఆయన వ్యక్తిజీవనము పరిశుద్ధమైనది. ధనికుడైనను, ఆయన యెన్నడును వ్యసనములకై ద్రవ్యమును దుర్వినియోగము చేయుటలేదు; తనయింటిపిల్లలకు దురభ్యాసములు కలుగకుండునట్లు జాగ్రత్తతో నుండుచు, వారికి మితవ్యయమును స్వతంత్రముగ వ్యవహరించుటకును, నేర్పుచుండెను. మద్యపానము, స్త్రీలోలత, జూదము, పందెములు, ఆటపాటలు, ఆడంబర వేషములు, ఆయన కెన్నడును లేవు. విదేశసంచారములందు గూడ దుస్సాంగత్యమున తన సంప్రదాయమునకు భిన్నమగు పాశ్చాత్యుల కేళీవిలాసములందును బడకుండ, అప్రమత్తుడై యుండెను. (రుచికరమగు భోజ్యవస్తువుల జూచినప్పుడు మాత్ర మాయనకు కొంచెము జిహ్వాచాపల్య ముండెనట). తాతా నిరాడంబరుడై, తెల్లని సాదాదుస్తులను పార్సీల సాంప్రదాయికమగు పాగానో టోపీనో ధరించెను.

ఆయనగుణములలో రెండవది సౌజన్యము: బంధుమిత్రాదు లందరియందును ఆయనకు ప్రేమయుండెను; ఎన్నడును, ఎవరియందును, తాతాకు అసూయ, మాత్సర్యము, లేవు. అందరితోను సహృదయుడై, ఆయన యెల్లప్పుడును న్యాయబుద్ధితోనే యుండెను. ఆయనతో వ్యవహరించువా రందరును గాఢమిత్రులై, విశ్వాసముగలిగి, తామును విశ్వాసపాత్రులై, ఆయన కన్నివిధములను తోడ్పడుచుండిరి. ఇతరులయందు మనము విశ్వాసముతో వర్తించినచో, వారును మనయందు విశ్వాసముగలిగియే యుందురు. మోసము, పేరాస తాత్కాలికముగ లాభకరమైనట్లు కనబడినను, వ్యాపారమునగూడ నీతి న్యాయశీలతయునే తుదకు స్థిరలాభ మొసగుననుటకు తాతాజీవితమే నిదర్శనము.

ఆయన నిగర్వి, వినమ్రుడుగా నుండెను; జనులనుండి గాని ప్రభుత్వమునుండి గాని పేరుపొంద యత్నింపలేదు. విజ్ఞానాలయమునకు తన పేరుపెట్టవలదని నిషేధించెను; గౌరవపదవులకు బిరుదములకు ఎన్నడు నపేక్షింపలేదు; బొంబాయిలో గౌరవ న్యాయాధికారిగను, తరువాత విశ్వవిద్యాలయ సభ్యుడుగను, మాత్ర ముండెను.

ఐనను, స్వజాతిగౌరవమునకు భంగము కలుగునని తోచినప్పుడుమాత్ర మాయన పట్టుదలతో నాత్మగౌరవమును కాపాడుకొనుచుండెను. ఒకసారి 1863 లో నొకయుత్సవము జా

చుచున్నప్పు డొకపెద్ద యాంగ్లోద్యోగి అన్యాయముగ తనతో దుర్భాషలాడగా, ఆతని నెదిర్చి, తాను కారాగృహముకు పోవు టకుగూడ సిద్ధమై, ఆతడు తనకు అసందిగ్ధముగక్షమార్పణ చేసి కొనువరకావిషయమును వదలలేదు. ఆంగ్లేయుల నౌకలందు భారతీయులను న్యూనముగ జూతురనియు, వారికేవ్రులు మాత్రము హెచ్చుగ నుండుననియు గమనించి, జంషెడ్జి ఆంగ్లే తరములగు జర్మను మున్నగువారి నౌకలపైననే సాధారణముగ ప్రయాణము చేయుచుండెను.

ఆయన కార్యదీక్ష మూడవ సుగుణము: జంషెడ్జి సామాన్యకుటుంబమందే జనించెను. ఆయనతండ్రి గొప్ప యైశ్వ ర్యవంతుడుకాడు. వ్యాపారజీవనమున అదృష్టమే ప్రధానమని కొందరు భావింతురు; అదితప్పు; జంషెడ్జి కదృష్టలాభ మొకప్పు డు కలుగుచుండినను, చాలసారు లాయనకు అదృష్టపూర్వము లగు నష్టములును కలిగెను; దూది యెగుమతి వ్యవహారము చేయుచో, 1865 లో, ఆయన లండనులో చాలసరుకు నిలవ జేసి, అచట క్రొత్తగా బ్యాంకునుగూడ స్థాపించుచుండినప్పుడు, అమెరికా సంధిచే పరిస్థితులు హఠాత్తుగ విషమించి, తోటి కంపెనీలు దివాలాతీయగా, తాతాకును ఆర్థికస్థితి చాల క్లిష్ట మయ్యెను; అప్పుడు బొంబాయిలోను, ప్రేమచందురాయ చందు బ్యాంకు దివాలావలన, తాతాకు చాలనష్టముకలిగెను. 1887 లో, స్వదేశీమిల్లు స్థాపనకై కుర్లాయొద్దకొనిన 'ధరంసీ

మిల్లులోని యంత్రము లెంతబాగుచేసినను పనికిరాక, ఆక్రయము మోసపువ్యాపార మయ్యెను; బొంబాయి నివేశనములపైన బట్టలపైన ప్రభుత్వమువారు పన్ను విధించినప్పుడు, ఆయన కధికారులతో తీవ్రవివాదము కలిగెను; అంత ప్రభుత్వోద్యోగులు న్యాయపద్ధతికి కట్టుబడలేదు. చాలవ్యయప్రయాసలకు లోనై, తాతా లోహపరిశ్రమస్థాపనకై మధ్యరాష్ట్రపు చాందాగనులందు వ్యాపార మారంభింపబోగా, ప్రభుత్వమువారు వానిని కౌలుకిచ్చుటకు నిరాకరించిరి. ఆయాపరిశ్రమల యారంభమున, ముందుగా వేలకొలది రూపాయల ఖర్చుతో, విశేషశ్రమకు లోనై, దీర్ఘపరిశోధనలజేసి, జాగ్రత్తతో నెన్నియో విఘ్నముల నెదుర్కొనవలసివచ్చెను. జపాను నావికులతో కలసి ఓడ వ్యాపారము జరిపినప్పుడు, తన మిత్రులగు బొంబాయివర్తకులు ద్రోహమొనర్ప, ఆవ్యాపారము భగ్నమయ్యెను. అట్టి క్లిష్టసమయములందుగూడ, ఆయన వెనుదీయక, న్యాయబుద్ధితోను ధైర్యోత్సాహములతోను నిరంతరము కృషిచేసి, కష్టములను తుదకు దాటగల్గెను. "విఘ్నైః పునఃపునరపి ప్రతిహన్యమానాః ప్రారబ్ధముత్తమగుణా నపరిత్యజంతి'' అను సుభాషిత మాయనకుచక్కగ వర్తించును.

వ్యాపారదక్షత ఆయనలో మూర్తీభవించినది. అది కొంతవరకు పార్సీలందరికిని సామాన్యగుణము. కాని ఆయనప్రజ్ఞ మహాప్రతిభగ పరిణమించి,వ్యాపారముదారితేరిన పాశ్చాత్యనా

యకులగూడ నాశ్చర్యచకితులగావించినది. ఏయేపరిశ్రమలస్థాపించిన తనకును దేశమునకునుగూడ లాభముకల్గునో, వాని నేప్రదేశమున స్థాపించుట యుచితముగ నుండునో, వానిని నవీనపద్ధతులలో నెట్లు నడుపవచ్చునో, వానిపరికరములను వివరములను ఎట్లు సిద్ధపర్చి యుపయోగించుకొనవలెనో, గమనించి గ్రహించుటలో ఆయనకుండిన చాతుర్యము, దూరదృష్టి, అద్భుతములు. ఆప్రతిభ ఆయననిరంతరకృషిచేతను, తదేకదీక్షచేతను, ఇంకను వర్ధిల్లెను.

ఆయనప్రపంచజ్ఞానము, మానవతత్వపరిజ్ఞానము, అసమానములు. ఆయన యూరపుకు అమెరికాకుజపానుకు అవసరమైనప్పుడెల్ల స్వయముగ వెళ్ళుచుండెను; అది వ్యాపారవృద్ధికి చాలతోడ్పడెను. వివిధదేశములందు సంచరించుట ఆయనకు చాలప్రీతిగ నుండెను. కాని తనజ్ఞానమును లోకానుభవమును వృద్ధిజేసికొనుటకే దేశాటనమును ఆయన పూర్తిగ వినియోగించుకొనెను; మనదేశమందును విదేశములందును సంచరించునప్పుడు, ఆయాప్రాంతముల జనుల వివిధపరిశ్రమలను వారియాచారములను, గృహనిర్మాణములను, వ్యవసాయాది పద్ధతులను, అచటి వస్తుసముదాయమునుగూడ, జాగ్రత్తతో గమనించి, ఆయనుభవముతో తనవస్తునిర్మాణపద్ధతులను జనుల కనుకూల మగునట్లు చేయుచుండెను; జనులకిష్టమగు వానినే తయారుచేయగల్గెను.

కాల మమూల్యమని గ్రహించుటచే జంషెడ్జి తనకాలమునెన్నడును వృథపరుపలేదు; సంచారములలోను ఆయన కేవల వినోదముల జూడక, తాను సంకల్పించు ఉద్యమముల వృద్ధికి వలయుసంగతులపైనే తనదృష్టినుంచుచు, విదేశపరిశ్రమలందలి విశేషములను చౌకపద్ధతులను, క్రొత్తవస్తువుల ఉత్పత్తివిధములను, మనదేశమందు ప్రవేశింపజేసెను. మనకు ముఖ్యమగు వస్త్రపరిశ్రమ బాగుపడుటకై ఆయన యవలంబించిన వివిధపద్ధతులు ఆయనప్రజ్ఞకు నిదర్శనములు.

వ్యాపారములోను ఆయన స్వార్థపరుడుకాక, భారతజాతిక్షేమమే ప్రధానముగ భావించెను; ఆకాలమున, ఎగుమతిచే ముదుకనూలుబట్టలపైన లాభము వచ్చుచున్నను, మన దేశీయులు చాలమంది విదేశపు సన్నబట్టల ధరించుట గమనించి, అందుచే విదేశములకుపోవు ధనధార నాపుటకు, సన్ననూలు బట్టలమిల్లులను మనదేశమందే స్థాపించెను. విద్యావంతులను చక్కని కార్యకర్తలుగా తనమిల్లులందు తరిఫీయతుచేసి, తన వ్యాపారమర్మముల దెలియజేసి, వారిని నితరుల మిల్లులకును కార్యకర్తలుగ బంపుచుండెను. తనమిల్లులందలి క్రొత్తపద్ధతులను మిత్రులకందరకు మర్మము లేకుండ దెల్పి, ఆప్రకారము సన్ననూలుమిల్లుల స్థాపింపుడని, తోటిమిల్లుదారుల బ్రోత్సహించెను. చాలశ్రమకోర్చి అందుకైన విశేషవ్యయమును భరించి, క్రొత్తయంత్రముల దెప్పించి, ఆయన వానినుపయోగించుపద్ధతిని

ఇచటి జనులకు నేర్పెను. చాలసొమ్ము ఖర్చుపరచి, ప్రశస్తమగు ప్రత్తిని సాగుచేయువిధమును ఈజిప్టులో స్వయముగా నేర్చుకొని, ఆప్రత్తిని మనదేశమున పండించెను. నల్లమందు ఆబ్కారి మున్నగువాని వ్యాపారమువలన పూర్వమునుండి తోటిపార్సీమిత్రులు చాలలాభ మొందుచుండిరి. తనతండ్రియు తనను చీనాతో నల్లమందువ్యాపారమున దింపెను. కాని లాభకారియైనను, అవి ప్రజాహానికరములను భావమున,ఆవ్యాపారములను జంషెడ్జీ త్వరలో వదలిపెట్టెను. మనదేశమునకుపయోగించు క్రొత్తపరిశ్రమలస్థాపించుటే, ఆయనముఖ్యోద్దేశము. ఆయనకట్టించిన భవనములలోను అనుకరణీయమగు క్రొత్తపద్ధతులుండెను. ఆయాదర్శ పద్ధతులు క్రమముగా దేశమున నితరులకు మార్గదర్శకము లయ్యెను. ఆయన 'తాజ్ మహల్ హొటలు' విదేశీయుల సంస్థలకిన్నను మిన్నయై, భారతీయులగౌరవమును వృద్ధిచేసినది. ఆహొటలులోనాయన చక్కనియుచితగ్రంథాలయాముల నేర్పర్చెను.

పెద్దపరిశ్రమలకు, ఇంజనులు పనిముట్లు వస్తువులు ఏర్పడుటకు, మంచియినుము ఉక్కు అవసరములు. తక్కినవానికి కీలకమగు లోహపరిశ్రమస్థాపనవలననే అన్నిదేశములందు నితరపరిశ్రమ లేర్పడి, వానిసంపద హెచ్చినది. మనదేశమున పెద్దపరిశ్రమలస్థాపనకు, (ముఖ్యముగ చోదకశక్తికి లోహపరిశ్రమకు) అవకాశములేదని, అందుచే నెల్లకాలమును భారతదేశము వ్యవసాయదేశముగనె యుండుచు, విదేశములకు ముడివస్తువులనే

పంపుచు, పారిశ్రామికములగు కొన్ని విదేశములనుండి తయా రగువస్తువుల రప్పించుకొనుచుండవలెనని, చెప్పుచుండుట సాధా రణముగ వాడుక ; ఈ అపవాదము నిరాధారమని జంషెడ్జి మొదటనే తలచెను.

పూర్వము మనదేశమున నశ్వరముకాని యద్భుతమగు కుబ్ తుమినారు బోలు ఇనుపకట్టడము లేర్పడెను. చిత్రవిచిత్ర లగు రకరకముల ఖడ్గములు తయారై, అప్పటినాగరికలోకము కంతకు నెగుమతియాయెను. అందుచే, పెద్ద లోహఖను లీదేశ మున చక్కని సన్నివేశములతో నుండితీరవలెను. మనదేశపు సహజసంపత్తి యత్యధికము; ఇచ్చట అన్నివిధములగు శీతోష్ణ పరిస్థితులు, దాదాపు సకలవస్తువులు తయారగు వివిధతత్వముల భూతలములును, కలవు. మరియు ఆయాప్రాంతపు భూగర్భమున వివిధములగు గనులును గలవు. బాగుగపరిశోధనజరిగినచో, తగు లోహఖనులు దొరికితీరునని, ఆయనకు దృఢవిశ్వాసముండెను. కనుక కొందరు నిరుత్సాహపర్చినను, ఎన్నిచోట్ల తనప్రయత్నము విఫలమైనను, జంకక, ఆయన యనుభవముగల, గొప్పభూశా స్త్రజ్ఞులను, ప్రసిద్ధులగు వాస్తువిజ్ఞులను, స్వయముగ రప్పించి, ఇదివరలో నెవరును శోధించని కొండలను, అడవులనుగూడ, విశేషవ్యయ ప్రయాసలకు లోనై పరీక్షించెను; తనపుత్రమిత్రులు గూడ నట్లేచేసి సాధించునట్లు వారలను ప్రోత్సహించెను; ఆశ్రమఫలితముగనే, మనదేశమున ప్రశస్తమగు లోహఖనులు,

సున్నపురుగ్గులు, బొగ్గుగనులు, సమీపముననే కలవని, ఈదేశ మున గొప్పలోహపరిశ్రమ సుసాధ్యమే యని, తరువాత తేలెను.

ఈదేశమున గొప్పలోహపరిశ్రమను స్థాపించునట్లు ఆంగ్లదేశపు కోటీశ్వరులగు వ్యాపారనాయకులను ప్రోత్సహించి, అప్పటిరాజప్రతినిధియగు కర్జను ప్రభువుగారు చాలప్రయత్నించెను. (ఆయన మనదేశమందలి గనుల కౌలుషరతులనుగూడ సులభముగ చేసెను) కాని, ఇట్టిప్రశస్తమగు లోహఖను లచ్చట కలవని అప్పటికి వారికి తెలియదు. ఆయన యుద్దేశించిన బ్రిటిషుపారిశ్రామికు లెవరును అప్పు డందుకు సిద్ధపడలేదు. ఈలోగా జంషెడ్జితాతాయే అందుకు సిద్ధపడి, ఆపరిశ్రమకు పునాదివేసెను.*

ఇక్కే నేలబొగ్గు చౌకగను సమృద్ధిగను దొరకని బొంబాయి ప్రాంతమున నింకొక బలీయమగు చోదకశక్తి నెట్లైన సాధింపవలె నని ఆయనకు తోచెను. ఇంజనీరతో నాలోచించి, ఆయన పడమటికనుమలనుండి జలపాతముద్వారా విద్యుచ్ఛక్తిని సాధింప

---

*Lovat Fraser గారి India under Curzon and after అను గ్రంథమును, అందు ముఖ్యముగ 321-వ పుటలోని ఈక్రిందివాక్యమును చూడుడు. "Lord Curzon afterwords tried without success to induce prominent English capitalists to start great iron and steel works in India, and possibly nobody was more surprised than the Viceroy when the courageous and prescient Indian, the late Mr. Jamshedji Tata, volunteered to undertake the task."

నిశ్చయించెను; తుదకాపరిశ్రమ లాభకారియౌనని ఆయన ముందే గ్రహించెను; కాని, లాభముమాటయటుండ, ఈజల విద్యుచ్ఛక్తిపరిశ్రమ అచట కొనసాగుట సాధ్యమని దాదాపు యెవరికిని అప్పటికి నమ్మికలేకుండెను. తాతావారి నిరంతరకృషి వలన తుదకాపరిశ్రమయు జయప్రదమయ్యెను. దీని జయమును జూచి ప్రభుత్వమువారిప్పుడు పైఖారావిద్యుచ్ఛక్తిని స్థాపించి నారు. మరియు ఈ దేశమున హిమాలయాద్రి ప్రాంతము లందు చాలచోట్ల పెద్దజలపాతములు కలవు. అట్టిచోట్ల ముందికను ఈ పరిశ్రమ లేర్పడుటకు తాతాయుద్యమము మార్గ దర్శకమగును.

ప్రతిచర్యలోను ఆయన సంఘక్షేమమునే మనస్సునందుంచుకొనెను. జంషెడ్జికి స్వసంఘమగు పార్సీజాతియం దభిమానముండెను, కాని ఆయన సాంఘికదురభిమానముగాని, ఇతర సంఘములపైన నెట్టిద్వేషముగాని లేనివాడు. అందుచేతనసంస్థల వలని లాభమును భారతీయు లందరికి నిచ్చెను. ఆయనకు కులతత్త్వము, ప్రాంతీయభావము, లేవు. (తాతాసంస్థలు బొంబాయి యందే గాక వీలునుబట్టి నాగపురము బెంగుళూరు బిహారుప్రాంతము మున్నగు అన్నిప్రాంతములందును స్థాపింపబడినవి). భారతీయు లేకజాతియగుటచే, పరస్పరవిభేదములు తొలగి యైకమత్యము గల్గియుండవలెనని, తోటిపార్సీల నాయన ప్రోత్సహించుచుండెను.

విజ్ఞానాభివృద్ధి పరిశ్రమల జయమును దేశాభివృద్ధికి ముఖ్యావశ్యకములని, ఆయన చాలయేండ్ల క్రిందటనేగన్పెట్టెను. ప్రకృతిశాస్త్రజ్ఞానము వృద్ధికానిచో, పాశ్చాత్యదేశములకు జపానుకు ఇప్పటి యార్థికాధిక్యము కలిగియుండదు; రాజకీయప్రాబల్యమునను కొంతవరకదియేమూలకారణము. జంషెడ్జి అనేకవిజ్ఞాన గ్రంథములను గొని చదువుచుండెను; విదేశములందలి గొప్ప విజ్ఞానశాలల బరీక్షించెను. మనదేశీయులు విదేశములం దున్నత విజ్ఞానము గ్రోలునట్లు చేయుటకై, ఆయన కొన్నిలక్షల రూపాయల నిధి నేర్పఱ్చెను. మరియు మనదేశమందే ఉన్నతప్రకృతిశాస్త్రము నేర్పుటకు, పరిశోధనకు, 30 లక్షల రూపాయల స్థిరమగు ఆస్తినిచ్చి విజ్ఞానాలయము స్థాపించెను. ఇందును భారతీయు లందరికిని ప్రవేశముకలదు. ఆర్థికసమస్యలకు పరిశ్రమలకు సంబంధించిన గొప్ప గ్రంథముల నన్నిటిని తెప్పించి, ఆయన తన గృహమందు గొప్ప వైజ్ఞానికభాండార ముంచెను. ప్రపంచమునగల ఉపయోగములగు విశేషవస్తువులను వివిధఫలవృక్షాదులను ఆయనవిదేశయాత్రలందు సేకరించి, ఆశీతోష్ణాదుల ఆవశ్యకతలబట్టి వానిని నవసారిలోనో, బొంబాయిప్రాంతమందో, బెంగుళూరు సమీపముననో, తోటలలో నాటించి పెంచెను. ఈదేశమున, పాతాళగంగ నూతులను నాయనయే మొదలిడెను.

ఈకాలమున విదేశములందలి సరకులు చాలదిగుమతియగుచున్నవి; మన ఆర్థికస్థితి బాగుపడవలెనన్న, కీలకములగు కొన్ని

పెద్దపరిశ్రమలను అట్టి వైజ్ఞానికపద్ధతిని స్థాపించుటే మార్గమని నమ్మి, ఆయన ఆపరిశ్రమలకై కృషిచేసెను. కాని యాంత్రికపద్ధతిలో కొన్ని లోపములు కలవనియు ఆయన గ్రహించెను; వానిని తగ్గించుటకనేకయత్నముల జేసెను. కార్మికుల కందరకు ఆరోగ్యకరములగు ప్రత్యేకవసతిగృహములను ఆ యాకార్ఖానాల దగ్గర విశాలముగ గట్టించి, అందు మంచినీటికి, నీటిపారుదలకు విద్యాలయములకు, వ్యాయామశాలలకుగూడ, తగువసతుల గావించెను. వారికి చాల చౌకగ ఆహారవస్తువులను అందించుచుండెను. వారికిని అందలి ఉద్యోగులకును బహుమతులు, ఉద్యోగవృద్ధి, 'బోనసు' అనుపేర లాభములో వాటా కూడ, కలిగించెను. ఉన్నతోద్యోగులకు తనకంపెనీలో డైరక్టరులగుటకుగూడ అవకాశ మిచ్చెను. ఆపరిశ్రమ తమదే యనుభావము వారికందరికిని కల్గెను.

ఆయన సాధ్యమైనంతవరకు బస్తీల సమ్మర్దము తగ్గునట్లు చేయుచుండెను. ఎంప్రెసుమిల్లును, బొంబాయిలో గాక, అప్పటికి చిన్నదైన విశాలమగు నాగపురమునొద్ద కట్టెను. స్వదేశీ మిల్లును గూడ బొంబాయినగరమధ్యమునను అచటి మిల్లుల యొద్దనుగాక, దానికి కొంచెము దూరమగు 'కుర్లా' అను చోట ఏర్పర్చెను; 'జిన్నింగుమిల్లు' లను ప్రత్తిపండు ఆయా గ్రామములందే ఏర్పర్చెను; పట్టుపరిశ్రమను విశాలగ్రామములందు గృహపరిశ్రమగనే వృద్ధిచేయించెను. మనదేశపు మిల్లుసరు

కులపైన ప్రభుత్వము పన్ను వేసినప్పుడు, ఆపన్ను మగ్గములనేత బట్టలకును వర్తించవలెనని, లేనిచో పన్నులేని చేతిమగ్గపు సరుకుల పోటీవలన మిల్లులన్నిటికిని నష్టముకల్గునని, చాలమంది మిల్లుదారులు వాదించిరి. కాని తాతా అందు కొప్పుకొనక, గృహపరిశ్రమలకు సనుపాయము కలిగి, అందుచే కొందరు నేతగాండ్రు బాగుపడిన, అది మంచిదే యనిచెప్పి, ఆమిల్లుదారుల వారించెను.

ఆయన దయాశీలత దాతృత్వము అద్భుతములు. గొప్ప కోటీశ్వరుడైనను, చాల ఆదాయము వచ్చుచున్నను, చాల మితవ్యయపరుడై, ఆయన సత్కార్యములకుమాత్రము విరివిగా నిచ్చుచుండెను. విజ్ఞానాలయ మహాదానమేగాక, విద్యార్థులకు విద్యాసంస్థలకును లెక్కలేకుండ నిచ్చెను; కాని వీటైనంతవరకు గుప్తదానమే చేయుచుండెను. కాంగ్రెసుకు, అనేక సాంఘికసంస్థలకు, ప్రజోపయోగకరమగు క్లబ్బులకుకూడ, చాల సహాయము చేసెను.

సత్పాత్రదానముకు దీనుల ప్రోత్సాహముకు జంషెడ్జి వెనుదీయలేదు; కాని విచక్షణలేని వితరణ ఆయన కిష్టముకాదు. దృఢగాత్రులైనవారు సోమరులై, దేవాలయమో సత్రమో కట్టింతుమని పటాటోపముతో ఏదోపెద్దపేరుపెట్టుకొనియో, వివాహాదులకనియో, వచ్చి యాచించుచుందురు; ఆయన యేమియు వారలకిచ్చుటలేదు. ఆదానమువలన వారిలో ఆత్మగౌరవముపో

యి, సోమరితనము వృద్ధియగును; ఇంక ఆసోమరులస్థితి బాగుం డుటజూచి, ఇతరులును యాచకులే అగుదురు; ఇట్లు యాచకత్వమును ప్రోత్సహించుటచే, మనదేశముకు చాల హానికల్గుచున్నదని ఆయన యభిప్రాయము. మరియు ఇట్టి అనవసరదానముకు సొమ్ము ఖర్చుచేయుటవలన, జనుల కుపయుక్తమగు సంస్థలకు సహాయము లేకుండుటయు సంభవించును. ఎన్నియో ప్రజాక్షేమకరమగు సంస్థలు తగు ద్రవ్యసహాయము లేక, దీనస్థితిలో బడి క్షీణించుచున్నవి. అందుచే దేశాభివృద్ధికై పనిచేయునని తనకు తృప్తియగుసంస్థలకు, తమశక్తిని సద్వినియోగము చేయదలచు వ్యక్తులకును మాత్రమే, జంషెడ్జి ద్రవ్యసహాయము చేయుచుండెను.

ఇట్లే స్వశక్తివిషయమునను ఆయన ఉచితవ్యయసూత్రమునే గమనించెను. అనేకరంగములందొక్కరు పనిచేయదలచిన, అట్టివాని శ్రమయంతయు వ్యర్థమై, తగినంతఫలము లేకుండబోవును. సాధారణముగా మనశక్తులను మనతత్వముకనుకూలమగు కొన్నివిషయములందు మాత్రము కేంద్రీకరించుట యవసరమగుచుండును. మతవేదాంతాది విషయములందు రాజకీయములందుగూడ వాగ్వ్యయమొనర్చుట ఆయనప్రకృతికి ప్రతికూలము. మరియు అట్టిపనులచేయువారు మనదేశీయులలో నిప్పటికే చాలమంది గలరు. ఆర్థికపారిశ్రామిక విషయములందు కార్యరూపమున కృషిచేయువారు మనలో చాలతక్కువ. ఆకృషియత్యవసరము. తనశక్తి నందుకే జంషెడ్జివినియోగించెను.

కానితాతా అనేకార్థికరాజకీయసమస్యలను గృహమందును క్లబ్బులలోను దాదాభాయినౌరోజీ మెహతా వాచా మున్నగు రాజకీయనాయకులతోను వ్యాపారమిత్రులతోను చర్చించుచుండెను.

1885లో, జాతీయమహాసభ ఆరంభించినప్పటినుండి చనిపోవువరకును, జంషెడ్జి అందుసభ్యుడై హాజరగుచు, అందుకును బొంబాయి ప్రాంతీయరాజకీయసభకును చాలద్రవ్యమునిచ్చెను. రాజకీయములగూర్చి, ఆయనకు నిశ్చితాభిప్రాయములుండెను. ఆయన మితభాషియైనను, మెహతా వాచాలవలె మితవాది కాదు; దాదాభాయినౌరోజీవలె జాతీయభావము గలిగియుండెను. నాణెములపద్ధతి, వెండికి బంగారమునకు ఉండదగు సంబంధము, దిగుమతిపన్నులు, మనమిల్లులనునులపై పన్నులు, బొంబాయి నివేశనపుపన్నులు, ప్రశస్తమగు ప్రత్తిసాగు, కార్మికసమస్య ఇట్టి సమస్యలగూర్చి ఆయనవ్రాసిన దీర్ఘవ్యాసములు అమూల్యమగు ఆర్థికసిద్ధాంతముల చర్చతోగూడి, చక్కని జాతీయభావములతోనిండియున్నవి.

న్యాయవాదిత్వము మున్నగు వృత్తులకన్న పరిశ్రమల వృద్ధిచేయుటయే సంఘమునకు, ముఖ్యముగ బీదలకు, హెచ్చుగ లాభకరము. పరిశ్రమలవృద్ధి దేశసంపదను వృద్ధిచేయును. అందుకవసరమగు జ్ఞానమును అనుభవమును ప్రత్యేకగుణములను జంషెడ్జి వృద్ధిచేసికొనెను. “భారతీయుల కవసరమై,

వారియం దిప్పుడు లోపించియున్న, గుణశక్తు లన్నియు జంషెడ్జితాతాయందే మూర్తీభవించెను." అని యొక యాంగ్ల చారిత్రకుని వచనము.* చుట్టుచు వలయునంత జనుము పండుచున్నను, దగ్గరనే రాణిగంజిలో బొగ్గుగనులున్నను, తగినంత విజ్ఞానము వ్యాపారదక్షత లేక, వంగదేశమున జనపనార మిల్లులను మనదేశీయులు స్థాపింపలేరు. ఇంతలో విదేశీయు లా సౌకర్యములగనిపెట్టి కలకత్తాప్రాంతమున అట్టిజనపనారమిల్లుల చాల స్థాపించి, సాలీనా కోట్లకొలది రూపాయలను లాభముగ గ్రహించుచున్నారు. జనపనార (ప్రపంచమంతటను మనదేశమందు మాత్రమే సమృద్ధిగ పండును. మనదేశమునగల ప్రకృతిసౌకర్యముల నుపయోగించుకొనక మనము విడచినచో, వానినిబట్టి విదేశీయులిచటనే పరిశ్రమల స్థాపించుకొందురు; అంతట వానిని మనదేశీయులు మరల స్వాధీనముచేసుకొనుట సుసాధ్యము కాదు.)

జంషెడ్జి తాతా స్వశక్తిని నూతన పరిశ్రమల వృద్ధిలోనే కేంద్రీకరించి, వానిని జయప్రదముగనడపెను. భారతీయులు పెద్ద పెద్ద పరిశ్రమల నడుపలేరను అపవాదమును తాతా, తరువాత ఆయనమిత్రులును, తొలగించిరి. ఇదివరలో మనదేశమున

*"There has been hardly any other man among its millions who may more fitly be said to have united within himself the qualities of which the Indian people are greatly in need, ('India under Curzon and After' by Lovat Fraser P. 321.)

తయారుకాని నిత్యావసరములగు అనేక యాంత్రిక వస్తువుల నిప్పుడు మనదేశీయులు తయారుచేయుచున్నారు.

కాని ఆయనజాతీయతలో విదేశీయులపై ద్వేషములేదు. ఆయన తన జ్యేష్ఠపుత్రునికి ఆంగ్లదేశమున విజ్ఞానవిద్యకు కేంద్రమగు కేంబ్రిడ్జిలో విద్యాభ్యాసముచేయించెను. ఆంగ్లేయులు ఇతరవిదేశీయులు నెందరో యీదేశమున, విదేశములందుగూడ, ఆయనకు మిత్రులైయుండిరి. జంషెడ్జి జాతీయవాదియైనను, పెద్ద యుద్యోగులకు బొంబాయిగవర్నరుకు, అప్పటి రాజప్రతినిధి యగు కర్జనుప్రభువుకు, లండనులో భారతమంత్రికిగూడ, ఆయనయందు చాలగౌరవభావ ముండెను. తగు భారతీయులు దొరకని (ప్రత్యేకప్రజ్ఞ నైపుణ్యముకావలసిన) కొన్నికార్యములకై, ఆయన కార్యాలయములందు (విజ్ఞులగు) పాశ్చాత్యులును ఉద్యోగులుగ నుండిరి. ఆయన ఇట్లు సర్వసముఁడయ్యు, స్వదేశమం దమితప్రేమ గలిగియుండెను.

బొంబాయిహైకోర్టులోను, తరువాత కలకత్తాహైకోర్టులోను ప్రధానన్యాయాధిపతిగ నుండి, ఇటీవల ప్రీవీకౌన్సిలు జడ్జిగనుండిన సర్ లారెన్సు జంకిన్సుగారు జంషెడ్జితాతా నిరాడంబరుడని ఆయనమాతృదేశభక్తి మితిలేనిదని తమసదభిప్రాయము తెల్పిరి.*

---

*"Wealth came to him in full measure, but he remained to the last what he was by nature, a simple, modest man, seeking neither title nor place, and loving, with a love that knew no bounds, the country that gave him birth."

## టాటా చరిత్రకు సంబంధించిన ముఖ్యవృత్తాంతములు.

1839- జంషెడ్జితాటా జననము.

1853- ,, కళాశాలాప్రవేశము.

1856- ,, వివాహము.

1857-58 సిపాయియుద్ధము.

1859- { వ్యాపారారంభము (చీనాతో)
జ్యేష్ఠపుత్రుని జననము.

1864- ఇంగ్లండు ప్రయాణము.
(దూది యెగుమతి వ్యాపారము.)

1857-68 అబిసీనియా యుద్ధము.

18,0- (బొంబాయి) 'అలెగ్జాండ్రా' మిల్లు స్థాపనము.

1877- (నాగపురం) ఎంప్రెసుమిల్లు ఆరంభము.
విక్టోరియారాణి మనదేశపు చక్రవర్తిని అగుట.

1882- లోహపరిశ్రమకై ప్రయత్నారంభము.

1885- భారతజాతీయమహాసభాస్థాపనము.

1886- { (బొంబాయి) 'స్వదేశీమిల్లు' ఆరంభము.
నస్సర్వంజితాటా మరణము.

1887- ఆర్. డి. టాటా, దోరాబ్జితాటా, టాటా అండ్ సన్సులో చేరిరి.

1892- విదేశవిద్యావేతనపుఫండు ఏర్పాటు;
హోష్రైలు కమిటీని వేదిక.

1893-94 { టాటా జపాను నౌకాసంఘము.
(మైసూరు) పట్టుపరిశ్రమ ఆరంభము.

1894- మిల్లుబట్టలపన్ను తగాదా ఆరంభము.
1896- ఈజిప్టుప్రత్తిసాగు యత్నపు ఆరంభము.
1897- జలవిద్యుచ్ఛక్తికై ప్రయత్నారంభము.
1898- విజ్ఞానాలయముకై ఆస్తి దానము.
1898- 'తాజ్‌మహాల్' హోటలు నిర్మాణారంభము. (బొంబాయి)
1899- కర్జను ప్రభుత్వారంభము.
1900- అడ్వాన్సుమిల్లు సంపాదన (అహమ్మదాబాదు).
1903- { 'తాజ్‌మహాల్' హోటలు సంపూర్తి.
క్రొత్తలోహపుగనుల గనుగొనుట.
1904- జంషెడ్జితాతా మరణము.
1907- తాతా లోహపరిశ్రమసంఘపు స్థాపనము.
1910- తాతా జలవిద్యుచ్ఛక్తిసంఘపు స్థాపనము.
1911- విజ్ఞానాలయపు పని ప్రారంభము.
1915- దొరాబ్జి భారతపారిశ్రామికసభ కధ్యక్షుడగుట.
1916- ఆంధ్రలోయ విద్యుచ్ఛక్తిసంఘపు స్థాపనము.
1918- రత్నజీతాతా మరణము.
1919- తాతా పవర్ సప్లైకంపెనీ స్థాపనము.
,, జంషెడ్పురపువృద్ధి, నామకరణము.
,, తాతా పవర్‌సప్లై కంపెనీ స్థాపనము.
1932- దొరాబ్జితాతా మరణము.

---

# పారిభాషికపదసూచి.

---

అనుబంధపరిశ్రమ Auxiliary industry

అయోమయము Permeated with iron

ఆర్థికోన్నతి Economic uplift

కీలకపుపరిశ్రమ Key industry

ఖనిజశాస్త్రము Mineralogy

గ్రాహకస్థానము Receiving station

చోదకశక్తి Driving power, mechanical energy

జనకయంత్రము Generating plant

జలవిద్యుచ్ఛక్తిశాల Hydro-Electric works

నౌకాపరిశ్రమ Shipping business

పాతాళగంగనూతులు Artesian wells

పారిశ్రామికప్రతిభ Industrial genius

పారిశుధ్యశాస్త్రము Sanitary science

పుంజీపతులు Capitalists

పురనిర్మాణపద్ధతులు Town planning schemes

పౌరసేవ Civic service

బహుళోత్పత్తి Mass production

భూతత్వజ్ఞులు Geologists

భౌతికశాస్త్రము Physical science

యంత్రవాస్తువిద్య Mechanical engineering

లోహయంత్రశాల Iron and steel works

లోహవాస్తుశాస్త్రము Metallurgical engineering

విజ్ఞానాలయము Science institute

విజ్ఞులు Experts

సాంఘికశాస్త్రము Sociology

సార్వజనికనగరము Cosmopolitan city

సుంకములు Customs duties.

---

# సవరణపట్టిక.

| పుట. | పంక్తి. | ఉన్నది. | ఉండవలసినది. |
|---|---|---|---|
| 6 | 11 | పూర్వీకు | పూర్వికు |
| 7 | 16 | నవసారి | బొంబాయి |
| | 17 | తాతా | తాతావసించిన |
| 3 | 9 | 1860 | 1859 |
| 12 | 5 | స్థంభిం | స్తంభిం |
| 15 | 1 | నిత్వ | నీత్వ |
| | 7 | సామాగ్రి | సామగ్రి |
| 25 | 9 | కితర | కితరుల |
| 26 | 7 | సాహాయ | సహాయ |
| 28 | 10 | సన | సన్న |
| 35 | 2 | స్తులే | సుధలే |
| | 4 | మస్యల | స్యల |
| 42 | 14 | రేవు | కేవు |
| 45 | 9 | తము | తముగ |
| 48 | 1 | పునీత | పూత |
| | 9 | నిచ్చయిం | నిచ్చగిం |
| 52 | 9 | నిర్భంధిం | నిర్బంధిం |
| 53 | 10 | నూలుపె | నూనుపై |
| 59 | 10 | శీతోష్ట | శీతోష్ణ |
| 60 | 1 | న్నారు | చున్నారు |
| | 2 | పాశ్యాత్య | పాశ్చాత్య |
| | 14 | ముకును | ముకు |
| 61 | 14 | త్రిద్ధి | తివృద్ధి |
| 62 | (శీర్షిక) | 10 | 11 |
| 64 | 19 | బోట్ల | పోట్ల |
| 65 | 7 | యిష్ట | యిష్ఠ |

168



| | | | |
|---|---|---|---|
| 66 | 8 | అదర్శ | ఆదర్శ |
| | 13 | శ్యాత్య | శ్చాత్య |
| | 18 | చామ్మ | సామ్మ |
| 67 | 8 | గత్త | గ్రత్త |
| | 21 | ఆందు | అందు |
| 68 | 16 | ఆమె | అమె |
| 69 | 1 | స్ఫంభ | స్తంభ |
| | 2 | యంతస్ఫు | యంతస్తు |
| | 4 | చ్చక్తి | చ్ఛక్తి |
| 75 | (శీర్షిక) | 11 | 12 |
| 76 | 16 | తర్స | త్సర |
| 80 | 7 | సాశ్యాత్య | పాశ్చాత్య |
| | 10 | అంత | అత |
| 86 | 18 | పాశ్యాత్య | పాశ్చాత్య |
| 88 | శీర్షిక | 12 | 13 |
| 93 | 13 | కవుల | కవులు |
| 101 | 18 | తగుట | తగ్గుట |
| 103 | 11 | స్ఫంభ | స్తంభ |
| 110 | 6 | పము | సము |
| 115 | 19 | ప్రాంతముప | ప్రాంతమున |
| 122 | 14 | రస్తు | రు |
| 123 | 5 | దాకుడు | దాకుట |
| 127 | 14 | చుట్లు | చుట్టు |
| 131 | 4 | కుయొగు | కెగు |
| 142 | 3 | తాతాకరాచీ | కరాచీ |
| | 10 | స్పహృ | సుహృ |

# జగత్కథనుగూర్చి కొన్ని అభిప్రాయములు.

శ్రీ డా. రాధాకృష్ణగారు :- "గ్రంథకర్తపాండిత్యము, భావవైశద్యము,...విషయములయెడ అభిప్రాయములయెడ వీరికిగల అనంతసామర్థ్యమును ఇందలి ప్రతిపుటయును వెల్లడించుచున్నది."

---

శ్రీ క. రామలింగారెడ్డిగారు :—

"ఇది రసజ్ఞులెల్లరు చదువవలసిన మహాద్భుత గ్రంథము. ప్రపంచపరిణామమును అందుభారతదేశపు ఉచితస్థానమును ఆంధ్రు లీగ్రంథముచే తెలుసుకొనగలరు."

---

ఆంధ్రపత్రిక:—'ఆంధ్రభాషాప్రపంచమందింకొక మంచిగ్రంథమును జేర్చినారనుటకెట్టిసందేహమును లేదు.'

---

ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక :—'ప్రతి యాంధ్రుడును జదువదగినది.'

---

భారతి:—'ఈజగత్కథారచనము మనయాంధ్ర భాషాచరిత్రమునందొక విస్ఫుటయుగమును స్థాపించును.'

---

గృహలక్ష్మి :—'వెల్సుగారి గ్రంథము కంటెను గూడ ఏడాకులు మిన్నయని యుభయగ్రంథములను పఠించినవారికి తెలియకపోదు.'

